# కథాగుచ్ఛము

## రెండవభాగము

## రవీంద్రనాథ ఠాకూర్





అనువాదకులు

శోభనాదేవి

హేమంతరావు



విశ్వభారతి

చెన్నపురి ఏజన్సీ

3౨3 తిరువత్తూరు హైరోడ్

చెన్నపురి

ప్రకాశకుడు:

కా. వైకుంఠరావు

౩౨౩ తిరువత్తూరు హైరోడ్

మద్రాసు

---

విశ్వభారతి గ్రంథమాల—౬

# కథాగుచ్ఛము

## రెండవభాగము

౧౯౨౯

వెల రూపాయి పావలా

---

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

౨౯౨ ఎస్ప్లనేడ్ చెన్నపురి, ఈ.

# విషయసూచిక

| | పుట |
|---|---|
| ప్రతిజ్ఞాపాలన | ౧ |
| సెలవులు | ౪౭ |
| అపరిచితా | ౬౪ |
| మాస్టరుగారు | ౯౦ |
| భార్యవ్రాసిన ఉత్తరము | ౧౬౪ |
| ఒకటవనంబరు | ౧౯౯ |

ఈ కథలు మొట్టమొదట బంగాలీభాషలో ప్రచురింప
బడ్డ సంవత్సరాలు కథలచివరను ముద్రింపబడ్డవి.

ఈ పుస్తకములోఉండే పటము 'ముకుల్ దే' గారు ౧౯౧౭-వ సంవత్సరమున చిత్రించిన 'పెన్సిల్ స్కెచ్,' దానిని అచ్చువేయించి ప్రచురించిన 'అమల్ హోమ్' గారి అనుమతి పైని ఇందు చేర్చబడ్డది.

# ప్రతిజ్ఞాపాలన

తన తమ్ముడు "రసిక్"అంటే వంశీవదనుకు ఉండే ప్రేమా, ముద్దూ తల్లికి పిల్లలయెడలనైనా ఉండదు. రసిక్ ఎప్పుడైనా బడినుంచి ఇంటికి రావడము ఆలస్యము చేసేడా అంటే తాను చేస్తూఉన్న పనిఅంతా విడిచిపెట్టి తమ్ముని వెదకడానికి బయలుదేరేవాడు. తమ్ముడు భోజనముచేయనిదే తాను భోజనము చేయలేకపోయేవాడు. రసిక్ ఒంట్లో సుస్తీగాఉన్నది అనేసరికి అన్నకళ్లవెంట నీళ్లు కారిపోయేవి.

వంశి రసిక్ కంటె పదహారేళ్లు చిన్న. వంశి తరువాత పుట్టిన తమ్ములూ చెల్లెళ్లూ అంతా చనిపోయినారు. మిగిలినది ఆఖరువాడు ఈ రసిక్ ఒక్కడే. తల్లి చనిపోయినప్పటికి వీనికి ఒక సంవత్సరము. మూడేళ్లు వచ్చేసరికి తండ్రికూడా పోయి-నాడు. అప్పటినుండి రసికును పెంచి పెద్దవానిని చేసేపూచీ పూర్తిగా వంశి ఒక్కనిమీదనే పడ్డది.

వీళ్లకుటుంబములో తరతరాలుగా వస్తూఉన్న వృత్తి బట్టలనేత. ఈ వృత్తివల్లగడించినదానితోనే వీళ్ల ముత్తాత అభిరామ్ బసాక్ గ్రామములో కోవిలకట్టించాడు. ఆకోవిలలో ప్రతిష్ఠఅయిన రాధానాథునికి పూజ ఈనాటివరకు జరుగుతూ-నేఉన్నది. కాని సముద్రాలు దాటివచ్చిన విదేశపుదైత్యదళము

వీళ్లమగ్గాలమీాద అగ్నిబాణాలు వదిలి వీళ్లఇళ్లల్లో క్షుధా-దేవతను నిలిపి పొగగొట్టాలతో జయశంఖము విరామము లేకుండా ఊదడము ప్రారంభించారు.

అయినా దేవాంగులు చావలేదు. వాళ్లప్రాణము మహాగట్టిది. దారము నోట కరుచుకొని మగ్గాలలోని (నాడెలు) ఉడతలు టిక్కుటక్కు మనుకొంటూ ఇప్పటికీ ఇటూఅటూ నడుస్తూనే ఉన్నవి. కాని ఆ ముసలి కాలపునడకమీాదికి చంచల-లక్ష్మి మనస్సు ఇప్పుడు పోకుండాఉన్నది. లోహనిర్మిత్తమైన దైత్యదేవత, భయాన్నైతేనేమి నయాన్నైతేనేమి, ఆమెను తనవశములో ఉంచుకొన్నది.

వంశీవదనును కాపాడుతూవచ్చినది ఒక్కటి ఉండెను. థానాగర్‌లో బాబూలు వంశదగ్గరనే బట్టలు కొనేవారు. వారిది పెద్దకుటుంబము; ఆ కుటుంబానికీ వారి బంధువులకూ మిత్రులకూ కావలసిన నాజూకుబట్టలన్నీ వంశీవదనే నేసి ఇచ్చేవాడు. ఇన్నిబట్టలు ఒక్కడే నేయలేడుగనుక తనచేతికింద కొంతమందిని జీతమిచ్చి ఉంచేవాడు.

వాళ్లకులములో ఆడపిల్లలవెల చాలాజాస్తీ. అయిన-ప్పటికీ ప్రయత్నముచేస్తే ఎలాగోఒకలాగు వంశికి భార్య జత-పడకపోదు. కాని రసిక్ మూాలాన ఆలాంటిది వీలయిందికాదు. దుర్గపూజనాటికి రసిక్ కోసము కలకత్తానుంచి ప్రతిసంవత్సరమూ తెప్పిస్తూఉండే బట్టలముందర నాటకములో మహారాజు

వేషము వేసినవాడి బట్టలుకూడా వెలవెల్లాడిపోయేవి. తక్కిన అన్ని విషయాలలోనూకూడా రసికుకోసము అనవసరమైన ఖర్చులన్నీ చేస్తూఉండడముచేత వంశికి అవసరమైన ఖర్చులకైనా డబ్బు చాలేదికాదు.

ఏమైనాసరే, వంశముమాత్రము నిలబెట్టవలెను కదా. కనుక తన ఇంటికితగిన పిల్లను ఒకామెను తనలోతాను నిశ్చయముచేసుకొని రూపాయిలు కూడపెట్టడము ప్రారంభించాడు వంశి. మూడువందలు ఇస్తేనేగాని పిల్ల దొరకదు. నగలకూ తక్కి వఖర్చులకూ కనీసపక్షము మరిఒక వందైనా కావలెను. ఈ నాలుగువందలూ జమచేదామని ఇంటిఖర్చులుకాగా మిగల్చగలిగినదంతా ఒకచోట ఎడముగా ఉంచుతూవచ్చాడు. తక్షణము చేతిలో రూపాయిలు లేవు, నిజమే; కాని కావలసినంత వ్యవధి ఉన్నది. పిల్లకు ఇప్పుడే నాలుగో ఏడు వచ్చింది, ఏమిలేదన్నా ఇంకా నాలుగైదుసంవత్సరాలు ఉంచవచ్చును.

కాని రసికుదృష్టి అంతా వంశిధనరేఖమీాదనే ఉండేది, ఆ దృష్టి శుభదృష్టికాదు.

ఆ పల్లెలోని పిల్లవాళ్లమీాదా, తనతోటి కుర్రవాళ్లమీాదా అధికారము చలాయిస్తూఉండేవాడు రసిక్. సుఖముగా తిని పెరుగుతూ, ఏదికావలంటే అది సంపాదించుకో గలిగేవాళ్లనుచూస్తే భాగ్యదేవతఅనుగ్రహాము లేకపోవడము-

చేత ఏకోరికా నెరవేర్చుకోలేనివాళ్లకు చాలా ఆకర్షణ. అటువంటివాళ్లతో భుజముభుజము రాసుకొంటూ తిరగ-గలగడమే కోరికలు నెరవేర్చుకోవడముతో కొంతవరకు సమానము. కలవాళ్లతో స్నేహాముచేయడమువల్ల మనకూ ఏదో క్వాస్త దొరుకుతూఉంటుంది అని కాదు మనము వాళ్ల ఇళ్లకు వెళ్లడము—ఊహద్వారా మనవాంఛలు కొంతవరకు తీరుతూఉంటవి, వాళ్లు మనకు ఏమీ ఇవ్వకపోదురు గాక.

కేవలము, రసిక్ చక్కనిబట్టలు కట్టుకొనేవాడు అనిగాని అతనిదగ్గిర నానారకాల మంచిమంచి వస్తువులు ఉన్ననిగాని అందరూ అతనివెంట పడుతున్నారు అని అనుకోవడము ధర్మముకాదు. అతనికంటె అనేకరెట్లు గొప్పకుటుంబాలపిల్లలు-కూడా అతనినిచూచి చాలా సరదాపడుతూ ఉండేవారు, అతనిని మెచ్చుకోకుండా ఉండలేకపోయేవారు — రసిక్ ఏపనిలో చెయ్యిపెడితే ఆపని అంతచక్కగా అంతసులువుగా చేయగలిగేవాడు. మనతో పుట్టి మన మనస్సులను అణిచిపెట్టి-ఉంచుతూఉన్న అజ్ఞానము అతనిని ఏమీచేయలేకపోయింది. అందుచేత ఎటువంటిపనినైనా ఒక్కక్షణములో గ్రహించి చేయగలిగేవాడు అని అందరికీ అనిపించేది.

రసికులో ఇటువంటి గొప్పనిపుణత ఉండడముచేత తోటిబాలురూ, బాలికలే కాక ఊళ్లోఉండే పెద్దవాళ్లుకూడా అతని సహాయము కోరుతూఉండేవారు. కాని అతనిలో ఒక

గొప్పదోషము ఉండేది. అ దేమిటనగా అతను దేనిలోనూ పదిరోజులు ఒక్కవరుసను మనస్సునిలిపి ఉంచలేకపోయేవాడు. ఏవిద్యఅయినా పట్టుపడ్డది అనేసరికి దానిమీద అతనికి విరక్తి పుట్టిపోయేది. ఆవిద్య నేర్చుకొందామని ఎవరైనా తనదగ్గిరికి వస్తే అతి చికాకు పడేవాడు. ఆ ఊరిలో గొప్పఇంటివారు ఒకరు దుర్గపూజలకోసము కలకత్తానుంచి బాణాసంచ చేసే-వాళ్లను తెప్పించారు. వాళ్లదగ్గిర ఆ విద్య నేర్చుకొని కాళీపూజనాటిరాత్రి ఊరంతా పగటికంటె వెలుతురుగా చేసేశాడు. ఈలాగు రెండుసంవత్సరాలు జరిగింది, మూడో సంవత్సరము బాణాసంచ ఆనవాలుకైనా కనబడలేదు; అప్పటి-కప్పుడే అతనికి మందుగుండుసరదా వదిలిపోయింది. అంగర్ఖా మీద మెడల్సు వేలవేసుకొని ఆ ఊరువచ్చిన హార్మో-నియమ్ వాద్యగాని చూచి వాయిద్యముమీద ఉత్సాహము పుట్టింది. చేతిహార్మోనియమ్మీద లక్నోటుంరీ అభ్యాసము-చేస్తూ కూర్చున్నాడు.

రసిక్‌లో ఉన్న ఈ అద్భుతమైనశక్తి చంచలమతి. దాని లీలలలో పడి ఒకప్పుడు నలుగురికీ సులభముగా దొరుకుతూ, మరిఒకప్పుడు దొరకకుండా ఉండేవానివైపే నలుగురి మన-స్సులూ వెళుతూఉంటవి. అతని అన్నగారిమాట మరి చెప్పనే అక్కరలేదు. 'ఇటువంటి అద్భుతమైన పిల్లవాడు మనఇంటిలో పుట్టాడు, ఆహా, వాడు ఏలాగునైనా బ్రతికిఉంటే అంతే-చాలును,' అని తప్ప వేరే ఆలోచనేదీ ఉండేది కాదు.

అన్నగారికి. ఆలాగున అనుకొంటూ అనుకొంటూ కళ్ల నీళ్ళు పెట్టుకొనేవాడు వంశి; తన తమ్మునికంటె తానే ముందు చని-పోయేటట్టు చేయమని రాధానాథుని రోజూ ప్రార్థిస్తూఉండే-వాడు.

ఇంత గొప్పసామర్థ్యముగల తమ్మునిసరదాలు తీర్చదగి-నవే! కాని అది రోజుకొకటి క్రొత్తగా పుడుతూఉండడముచేత అవి తీరుస్తూఉండేసరికి ఇంటికిరాబోవు వధువు వెనకకుజరిగి, దూరానఉన్న భవిష్యత్తులో అంతర్ధాన మయిపోతూవచ్చింది; తన వయస్సుకూడా నిలుచొని ఉండలేదు. అప్పటి కప్పుడే ముప్పై దాటిపోయినవి. రూపాయలు ఇంకా నూరైనా కాలేదు. ఆ పిల్ల ఇంకొకరింటికి కాపురానికి వెళిపోయింది. అప్పుడు వంశి తనవిషయమై మరి ఆశించకూడదని నిశ్చయించు-కొని వంశము నిలుబెట్టే భారము ఇక రసికుడే అని అను-కొన్నాడు.

ఆపల్లెలో స్వయంవర వివాహమే ఆచారమయిఉంటే రసిక్ పెళ్లిగురించి ఎవ్వరూ బెంగపెట్టుకో నక్కరలేదు. తారా, శశీ, ననీ, సుధా, విధూ—నోటికి వచ్చినపేరు అనండి, రసికుని ప్రేమించని పిల్ల అందులో ఉండదు. ఒకమారు రసిక్ మట్టి బొమ్మలుచేయడము సరదాలో పడ్డాడు. అందులో ఈ బొమ్మ నాది ఆ బొమ్మ నాది అని ఆ బాలికలలో అనేక కలహాలు పుట్టి జట్లు విప్పుకోడాలుకూడా జరిగినది. ఆపిల్లలలో సౌరభి అని

ఒకటె ఆమెఉండేది. ఆమె అతినెమ్మదైన పిల్ల; ఏమీ మాటలాడ-కుండా కూర్చొని ఆ బొమ్మలుచేయడము చూస్తూఉండడమంటే చాలా సరదా ఆమెకు. అక్కడకూర్చొని మట్టిముద్దలూ కర్ర-ముక్కలూ, ఏది అవసరమైతే అది అందిస్తూ ఉండేది. రసిక్ తనను ఏదైనా చేయమనిగాని తెచ్చిఇయ్యమనిగాని చెపు-తాడాఅని ఎప్పుడూ చూస్తూఉండేది. పని చేస్తూచేస్తూ రసిక్ తమలపాకులు అడుగుతాడని తెలిసి సౌరభి తమలపాకుల సరంజామ ఎప్పుడూ తయారుగా ఉంచుకొనే వచ్చేది. బొమ్మలు పూర్తిఅయినతరువాత అవన్నీ వరసగా పేర్చి 'నీకు ఏది బాగుంటే అది తీసుకో,' అని సౌరితో అనేవాడు. తనకు ఇష్ట-మువచ్చినది సౌరభి తీసుకోవలెననే రసిక్ ఉద్దేశము గాని సౌరి సంకోచించి దేనినీ తీసుకొనేదికాదు. అప్పుడు రసిక్ తనకు బాగున్నదని తోచినదానిని తీసి సౌరభిచేతిలో పెట్టేవాడు మట్టిబొమ్మలపర్వము ముగిసి హార్మోనియమ్ పర్వము ప్రారంభ మయేసరికి ఊళ్లోపిల్లలంతా ఆ హార్మోనియమ్ బిళ్ళలు నొక్కి వాయించాలని సరదాపడుతూ రసిక్ చుట్టూ మూగడము ఆరంభించారు. రసిక్ హూత్ హాత్ మని కేకలు వేస్తూవాళ్ళను బెదరగొడుతూ ఉండేవాడు. సౌరభిమాత్రము ఏమీ గడబడ చేసేదికాదు; చారలచీర కట్టుకొని గడ్డముకింద చెయ్యిఆనుకొని తన పెద్దపెద్దకళ్లురెండూ మరింతపెద్దవిగా చేసి అతి ఆశ్చర్యముతో చూస్తూ అతనిఎదుట కూర్చొనేది. 'ఇలా రా సౌరీ!' అని పిలిచేవాడు రసిక్. సిగ్గుపడుతూ

నవ్వేది సౌరి, దగ్గిరికి వచ్చేది కాదు. రసిక్ సౌరి చెయ్యి పట్టుకొని బలవంతాన ఆమె వేళ్ళతో హార్మోనియమ్ వాయించే-వాడు.

రసికుని భక్తబృందములో ముఖ్యమైనవా డొకడు సౌరభిఅన్న, గోపాల్. అన్నకూ చెల్లెలకూ ముఖ్యమైన భేదము ఒకటి ఉన్నది—మంచి వస్తు వేదైనా చూపించి అది తీసుకో అని అన్నను బ్రతిమాలడము అవసరముఉండేది కాదు. తనకు కావలసిదేమిటో తానే చెప్పేవాడు, తాను కోరినది దొరకక-పోతే నలుగురినీ చికాకుపెట్టేసేవాడు. అతను కొత్త ద్దేదైనా చూస్తే అది తనకు దొరికేవరకు ఎవరినీ నిలువనిచ్చేవాడు కాడు. రసిక్ ముద్దూమురిపెమూ ఎవ్వరిలోనూ సహించి ఊరుకో-వలసినవాడు కాకపోయినా గోపాల్‌నుమాత్రము ఏమీ అనే వాడు కాడు—అతను ఏమిచేసినా ఊరుకొనేవాడు, గోపాల్ నలుగురి మోస్తరూ కాదు, రసిక్‌కు.

ఆ సౌరభినే రసిక్‌కి ఇచ్చి పెళ్లిచేయవలెనని వంశి తనలో తాను నిశ్చయించుకొన్నాడు. కాని సౌరభీ గొప్పఇంటి బిడ్డ, ఐదువందలు చేతిలో లేకపోతే అటువంటిఆశ పెట్టుకో-కూడదు. నేతపనిలో తనకు సహాయానికి రమ్మని ఇప్పటివరకు వంశి రసికుని పిలవలేదు, ఆ కష్టమంతా తనఒక్కనినెత్తిమీదనే పెట్టుకొన్నాడు. రసిక్ నానారకాల పనికిమాలిన పనులన్నీ చేస్తూ లోకులమనస్సును రంజింపజేస్తూఉంటే 'ఇంతకంటె

ఆనందము ఏదీ?' అనుకొనేవాడు వంశి. 'అన్న రోజూ ప్రొద్దస్తమానము ఆ మగ్గముదగ్గిరే పడిఉంటాడు, అది ఏలాగో నాకు బోధపడకుండా ఉన్నది! నేను చచ్చినా అలా పడిఉండ లేను,' అని రసిక్ తనలోతాను అనుకొనేవాడు. వంశి తనవిష-యమయి ఖర్చుఅనేసరికి చాలాబింకముగా ఉండడము చూచి 'అన్న అతి లోభి,' అని రసిక్ అనుకొనేవాడు. అన్నమాట అనుకొన్నప్పుడల్లా రసిక్‌కు మనస్సులో కావలసినంత సిగ్గుగా ఉండేది. అన్నా తానూ ఏవిషయాన్నిబట్టి చూచినా వేరువేరు తరగతులవాళ్లు, అని చిన్నప్పటినుండి రసికుని అభిప్రాయము. అన్నదికూడా రమారమి అదే అభిప్రాయిము.

ఈస్థితిలో ఉంటూఉండగా వంశి తనపెళ్లిఆశ వదులుకొని తమ్ముడు పెళ్లాన్ని ఇంటికి తీసుకురావలెను, అని దీక్షపట్టాడు; ఈ కొత్తకోరిక పుట్టినప్పటినుంచీ మునుపటివలె ఓర్చి ఉండలేక పోయేవాడు. ఒకొక్కమాసము ఆలస్యము అవుతూఉంటే సహించి ఉండడము మరింత అసాధ్యము అవుతూఉన్నది—బాజాభజంత్రీలు వాగుతున్నవి; దీపాలువెలిగించారు; పెళ్లి ముస్తాబుతో కూర్చున్నాడు రసిక్—ఈ ఆనందదృశ్యము తృషార్తుని ఎదుట నున్న మృగతృష్ణఅయి వంశికి కళ్లకు కట్టినట్లుగా కనబడుతున్నది.

అయినప్పటికీ రూపాయిలు త్వరగా జమకాకుండా ఉన్నవి. ప్రయత్నము అధికమవుతున్నకొలది సఫలత దూర మయిపోతున్నదని అనిపిస్తున్నది. అతని మనస్సులో నున్న

కోరికతో సమానముగా పరుగెత్తను అంటూఉన్నది దేహము; మాటిమాటికీ చతికిలపడిపోతున్నది. పరిశ్రమ దేహములో నున్నశక్తిని అతిక్రమించి వెళ్లవలెనని ప్రయత్నిస్తున్నది.

చాలా రాత్రిఅయి ఊళ్లో అంతా గాఢనిద్రలో ఉండేవారు. నిశాచరగణముయొక్క చౌకీదారైన అర్ధరాత్రి పహారా ఇస్తూ వేసిన కేకలవలె నక్కలకేకలు వినబడుతుండేవి— అంతరాత్రివేళకూడా మిణుకుమిణుకుమని వెలుగుతున్న దీపముముందర కూర్చొని పనిచేస్తూఉండేవాడు వంశి. ఎంతో కాలముబట్టి ఈలాగు జరుగుతున్నది, అయినప్పటికీ ఇంత ఆయాసపడడము కూడదని మందలించేవారు ఎవరూ ఇంట్లో లేకపోయినారు. ప నేమో౹ ఇలా ఉండేది; అవతల, ఎన్నడూ కడుపునిండా తిండిఅయినా తినేవాడుకాడు. అతను చలికి కప్పుకొనేబట్టలనిండా రంధ్రాలూ, చింకులూ. ఈ కిటికీల ద్వారా దొంగతనముగా రాత్రిపొడుగునా చలి ప్రవేశిస్తూ ఉండేది. ఈ సంవత్సరముమట్టుకు ఏలాగో గడిచిపొతే, వచ్చే ఏట కాబూలీవాలా శాలువులమూట తీసుకొనివచ్చినప్పుడు ఒకశాలువు అరువుకు కొని ఆ పైఏట అప్పుతీర్చేయవచ్చును, ఈలోగా కొంచెమురూపాయలు కూడుతవి,' అని ఇప్పటికి రెండుసంవత్సరాలయింది అనుకొంటున్నాడు. కాని అతనుఅను-కొన్న మంచితరుణము ఇప్పటివరకు చిక్కలేదు. ఈ మధ్యను, పాపము, అతనిశరీరపటుత్వముకూడా తగ్గిపోతూవచ్చింది.

ఇంతకాలమైనతరువాత వంశి ఒకనాడు తమ్ముడుతో, "నేను ఒక్కణ్ణే ఈనేతపని అంతా చేయలేను, ఇక నువ్వు కూడా కొంచెము సాయము చేస్తూఉండాలి," అని అన్నాడు. రసిక్ ఏమీ జబాబుచెప్పలేదు, ముఖము అటు తిప్పుకొని వెళిపోయినాడు. ఒంట్లో బాగుండకపోవడముచేత మనస్సు అతిచికాకుగా ఉన్నది వంశికి; "తండ్రితాతలు; చేస్తూఉండే పని చేయడము మానేసి ఊరూవాడా తిరుగుతూఉంటే నీ గతి ఏమౌతుందో తెలుసునా?" అని అన్నాడు.

అన్నఅన్నది సందర్భములేకుండా అన్నమాట కాదు, కూడనిమాట కాదు, అయినప్పటికీ రసికుకు కోపమువచ్చింది, 'నా జన్మములో ఎన్నడూ ఇంతకష్టమైనమాట సహించి ఊరుకో లేదు, అనిపించింది. రసిక్ ఆవాళ బాగా భోజనముచేయలేదు. గాలాపురువ్వ పట్టుకొని చెరువుగట్టున చేపలుపడుతూ కూర్చు-న్నాడు. సీతాకాలము; మధ్యాహ్నము వేళ; ఎక్కడా ఎటు-వంటిశబ్దమూ వినబడడము లేదు. కోరేసిన చెరువుగట్టుమీద బాగా ఎత్తుగానున్నచోట మైనగోరఒకటి ఆడుకొంటున్నది. వెనకనున్న మామిడితోటలో ఏదోపక్షిఒకటి ఒకేవరసను కూత వేస్తున్నది. నీటిఅంచునఉన్న తుంగమీద చిన్నపక్షి ఒకటి రెక్కలు రెండిటినీ చాచుకొనిహాయిగాఎండకాచుకొంటున్నది. రసిక్ గోపాలుకు బాణాతిప్పడము నేర్పవలసిన రోజు ఇది, ధోరణి చూడగా అది ఈవాళ జరిగేటట్టు కనబడలేదు. గోపాలుకు చాలా చికాకుగా ఉండడముచేత ఎరబుట్టలో

చెయ్యిపెట్టి ఎరలను కెలకడము మొదలుపెట్టాడు. రసిక్‌కి కోపమువచ్చింది, గూబ గీ॥ మన్నట్టు గోపాల్ దవడమీది గట్టిగాఒకటి చరిచాడు. రసిక్‌కి ఎప్పుడు తాంబూలము కావలసి ఉంటుందో అని అన్నీసిద్ధముచేసి ఉంచి కాళ్లుచాచుకొని పచ్చికలో కూర్చొనిఉన్నది సౌరభి. రసిక్ అటువైపుచూచేసరికి సౌరభి కంటపడ్డది. "ఆకలి వేస్తూఉంది, నాకు ఏమైనా తినడానికి తెచ్చివ్వగలవూ సౌరీ?" అని అన్నాడు రసిక్. సౌరభి త్వర త్వరగా ఇంటికివెళ్లి పాకముపట్టిన పేలాలు చెంగునిండా వేసుకొని తెచ్చి ఇచ్చింది. రసిక్ ఆనాడు మరి అన్నగారికి దర్శనమైనా ఇవ్వలేదు.

వంశిబంట్లో ఏమీ బాగులేదు; మనస్సు అంతకంటె బాగులేదు. అనాడురాత్రి కలలో తండ్రికనబడ్డాడు వంశికి— కలగనగానే లేచిపోయినాడు. మనస్సు మరింత కెలకలు అయిపోయింది. వంశము మరి నిలబడేటట్టులేదనే భయమువల్ల గాబోలు పరలోకములోనున్న తన తండ్రికి నిద్ర రాకుండా ఉన్నది!

ఆ మర్నాడు వంశి తమ్ముణ్ణి బలవంతాన పనిలోకూర్చో బెట్టాడు; ఎందుచేతనంటే ఈవిషయము కేవలము తనతోనూ తనతమ్ముడితోనూ మాత్రమే సంబంధించిన విషయము కాదు; తమవంశముతో సంబంధించినది. వంశముయెడల తమకర్త-వ్యము ఉన్నది కదా! రసిక్ పనిచేయడానికి కూర్చున్నాడు,

నిజమే; గాని దానివల్ల పనికి ఏమీ లాభముకలగలేదు. ఆతని చెయ్యి నడవడమే లేదు, మాటిమాటికీ దారము తెగిపోతూ ఉన్నది, తెగిపోయిన దారాన్ని సరిచేయడములోనే వేళంతా అయిపోతూఉన్నది. "అభ్యాసము లేకపోవడముచేతనే ఈలాగు అవుతున్నది, కొన్నాళ్లు ఈలా చేస్తూఉంటే పని బాగానే చేయగలుగుతాడు," అని అనుకొన్నాడు వంశి.

కాని సహజముగా నేర్పుగలచెయ్యి రసికుది, అందు చేతనే నేర్చుకోనంటుంది. నేర్చుకోకపోవడానికి ముఖ్యమైన కారణము ఇంకొకటిఉన్నది. రసికునిశిష్యవర్గము వాళ్లంతా రసికునివెదుకుకొంటూ వచ్చి ఘూచేసరికి బుద్ధిమంతునివలె కూర్చొని తండ్రితాతలనాటిపని నెమ్మదిగా చేసుకొంటున్నాడు ఈమాట తలచుకొనేసరికి చాలా సిగ్గువేస్తున్నది రసికుకి.

సౌరభి నిచ్చే పెళ్లిచేయబోతున్నాడని అన్న రసికుకు ఒకస్నేహితునిద్వారా తెలియజేశాడు. ఈ శుభవార్త తెలియగానే రసికునిమనస్సు కొంత మెత్తబడుతుందని వంశి నమ్మకము. కాని అటువంటిచిహ్నాలేవీ కనబడలేదు. "సౌరభిని పెళ్లాడినంతమాత్రాన నాకు మోక్షము కలిగిపోతుం దనుకొం-టున్నానని అన్నయ్య అభిప్రాయము," అని అనుకొన్నాడు రసిక్. కనుక దీనివల్లకలిగిన లాభమంతా ఒక్కటే—సౌర-భితోసంబంధించిన విషయాలలో రసిక్ నడవడిఅంతా హఠాత్తుగా మారిపోయింది. చివరకు చెంగున ఆకులూ

చక్కలూ కట్టుకొని వచ్చి దగ్గిరకూర్చోడానికి తగినసాహస-
మైనా సౌరభికి లేకుండాచేశాడు రసిక్. ఇదంతా చూచి,
పాపము, సౌరభి ఏడుస్తూ కూర్చొనేది. హార్మోనియమ్
వాయించే అధికారము, ఎవరికీలేనిది, సౌరభికి ఉండేది—
అదిపోయింది సరేకదా, రసికుకు తాంబూలము సరిదిఇచ్చే
హక్కూ, చిన్నచిన్నపనులన్నీ చేస్తూఉండేహక్కూ కూడా
పోయినవి. పాపము, ఆమెకు జీవనములో పెద్దవెలితివచ్చినట్టు
అయిపోయింది. ప్రపంచమంతా శూన్యము అనిపించింది.

ఆ ఊరితోటలలోనూ, ఏటిఒడ్డునా, చెరువుగట్టునా
పొలాలలోనూ, రథాలసాలలోనూ, రాధానాథమండపము
మీదా, పడవరేవులోనూ, సంతలలోనూ, బజారులోనూ—
ఎక్కడపడితేఅక్కడ ఇన్నాళ్ళూ రసిక్ తిరుగుతూఉండేవాడు.
ఒకప్పుడు ఒంటరిగా కనబడేవాడు, ఒకొకప్పుడు కొద్దో గొప్పో
జట్టుగాళ్లు వెనక ఉండేవారు. ఏదో పనిమీద బయలుదేరే-
వాడు ఒకప్పుడు: ఉత్తకులాసాకి బయలుదేరేవాడు మరిఒక-
ప్పుడు. ఈ జాగాలూ, తరువాత ఆ దగ్గిర నున్న థానాగర్
బాబూల ఇల్లూ—ఇవే అతనిలోకము. ఈ మహాప్రపంచ-
ములో మరి ఏస్థలముతోనూ అతనికి సంబంధము లేదు;
మిగతా ప్రపంచముతో ఎప్పటికైనా అవసరము రావచ్చును
అని అతను ఎన్నడూ ఊహించలేదు. ఈవాళమాత్రము
ఈపల్లె అతనిమనస్సును పట్టి ఉంచలేకపోయింది. దూరాన్న
ఉన్న వాటికొరకు అతనిప్రాణము కొట్టుకోవడముఆరంభించింది.

అతనికి కావలసినంత తీరుబడిఉన్నది, అన్న అతనిని అతిస్వల్ప-
కాలమే పనిలో కూర్చోపెట్టేవాడు. కాని ఆ ఒక్కపాడు-
క్షణమూ పనిచేయడమువల్ల అతనికి రోజులంతాపాడు అయి-
పోయినట్టుండేది. రోజూ కొంతవేళ ఈలాగు పనిలో
పాడుఅయిపోవడముచేత మిగిలినవేళ మరిఏపనిలోనూ విని-
యోగించ బుద్ధిపుట్టేదికాదు.

ఈసమయములో థానాగర్ బాబూల పెద్దఇంటికుర్ర-
వాడు ఒకడు బైసికిల్ ఒకటి తెప్పించి అది ఎక్కడము
అభ్యాసముచేస్తున్నాడు. రసిక్ అతిస్వల్పకాలములో దానిని
తొక్కడము నేర్చుకొన్నాడు;చూచినవాళ్లందరికీ అది అతని
కాళ్లలోపుట్టిన రెక్కలు అనిపించినంత ప్రవీణత అతిత్వరలో
సంపాదించాడు. ఆహా! ఏమి టా వాహనము! ఆహా ఏమిఆశ్చ-
ర్యము! ఏమి స్వేచ్ఛ! ఏమి ఆనందము! 'దూర'దేవతయొక్క
శత్రువులనన్నిటినీ సుదర్శనచక్రమువలె సునాయాసముగా
నాశనముచేసి పరుగెత్తగలిగినది ఈ వాహనము! తుపానుగాలి
చక్రాకారముధరించి వీపుమీద మనుష్యుని ఎక్కించుకొని
ఉన్మత్తునివలె పరుగెత్తుతున్నదా అని అనిపించేది—రామా-
యణ మహాభారత కాలాలలో మనుష్యులు అప్పుడప్పుడు దేవ-
తలఅస్త్రాలను ప్రయోగించగలిగేవారట, ఈ బైసికిల్ తొక్క-
డముకూడా ఆ మోస్తరే కదా!

బైసికిల్ లేని బ్రతుకు ఏమిబ్రతుకు అనిపించింది రసిక్‌కి.
ఖరీదయినా విస్తారమూ అంత్సే, అదీ లేదు. నూటపాతికమాత్రమే!

నూటపాతిక ఇచ్చి మనుష్యుడు ఒక నూతన శక్తి సంపాదించ-గలిగినప్పుడు అది అతిచవక అనుకోవలసినదే కదా! విష్ణువు-యొక్క గరుడవాహనమూ, సూర్యునియొక్క అరుణసారథీ సృష్టికర్తను కావలసినంత బేజారు పెడుతూనే ఉంటవి కదా! దేవేంద్రుని వాహనమైన ఉచ్చైశ్శ్రవముకోసము సముద్ర-మథనముకూడా చేయవలసివచ్చింది! కాని ఈ బైసికిల్ పృథ్వని-జయించగల తనవేగాన్ని చంపుకొని నూటపాతికరూపాయిల-కోసము ఎదురుచూస్తూ దుకాణములో ఒకమూలను గోడకు చారబడి నిలుచుంటుది కదా!

అన్నను ఎన్నడూ మరిఏదీ అడగను అని రసిక్ శపథముచేశాడు గాని ఆ శపథము నిలిచింది కాదు. రసికుని-కోరిక వేషము మార్చి వ్యక్తమయింది. నూటపాతికరూపా-యిలు బదులుకావలెను అని అన్నను అడిగాడు

చాలారోజు లయింది, రసిక్ అన్నదగ్గిర ముద్దులు మానేశాడు,— అదీఇది కావాలని అడగడము మానేశాడు. వంశి అసలే జబ్బుగాఉన్నాడు, దీనివల్ల పైగా గొప్పమనోవ్యథ పట్టుకొని రాత్రింబగళ్లు అతనిని పీడిస్తూఉండేది. అందుచేత తమ్ముడు వచ్చి ఆలా అడిగేసరికి వంశిమనస్సు ఆనందముకొలది నాట్యముచేయడము ఆరంభించింది. 'ఏమైతే అది కానీ, డబ్బుకోసము ఇలా లాగులాడుతూ కూర్చోవడము మరి నాతరము కాదు,' అని అనిపించింది వంశికి. వాడు కావాలి

అంటూఉన్నది ఇచ్చేదాము అని ఒకనిమిషముపాటు అనుకొ-న్నాడు వంశి. కాని—వంశమో? వంశము అడుగంటిపోవలసి-నదే! నూటపాతికరూపాయిలు రసికుకు ఇచ్చేస్తే మిగిలే దేమిటి? అప్పు ఇవ్వడమా? రసిక్ నూటపాతికరూపాయిలు అప్పుతీరు-స్తాడా! అదే నమ్మదగినసంగతిఅయితే వంశి నిశ్చింతగా చావగలడు.

వంశి గుండెరాయిచేసుకొని, "బాగానే ఉన్నది, నేను ఎక్కడ తెచ్చేది నూటపాతిక!" అని అన్నాడు. "ఆ రూపా-యిలు నాకు దొరకకపోతే నేను పెళ్లి చేసుకోను అని రసిక్ తన స్నేహితుల ఎదుట అన్నాడట. వంశి ఇది విని, "ఇది మరీ బాగా ఉన్నది," అన్నాడు. "పెళ్లికూతురుకి రూపాయిలు ఇవ్వాలి, అది సరే అనుకొన్నదే; గాని పెళ్ళికొడుకుకు రూపాయిలు ఇవ్వకపోయినా పెళ్లికాదట. మా వంశములో ఈ ఏడుతరాలలో ఇటువంటిసంగతి ఎన్నడూ వినలేదు, కనలేదు—తమాషా బాగానే ఉన్నది!"

రసిక్ మరేమీ దాపుడుఉంచకుండా పని విడిచిపెట్టే-శాడు. అడిగితే ఒంట్లో బాగులేదు అని అనేవాడు. రసికుని ఆహారవిహారాలలో జబ్బులక్షణాలు ఎటువంటివీ కనబడలేదు. కనబడ్డదల్లా ఈపనిమానేయడము ఒక్కటే! "ఇక ఎప్పుడూ వాడిని పనిచేయమని అడగను," అని పౌరుషముతో వంశి తనలోతాను అనుకొన్నాడు. వంశికి కోపమువచ్చి తననుతాను-

మరింత కష్టపెట్టుకోవడము మొదలుపెట్టాడు. ముఖ్యముగా, బాయ్‌కాట్ ధర్మాన ఆ సంవత్సరమే నేతబట్టలయెడల ప్రజలకు-గల ఆదరమూ వాటిధరాకూడా అధిక మయినవి. వేరేపనుల-లోకి వెళిపోయిన దేవాంగులు రమారమి అందరూకూడా మగ్గాలదగ్గిరికి తిరిగివచ్చారు. చంచలస్వభావముగల నాడెలు లంబోదరులైన గణపతులను మీాద నెక్కించుకొన్న ఎలుకలలాగు ప్రతిదేవాంగునిఇంటా రాత్రింబగళ్లు ఇటునుంచిఅటూ అటు-నుంచిఇటూ పరుగెత్తడము మొదలుపెట్టినవి. ఒక్కక్షణము పనికి ఎటువంటిఆటంకము వచ్చినా అతి చికాకుపడేవాడు వంశి. ఈ సమయములోగాని తమ్ముడు తోడుపడిఉంటేనా! రెండు-సంవత్సరాలరాబడి ఆరునెలలు పూర్తికాకుండా సంపాదించి-ఉండును! కాని అది మరి జరిగింది కాదు. గనుక అంతపనీ తానొక్కడే చేసుకోవలసివచ్చింది. రోగముతో శిథిలమైఉన్న శరీరానికి శక్తికి మించినపని ఇవ్వడము ఆరంభించాడు.

ఇప్పుడు రసిక్, ఎప్పుడోగాని, ఇంటికి రావడమేలేదు. కాని ఒకనాడుసాయంకాలము చీకటి పడుతూపడుతూఉన్నది, వంశిచెయ్యి మరి ఆడకుండాఉన్నది, వెన్నెముక విరిగి ముక్కలయి పడిపోతుందా అనిపిస్తూన్నది,దారము చిక్కుపడి-పోతూఉన్నది, చిక్కువిప్పడములో కాలమంతా వృథాగా పోతూఉన్నది—అటువంటివేళను వచ్చి, ఎన్నాళ్లబట్టో మూాల-నుపడిఉన్న హార్‌మోనియమ్‌మీాద రసిక్ వాయిస్తూఉన్న ఆ లక్నో టుంరీ వినబడ్డది. మునుపుతాను పనిచేస్తూచేస్తూ-

ఉండగా మధ్యను హార్మోనియమ్ వినబడితే ఒళ్లంతా పులకరించేది. మనస్సు గర్వముతోనూ, ఆనందముతోనూ నిండిపోయేది. గాని ఆ రోజులుపోయినవి. ఇప్పుడు మరి ఆలా అనిపించలేదు వంశికి. వంశి మగ్గము వదిలి అంగణములోకి వచ్చి చూచాడు. తమ్ముడు ఎవడో కొత్తమనిషిని దగ్గిర కూర్చోపెట్టుకొని హార్మోనియమ్ వినిపిస్తున్నాడు. జ్వరము-చేత వంశిఒళ్లు అసలే కాలుతున్నది, ఇప్పుడు ఒంట్లో మరింత మంటపుట్టి, నోటికి ఏమిటివస్తే అది అనేశాడు. రసిక్ తిరగబడి, "ఈపూటనుంచీ నీఇంట్లోగాని నేను అన్నము తింటేనన్ను—" ఈధోరణిలో ఏమేమో మాటలన్నీ అన్నాడు. "చాలులే; ఇక చాలించు బడాయి!" అన్నాడు వంశి. "నీ శక్తిసామర్థ్యాలు నాకు తెలియకపోలేదు. పనీపాటూ లేనివాళ్లలాగు హార్-మోనియమ్‌వాయిస్తూ నబాబ్‌గిరీ చేస్తూఉండగానే సరి గాబోలు!" అని అంటూ వెళిపోయినాడు. ఆవాళ మరి మగ్గముదగ్గిరికి వెళ్లలేకపోయినాడు; గదిలోకి వెళ్లి అక్కడ పరిచిఉన్న చాపమీద పడిపోయినాడు.

స్నేహితుడెవడినో తీసుకువచ్చి చిత్తరంజనార్థము హార్మోనియమ్ వాయించడముకాదు రసిక్ అప్పుడు చేస్తూ-ఉన్నది. ఆ రోజున ఆ ఊరికివచ్చిఉన్న సర్కస్‌కంపెనీలో పని ఏదైనా సంపాదించాలని ఆ కంపెనీవాళ్లలో ఒకనిని తీసుకువచ్చి తన సామర్థ్యమూ, తెలివితేటలూ కనపరుస్తూ తనకు వచ్చిన పాటలన్నీ ఒకొక్కటి వాయిస్తూకూర్చున్నాడు. ఆపాటలమధ్య

అకస్మాత్తుగా ఈపాట దూరి అపస్వరము చేసేసింది. ఈరోజువరకు ఎన్నడూ వంశినోటివెంట అటువంటిమాటలు రాలేదు. తానన్నమాటలకు తానే ఆశ్చర్యపోయినాడు, ఆ కఠోరమైన-మాటలు ఎవరో తననోటివెంట పలకించారో అని అనిపించింది అతనికి. ఇంతఘోరముగా తమ్ముని తిట్టినతరువాత, కూడబెడు-తున్న డబ్బులోనుంచి ఒక్కదమ్మిడీఅయినా తీయను అని తాను పట్టిన దీక్ష నిలబెట్టుకోవడము మరి సాధ్యముకాదు అని అతనికి తెలిసిపోయింది. ఎన్నడూ తలవని నాటకము జరిగింది ఆ రూపాయిలగురించి.ఆక్షణమునుండి ఆ రూపాయిలమాట అనుకొంటే మునుపటివలె మరి ఆనందము కలగడము లేదు. రసిక్ తనకు ఎంతవిలువైనవాడో ఆమాట మనస్సును పట్టుకొని విరామములేకుండా పీడిస్తున్నది. రసిక్ చంటివాడుగా ఉన్న-ప్పటిరోజులు జ్ఞాపకమువచ్చినవి. రసిక్‌కు ఇంకా మాటలురావు, 'అన్నా' 'అన్నా' అనైనా అనలేదు, మగ్గముదగ్గిరికి వచ్చి నూలుపోగులు తెంపకుండా ఆ పెంకిపిల్లవాడిని పట్టిఉంచ-డము బ్రహ్మాండమైన పనిగాఉన్నది, ఎవరిచంకనుఉన్నా అన్న చేతులు చాచేసరికి మెడమీద పడిపోతాడు, అన్నఉంగరాల జుట్టు లాగుతాడు, అన్నముక్కు తనచిన్నచేతులతో పట్టుకొని నోట్లో పెట్టుకోబోతాడు—ఇటువంటి చిన్ననాటి చేష్టలన్నీ జ్ఞాపకమువచ్చి వంశిమనస్సుకు చాలాబాధకలిగింది. వంశి మరి పడుకొని ఊరుకోలేకపోయినాడు. అతిముద్దుగా-అతిదయతో రసికుని పేరుపెట్టి పిలిచాడు నాలుగైదుమారులు.

జబాబు లేదు. జ్వరము చాలా అధికముగా ఉన్నది. పక్కమీదనుంచి లేచాడు. పైకివచ్చి చూచాడు. అంతా చీకటి, హార్మోనియమ్ ఒకపక్కను పడిఉన్నది, రసిక్ అంధకారములో గోడను చేరబడి ఒకమూలను కూర్చున్నాడు. అన్న తమ్ముడిదగ్గిరికి వచ్చి సన్నముగా పొడవుగా పాముపలెనున్న రూపాయిలసంచి ఒకటి మొలలోనుంచి విప్పి తమ్ముడికి ఇచ్చి, "ఇవుగో, తమ్ముడూ రూపాయిలు, ఇవన్నీ నీకోసమే కదా," అని అన్నాడు. "నీకు పెళ్లి చేదామని రూపాయిలు కూడబెడుతున్నాను తమ్ముడూ, గాని నువ్వుఏడుస్తూఉంటే చూస్తూ ఊరుకోని నేను రూపాయిలు కూడబెట్టలేను నాయనా, నాకు అంతబలము లేదు. ఇదిగో, ఇవి తీసుకో; వాటిలో తోక్కుడు బండే కొనుక్కో, మరిఏమిటిచేసుకుంటావో చేసుకో." రసిక్ లేచి నిలుచొని అన్నాడు, "తొక్కుడుబండీ కొంటాను, పెళ్లీ చేసుకొంటాను; గాని ఆ రెండుపనులూ నా రూపాయిలతో నేను చేసుకొంటాను, నీ రూపాయిలు నాకు అక్కరలేదు, వాటిని నేను ముట్టుకోనైనా ముట్టుకోను." ఈ మాటలంటూ అన్నజబాబు వినకుండానే ఒక్కగంతువేసి పైకి పారిపోయినాడు. వాళ్లిద్దరికీ ఈరూపాయిలమాట ప్రసంగించడానికి మరి అవకాశమే చిక్కలేదు—ఈరూపాయిలమాటే అన్నమాటేమిటి, ఏమాటలుకూ తరువాత వీలులేకుండా అయిపోయింది!

రసికుని భక్తబృందానికి నాయకుడైన గోపాల్ పౌరుషముకొలది కొన్నాళ్ళబట్టి రసిక్ దగ్గిరికి రావడములేదు. రసికుకు కనబడేటట్టు అతనిఎదుటనుండే రోజూ చేపలుపట్టడానికి వెళుతూఉండేవాడు. మునపటిలాగు రసికును పిలిచేవాడు కాడు. రసికుకు సౌరభితో మాటలే లేవు—అతనికీ ఆమెకూ జట్టివిప్పడము అయిపోయినట్టే. అది రేపో నేడో తిరిగీ కలుసుకొనేమోస్తరు విప్పడము కాదు కూడాను; బ్రతికిఉన్నంతకాలమూ ఉండేటట్టు ఉన్నది. ఆలా జట్టు విప్పడము ఎంత క్రూరమైనపనో రసికుకు తెలియజేసేమార్గము సౌరభికి కనబడకపోవడముచేత ఆమెకు మరింత దుఃఖము వచ్చేది. గదిలో ఒకమూల కూర్చొని మాటిమాటికీ కళ్ల నీళ్లు పెట్టుకొనేది.

ఈలా ఉండగా ఒకనాడు రసిక్ గోపాల్ ఇంటికి వచ్చి గోపాల్ని పిలిచాడు; మునపటివలె అతిచనువుగా గోపాల్ చెవి నులిపి కితకితలుపెట్టాడు. మొదట గోపాల్ చికాకుపడ్డట్టూ, దెబ్బలాటకువచ్చేటట్టూ కనబడ్డాడు, గాని అట్టేసేపు ఆలా నటించలేకపోయినాడు. ఇద్దరూ అతిత్వరలో తిరిగీ స్నేహితులైపోయి నవ్వులూ, హాస్యాలు మొదలుపెట్టారు. "నా హార్మోనియమ్ నీకుకావాలి రా, గోపాల్?" అని రసిక్ అడిగాడు.

హార్మోనియమా! అంతగొప్ప దానమే కలియుగములో! అటువంటిఅద్భుతాలుకూడా జరగగలవూ! కాని

ఎవరూ అడ్డుపెట్టకపోతేమాత్రము తనకు ఇష్టముగాఉన్నవస్తు తీసుకొనేశక్తి గోపాలులో కావలసినంతఉన్నది. కనుక ఆ హార్మోనియమ్ తక్షణమే స్వాధీనపరుచుకొంటూ, "తిరిగీ ఇచ్చేయమంటే ఇవ్వను సుమా," అని రసికుతో అన్నాడు.

ఆనాడు రసిక్ గోపాల్‌ని పిలిచినప్పుడు ఆ పిలుపు వెళ్లి ఆఇంట్లో మరిఒకరిచెవిలో తప్పకుండా పడుతుందని రసికుని నమ్మకము. కాని ఆలా జరిగినట్టు ప్రమాణ మేది పైకి కనబడక పోవడము చూచి రసిక్ గోపాల్‌తో, "సౌరి ఎక్కడ ఉన్నదో ఒకమారు పిలవవూ?" అన్నాడు.

"సౌరి 'నేను ఇల్లు కడగాలి, ఇప్పుడు రాలేను'అన్నది," అని తిరిగివచ్చి చెప్పాడు గోపాల్. "పద, వెళ్లి చూదాము ఇల్లు ఏలా కడుగుతున్నదో," అన్నాడు రసిక్. రసిక్ ఇంట్లోకి వెళ్లి చూచేసరికి ఏమీలేదు—ఇల్లూ లేదు, కడగడమూ లేదు. అడుగులచప్పుడు విన్నది సౌరభి, గాని బయటకు పారిపోడానికి దారి కనబడక ఒకపక్కకుపరుగెత్తి వీళ్లవైపు వీపు తిప్పి మట్టిగోడమూలను నొక్కుకొని నిలుచున్నది. రసిక్ దగ్గిరికివెళ్లి ఆమెముఖము తనవైపు తిప్పడానికి ప్రయత్నము చేస్తూ, "నామీద కోపమా సౌరీ?" అన్నాడు. సౌరి రసికుచేతులలోనుంచి తప్పించుకొని తిరిగీ ముఖము గోడ-వైపు తిప్పేసింది.

కొన్నాళ్లకిందట ఎప్పుడో సరదాపుట్టినప్పుడు రసిక్ అనేకరకాల రంగులదారాలతో కుట్టి అతిచిత్రమైన కప్పుకొనే రొజాయి ఒకటి తయారుచేస్తూ ఉండెను.అటువంటిరొజాయిలు ఆడవాళ్లు కుడుతూఉండడము మామూలు గాని ఆడవాళ్లు కుట్టే లతలూ, నగ్షీలూ—అన్నీ ఒకటే అచ్చు, సనాతనముగా వస్తూఉన్నవి. రసిక్ కుడుతూఉన్న నగ్షీ ఒకరిదగ్గర నేర్చుకొన్నది కాదు, తన ఊహచేత తానే కల్పించినది. ఈ రొజాయి రసిక్ కుడుతూఉన్నన్నాళ్లూ సౌరభి అతి ఆశ్చర్యముతో ఎదుట కూర్చొని చూస్తూఉండేది. ప్రపంచములో ఎన్నడూ ఎవరూ ఇంత అద్భుతమైన రొజాయి కుట్టలేదు అని తనలో తాను అనుకొనేది. రొజాయి పూర్తికావచ్చింది, ఏమూలనో కొంచెము, పూర్తికావలసిఉన్నది, అంతలో రసికుకు రొజాయిపనిఅంటే చికాకు పుట్టింది. రొజాయి మరి పూర్తిచేశాడు కాడు. సౌరభికి చాలా విచారముువేసింది, ఎన్నిసారులు, ఎన్నిరకాలుగా ఆరొజాయి పూర్తిచేయమని రసికుని ప్రార్థించిందో లెక్కలేదు. మరి రెండుమూడుఘంటలు రసిక్ ఆ పనిలో కూర్చుంటే రొజాయి పూర్తిఅయిపోయిఉండును, గాని దేనిమీదికి అతని మనస్సు పోదో ఆ పని అతనిచేత చేయించడము బ్రహ్మతరము కాదు. ఇన్నాళ్లకు ఏమి బుద్ధిపుట్టిందోగాని ఆ ముందునాటి రాత్రి కూర్చొని రొజాయి పూర్తిచేసేశాడు.

"రొజాయి పూర్తిఅయింది, ఒక్కమారు చూడవూ సౌరీ! అన్నాడు, రసిక్.

గట్టిగా పట్టుకొని సౌరి ముఖము ఇటు తిప్పేసరికి, సౌరి తన ముఖాన్ని పైటచెంగుతో కప్పివేసుకొన్నది, బుగ్గలవెంట కన్నీటిధారలు కారుతున్నవి — అటువంటప్పుడు ముఖము ఏలా చూపించగలదు?

తనకూ సౌరభికీ పూర్వముఉండే సంబంధము తిరిగీ ఏర్పరచుకొనేసరికి రసికుకు కొంతసేపుపట్టింది. ఉభయపక్షాలూ సంధికి ఒప్పుకొని సౌరి మునపటివలె తమలపాకులు తెచ్చి-ఇచ్చేసంబంధము తిరిగీ ఏర్పడ్డది. అప్పుడు రసిక్ తనతో కూడా తెచ్చినమూట విప్పి లోపున ఉన్న రొజాయి తీసి అరుగుమీద పరిచాడు. సౌరభిగుండె ఆశ్చర్యముతో దడదడ కొట్టుకోవడము ఆరంభించింది. చివరకు, "సౌరీ, ఈ రొజాయి నీకోసమే కుట్టాను, తీసుకో నువ్వు," అని రసిక్ అనేసరికి సౌరి దానిని పుచ్చుకోలేకపోయింది. ఇటువంటి దానము తనకు ఎవరైనా ఇవ్వవచ్చును అన్నసంగతి ఆమెకు కేవలము ఊహించ శక్యముకానిపని. దుర్లభమైనవస్తువును కోరడము సౌరి ఎన్నడూ ఎరగదు. గోపాల్ సౌరిని జడిపిస్తూ ఒక్కగదుము గదిమాడు. మానవులమనోతత్త్వము ఎంతసూక్ష్మమైనదో గోపాలుకి ఏమీ తెలియదు. పొందదగిన వస్తువు దొరికినప్పుడు తీసుకోకపోవడము ఉత్త కపటము అని గోపాలుని నమ్మకము. వృథాగా కాలవ్యయముచేయడము ఇష్ట-ములేక గోపాల్ ఆ రొజాయి మడతపెట్టి గదిలో ఉంచేసి వచ్చాడు. తెగిపోయినమైత్రి తిరిగీ అతుకుకొన్నది. ఇకముందు

పూర్వమువలె ఎటువంటి ఆటంకమూ లేకుండా తమస్నేహము రోజూ నియమముప్రకారము జరుగుతుంది అనే ఆశతో ఆ ఇద్దరు బాలురమనస్సులూ, ఆ బాలికమనస్సూ నిండినవి.

తన పాతసంఘములోని అందరుబాలురతోనూ, బాలికలతోను కలిసి రసిక్ ఆవాళ మునపటిమోస్తరుగానే ఆడుతూపాడుతూ తిరిగాడు. అతనువెళ్లనిది అన్నగారిఇల్లు ఒక్కటే. ముసలి వితంతువుఒకతె వంశిఇంట్లో రోజూ వంటచేసి వెళుతూ ఉండేది; ఆనాడు ఆమె వచ్చి వంశిని అడిగింది, ఈవాళ ఏమి వంటచేయమంటావు అని. అప్పటికి ఇంకా వంశి పక్కమీదనే ఉన్నాడు, "నాఒంట్లో బాగులేదు, ఈవాళ నే నేమీ భోంచేయను,చిన్నబాబును పిలిచి వాడికి అన్నము పెట్టేసి వెళిపో," అన్నాడు.

"ఈవాళ ఇక్కడ భోజనము చేయనన్నాడు తమ్ముడు, ఎవరో విందుకు పిలిచినట్టుగా ఉన్నది," అని ఆమె జవాబు చెప్పింది. అదివిని వంశి పెద్ద నిట్టూర్పు విడిచి ఒంటిమీద కప్పుకొన్నబట్టతో ముఖముకూడా కప్పుకొని పక్కకుతిరిగి పడుకొన్నాడు.

రసిక్ సర్కస్‌కంపెనీవాళ్లతో కలిసి ఆ ఊరు విడిచిపెట్టినరోజు ఈలాగు గడిచింది. శీతాకాలపురాత్రి. ఆకాశము మీద అర్ధచంద్రుడు ఉదయించి ఉన్నాడు. ఆవాళ సంతరోజు. సంతఅయిపోయింది, అంతా ఇళ్లకు పోయినారు, దూరమునుంచి

వచ్చినవాళ్లుమాత్రము మాటలాడుకొంటూ పొలాలగట్లను నడుచుకొని ఇళ్లకు ఇంకా పోతుపోతూఉన్నారు. బండి-మీాద దుప్పటికప్పుకొని బండివాడు పడుకొనిఉంటే, ఆ ఖాలీ బండిన ముసాఫర్ ఖానావైపు ఎడ్లు వాటంతటఅవే తీసుకుపోతూఉన్నవి. ఊరి ఆవులసాలలమధ్యనుంచి గడ్డికాల్చినపొగ లేస్తూఉన్నది. శీతాకాలపురాత్రి గాలి లేదు; మంచుతోకలిసి బరువెక్కిన ఆ పొగ కుప్పలుకుప్పలుగా ఏర్పడి అక్కడి వెదురు-పొదలో చిక్కుకొంటూఉన్నది.ఆ సమయాన రసిక్ ఊరుఅవ-తలనున్న పొలాలదగ్గిర చేరుకున్నాడు.గుడ్డివెన్నెల, అందుచేత ఊరునిండా చెట్లు ఎంతోదట్టముగా ఉన్నప్పటికీ వాటినీడ రసిక్ ఉన్నచోటునుండి ఏమాత్రమూ కనబడడము లేదు. అక్కడికి వచ్చి వెనకకు తిరిగి చూచేసరికి రసిక్ గుండె చెప్ప-నలవికానంత కొట్టుకోవడము మొదలుపెట్టింది. ఇంటికి తిరిగి-వెళ్లేమార్గము అప్పటికి ఇంకా పూర్తిగా మూసుకుపోలేదు,గాని అతనిహృదయముమాత్రము ఇంకామూసుకొనేఉన్నది. ఆర్జన లేదు, పైగా అన్న ఆర్జిస్తూఉన్నదంతా తింటూకూర్చున్నాడనే నిందను చెరుపుకోనిదే ప్రాణము ఉండగా ఆగ్రామానికి మరి రాకూడదు అనుకొన్నాడు. తనడబ్బుతో కొన్న బైసికిల్ ఎక్కి-గాని ఈఊరు మరిరాను అని ప్రతిజ్ఞచేశాడు.

ఆ ఊరి వాడరేవు, ఆఊరి పెద్దచెరువు, ఫాల్గుణమాస-ములో పొలాలలో పుడుతూఉన్నసువాసన, చైత్రమాస-ములో మామిడితోటలలోనుండి వస్తూఉన్న పరిమళము,

తుమ్మెదలఝుంకారము—ఇవన్నీ పోతే పోనీ! పోనీ ఆవూరి-నిండా అల్లుకొనిఉన్న స్నేహము, అక్కడి ఆటపాటలు, వినోదవిహారాలు. ఇప్పుడు తనఎదుట నున్నది ఎన్నడూ చూడని ప్రపంచము, ఏమీ సంబంధములేని మనుష్యకోటి, తననొసట నున్నది అదృష్టదేవత వ్రాసిన వ్రాత.

రసిక్ కుకష్టముగాకనబడ్డపని బట్టలనేత ఒక్కటే. ప్రపంచములో మనుష్యుడుచేసే మరిఏపనిఅయినా అంతకంటె సులభమే అని అతని నమ్మకము. తన ఇరుకింటి ముడి తెంచుకొని ఒక్కమారు పైని పడగలిగితే బ్రతికిపోతాను అని రసిక్ అనుకొనేవాడు, గనుక మహా ఆనందముతోనే ఇల్లు విడిచిపెట్టాడు. మధ్యను ఎటువంటి ఆటంకమైనా రావచ్చునని గాని, వృథాకాలయాపనకాగలదనిగాని అతనికి ఎన్నడూ తట్టనైనా లేదు. బయట నిలబడి దూరాన్నఉన్న కొండవైపు చూస్తూఉంటే మనకు ఆ కొండ అతిసమీపములో ఉన్నదనిపిస్తుంది, ఒక్కఅరఘుంటలో శిఖరము చేరుకోగలము అనిపిస్తుంది. ఊరుదాటివచ్చి బయట నిలబడేసరికి రసికుకు తన ఇచ్ఛా సఫలతకూడా అంతసులభసాధ్యముగా కనిపించింది. తాను ఎక్కడికి వెళుతున్నాడో ఎవ్వరితోనూ చెప్పలేదు రసిక్. ఎప్పుడో ఒకనాడు వచ్చి తానే స్వయముగా ఆ కబురు అందరితో చెపుదామని అతనిశపథము.

పనిలో ప్రవేశించి చూచేసరికి రసిక్ కి ఒకసంగతి బాగా బోధపడ్డది— డబ్బుపుచ్చుకోకుండా మనసరదాకి మనము పని

చేస్తూ ఉన్నంతకాలము మనను అందరూ మెచ్చుకొంటారు, మర్యాదచేస్తారు—అటువంటిమర్యాదా, మెప్పూ కావలసినంత దొరికింది రసిక్‌కి; గాని డబ్బుపుచ్చుకొని పనిచేయబోతే మన-యెడల దయాదాక్షిణ్యమూ రవంతైన కనపరచరు. సర్కస్ చూడడానికివచ్చినవానివలె చూస్తున్నంతసేపు సర్కస్ చాలాతమాషాగా కనపడ్డది రసికుకు. గాని సర్కస్‌లో ఉద్యో-గానికి ప్రవేశించగానే ఆ తమాషా అందులోనుంచి ఎగిరి పోయింది. సరదాపుట్టించవలసిన పని సరదాపుట్టించనప్పుడు అది ఏలాగైనా వదిలిపోతే బ్రతుకుతాము అనిపిస్తుంది. ఆలాం-టప్పుడు కూడా ఆపనే రోజూ చేయవలసివస్తే 'దీనంత అసహ్య-మైనది మరిఒకటి లేదు ప్రపంచములో' అనిపిస్తుంది. సర్కస్‌దళ-ములో చిక్కుకొన్నప్పటినుండి రసిక్‌కి ఒక్కరోజైనా కులా-సా లేదు, అతను ఇంటిమాట కలగనని రోజు లేదు. రాత్రి నిద్రపోతూపోతూ లేచి అన్నపక్కా తనపక్కా ఒక్కచోటనే ఉన్నవనుకొనేవాడు; గాని ఒకనిమిషమైనా కాకముందే పూర్తిగా తెలివివచ్చేది, అన్న దగ్గిరలేడని పోల్చుకొనేవాడు. ఇంట్లో ఉండేటప్పుడు శీతాకాలములో రాత్రివేళ రసిక్‌కు చలివేస్తుందని తలచి గాబోలు అన్న తన శాలువు తీసి రసిక్-మీద వేసి కప్పేవాడు. నిద్రమత్తులోఉన్నా రసిక్ అది పోల్చు కొనేవాడు. ఇప్పుడుకూడా ఈ పుష్యమాసపురాత్రి చలివేస్తూ ఉండేటప్పుడు రసిక్ నిద్రలో అన్న మునుపటిలాగు వచ్చి శాలువు కప్పుతాడు" అని అనుకొంటున్నాడు, అన్న-

రావడము ఆలస్యము అవుతూఉందని రసిక్ కి కోపమువస్తూ ఉంది. తెలివివచ్చి చూచేసరికి అన్న దగ్గిరఉండడు. అప్పుడు అనుకొంటాడు, ఈశీతాకాలపురాత్రి తనశాలువును నామీద కప్పలేకపోయినందుకు నా ఖాలీ పరుపుపక్కను కూర్చొని నా అన్న ఎంత దుఃఖపడుతున్నాడో కదా అని. తెల్లవారి లేస్తూనే ఇంటికి వెళిపోతాను అని ఆ అర్ధరాత్రివేళ అనుకొంటాడు; గాని కొంతసేపటికి బాగా తెలివి వస్తుంది, మనస్సును గట్టిపరచుకొని మంత్రోచ్చారణలాగు తాను చేసిన ప్రతిజ్ఞ నోటితో అనేవాడు; "వెల్లిరూపాయిలు పట్టుకొని బైసికిల్ ఎక్కి ఇంటికి వెళితేనే నేను మొగవాడను, లేకపోతే నాపేరు రసిక్ కాదు."

సర్కస్ప్రొప్రయిటరు ఒకనాడు రసికుని "సాలీ"అంటూ చాలా అసహ్యమైన తిట్లు తిట్టాడు. రసికు తన చెంబు, కంచము, గిన్నె, తనకుఉన్న నాలుగుబట్టలు—ఇవన్నీ తన బాకీకి బదులుగా ఇచ్చేసి సర్కస్కంపెనీ వదిలి వట్టిచేతులతో వెళిపోయినాడు. రోజంతా తిండిలేదు రసికుకు, సాయంకాలము అయేసరికి ఎదో నదిఒడ్డు చేరుకొన్నాడు. అక్కడ ఆవులు హాయిగా పచ్చికమేసుకొంటూఉన్నవి, వాటిని చూచి ఒకవిధమైన ఈర్ష్యపుట్టింది అతనిలో. ఈ పృథ్వి నిజముగా పశుపక్షుల తల్లి, ఆమె తనచేతులతో తానే వాటినోటికి ఆహారము అందిస్తుంది. మనుష్యుడు ఆమె కంటికి దానవపుత్రుడేమో, సైతాను సంతతివాడేమో! అన్ని వైపులా విస్తరించి, ఎటు

చూచినా సమృద్ధితో నిండిఉన్నది ఈ మహాపృథ్వి. కాని రసికుకు పట్టెడన్నము దొరకలేదు. నీటిబడ్డుకువెళ్లి దోసెళ్లతో నీరు తీసుకొని కడుపారా తాగాడు. ఆహా! ఈ నదికి ఆకలిలేదు, దాహములేదు, ఏ విచారమూలేదు, ఎటువంటిప్రయత్నమూ లేదు, ఇల్లులేదు, ఇల్లులేదన్నదుఃఖములేదు. వస్తూఉన్నది చీకటి, అంధకారము; అయినా ఎటువంటిభయమూ లేకుండా నిరుద్దేశ్యమే తనఉద్దేశమైనట్టు ఈ నది పరుగెత్తుకుపోతున్నది. ఇదే అనుకొంటూ ప్రవాహమువైపు చూస్తూ రసిక్ ఆబడ్డున కూర్చున్నాడు. ఈ దుర్భరమైన మానవజన్మము బంధవిహీనమైన ఆ నదీప్రవాహములో కలిపివేయగలగడనువంటి పరమశాంతి మరిఒకటి ఉండదు అని అనుకొంటున్నాడేమో!

అటువంటప్పుడు యువకు డొకడు ఆ నదిబడ్డుకు వచ్చి నెత్తిమీద నున్న మూట కిందపెట్టి దానిపక్కను కూర్చొని మొలను దోపుకొన్నఅటుకులమూట విప్పి ఆ అటుకులు తడిపి తినే ప్రయత్నములో ఉన్నాడు. ఆ కుర్రవాడు ఏదో కొత్త రకముగా కనబడ్డాడు రసిక్ కళ్లకు. కాళ్లకు జోళ్లులేవు, ధోవతి కట్టుకొని చొక్కా ఒకటి తొడుక్కున్నాడు, తలకు పగిడీ— చూడగానే ఏదో గొప్పఇంటికుర్రవాడిలాగు కనబడుతు-న్నాడు, కూలీలాగు మూట నెత్తిమీద పెట్టుకొని ఎందుకు ఈలా తిరుగుతున్నాడో బోధపడకుండాఉన్నది రసికుకి. ఇద్దరికీ స్నేహముకలవడము అట్టేసేపుపట్టలేదు; ఆ తడిపిన అటుకులలో రసికుకి వంతుకూడా దొరికింది. ఆ యువకుడు

కాలేజివిద్యార్థి, కాలేజికుర్రవాళ్లంతా కలిసి పెట్టిన స్వదేశీ దుకాణముకోసము బట్టలు కొందామని ఈ ఊరుసంతకు వచ్చాడు. ఆ కుర్రవాడిపేరు సుబోధ్, జాతికి బ్రాహ్మడు, అతనికి ఎటువంటి చిన్నతనమూ, సంకోచమూ లేదు, అడ్డు లేదు; రోజంతా సంతలో తిరిగి సాయంకాలము అటుకులు తెడుపు-కొని తింటున్నాడు.

ఇదంతా చూచి రసిక్ తనలోతానే సిగ్గుపడ్డాడు. అంతేకాదు. ఆయువకుని చూచినప్పటినుండి ముక్తిపొందా నన్నట్టు అనిపించింది అతనికి. ఆవిధముగా వట్టికాళ్ళతో నడుస్తూ మూటలు మోసుకొని వెళ్లగలిగినవానికి జీవనయాత్ర అంటే భయముండదు అని అప్పుడు అతనికి బోధపడ్డది. ఆవాళ నేను ఉపవాస ముండడము అవసరము లేనేలేదు. అను-కున్నంత మాత్రాన కడుపార తినగలిగిఉందునే, మూటలు మోసి సునాయాసముగా కావలసినంత సంపాదించుకొన వచ్చునే, అని అప్పుడు అతనికి తట్టింది.

కొంతసేపయినతరువాత సుబోధ్ మూట నెత్తిమీద-పెట్టుకోబోయేసరికి రసిక్ 'వద్దు వద్దు' అని అతనిని ఆపి, 'నేను మోస్తాను ఆ మూట' అన్నాడు. సుబోధ్ ఒప్పుకోలేదు. అప్పుడు అన్నాడు రసిక్, "నేను సాలీలకుర్రవాడను, మా మూట నేనే మోస్తాను. నన్ను మీతో కలకత్తా తీసుకొని వెళ్లండి." నేను 'సాలి' వాడను అన్నమాట రసిక్ ఇంతకుముందు ఎన్నడూ అన లేక పోయిఉండును. ఆసిగ్గు పోయింది ఇప్పుడు.

సుబోధ్ ఆనందపరవశుడై ఒక్కగంతువేశాడు—"నువ్వు సాలీల అబ్బాయివా! సాలీని ఒకనిని తీసుకొని వెళదామనే నేను బయలుదేరాను. కాని వాళ్లవిలువ ఇప్పుడు చాలా అధికముఅయిపోయింది, అందుచేత మా బట్టలనేతస్కూలుకు మేష్టరుగా రమ్మంటే ఎవరూ ఒప్పుకోకుండా ఉన్నారు."

రసిక్ బట్టలనేతస్కూలులో మాస్టరుగా కలకత్తా వచ్చాడు. ఇంటి అద్దే, భోజనమూ పోగా కొద్దో గొప్పో ఇన్నాళ్లకు మిగిల్చుకో గలిగాడు. కాని బైసికిల్‌చక్రలక్ష్యభేదము ఇప్పుడప్పుడే సాధ్యముకాని పని. పెళ్లికూతురికి ఇవ్వవలసినకట్నముమాట ఇప్పుడు అసలు అనుకోనేకూడదు. ఇంతలో, బట్టలనేతస్కూలు, ఎంతత్వరగా లేచిందో అంత త్వరగా దిగజారిపోవడము మొదలుపెట్టింది. కమిటీబాబూలు కమిటీ చేస్తూ కూర్చున్నంతసేపు మహాతమాషాగా ఉండేది చూడడానికి. కాని ఆ కమిటీ బాబులే పనిలోకి దిగేసరికి అంతా గందరగోళమయిపోయేది. కమిటీవాళ్లు నానాదేశాలనుండి నానారకాల మగ్గాలు దిగుమతిచేసి వాటితో మహాచిత్రమైన లంకాపురిఒకటి నిర్మించారు. అవన్నీ తీసుకొనిపోయి ఏ పెంట మీద పారేయడమో, కమిటీమీదకమిటీ కూర్చుంటున్నారు గాని, ఇంకా నిశ్చయించలేకుండా ఉన్నారు.

రసిక్ మరి ఓర్చిఉండలేకుండా ఉన్నాడు. తిరిగీ ఇంటికి పోదామని ప్రాణము కొట్టుకుపోతూఉన్నది. తన ఊరిదృశ్యా

లన్నీ కళ్లకుకట్టినట్లుగా కనబడుతూఉన్నవి, అతి చిన్న చిన్న సంగతులుకూడా కళ్లఎదుటికి వస్తూఉన్నవి—ఆ ఊరిపురోహితునికి ఒక కొడుకున్నాడు, వాడికి కొసవెర్రి. మా పొరుగు వారింట దోరరంగు దూడ ఒకటి ఉన్నది. ఏటికి వెళ్లేదారికి దక్షిణపువైపునున్న తాటిచెట్టుమానులోనికి వేళ్లుతన్నుకొని ఒక రావిచెట్టు ఉన్నది, కాలిలోకాలు చుట్టి కుస్తీపడుతూ నిలబడిఉన్న పైలువానులలాగు ఆ రెండుచెట్లూ కనబడుతున్నవి. ఆ దిగువనే పాడుపడిపోయిన ఇల్లుఒకటి ఉన్నది. వాళ్ల పొలానికి మూడువైపులా వాసనధాన్యముపండేవి,నాలుగోవైపు లోతునీళ్లకు చేరువగా చేపలవల కట్టుకోడానికి పాతిన వెదురు కర్ర ఉన్నది, దానిమీదను ఒకనీటికాకి కూర్చొనిఉన్నది. కైవర్తపాడావైపునుండి పొలాలు దాటివచ్చి సాయంకాలమప్పుడు కీర్తన వినబడుతున్నది. గాలి భిన్న భిన్నఋతువులలో ఆ యా ఋతువుల సుగంధాలతోనిండి ఆ ఊరిదారులను నింపుతున్నది. వీటన్నితోనూ కలిసి అతని భక్తబృందము! — ఏదోగడబడ చేయకుండా ఉండలేకపోయేవాడు గోపాల్; పైటచెంగున తాంబూలము కట్టుకొని వచ్చి ప్రేమతోనిండిఉన్న తనపెద్దకళ్లు విప్పి చూస్తూఉండేది ఆ సౌరి. ఇటువంటిసంగతులు అనేకము జ్ఞాపకము వచ్చేవి, అవి రసిక్ హృదయాన్ని ప్రేమలోనూ ఆనందములోనూ, వేదనలోనూ రాత్రింబగళ్లు చుట్టబెట్టి ఉంచేవి. ఆ పల్లెలో ఉన్నంతకాలమూ రసికునినిపుణత అతనుచేసే నానారకాలవస్తువులద్వారా అనేకవిధాలబయలుపడుతూ

ఉండేది. అదంతా ఇప్పుడు పూర్తిగా నిలిచిపోయింది. ఆ నిపుణతకు ఇక్కడ విలువ లేదు. ఈ మహాపట్టణములోని దుకాణాలలోనూ, బజారులలోనూ ఉన్నవి మరలలో తయారుఅయిన వస్తువులు, అవి చేతిపనులకు సిగ్గుతెప్పించి వాటిని నాశనముచేస్తూఉంటవి. బట్టలనేతస్కూలులో జరుగుతూఉన్నపని పనికాదు, ఉత్తమిష; దానివల్ల మనస్సూ నిండదు, కడుపూ నిండదు. సర్కస్ థియేటరులో కాలుతూ ఉండే దీపశిఖలు రెక్కపురుగును ఆకర్షించినట్టుగా అతనిని మరణమార్గములోనికి లాగినవి. అతని ప్రాణాన్ని ఇప్పుడు నిలబెట్టి ఉంచుతూఉన్నది రూపాయిలు కూడబెట్టవలెనన్న కఠోర నిష్ఠమాత్రమే. ప్రపంచమంతటిలో అతను ఇప్పుడు వెళ్ల-లేని స్థలము వాళ్ల పల్లెటిగ్రామ మొక్కటే. అందుచేతనే అక్కడికి వెళ్లవలెననే కోరిక మరింత ప్రబలమై అతనిని బాధిస్తూఉన్నది. బట్టలస్కూలుమీద మొదటిలో చాలా ఆశ పెట్టుకొన్నాడు, గాని ఆ ఆశ ఇప్పుడు మరి నిలిచిందికాదు. ఇతనికి రావలసిన రెండునెలలజీతమయినా ఇంకా దొరకలేదు. ఇక మరి తనమనస్సును పట్టిఉంచలేకుండా ఉన్నాడు. 'సిగ్గంతా దిగమింగి, తలవంచుకొని, ఒకసంవత్సరమంతా వృథావ్యయము చేశానని ఒప్పుకొని, అన్నదగ్గిరికి ఇంటికి తిరిగి పో,' అని అతని మనస్సులో ఏదో చెపుతూఉన్నది.

"ఇంటికి పద ఇంటికి పద" అని మనస్సు లోపునుంచి పాడుస్తూఉన్న రోజులలో అతనిబసకు సమీపములో గొప్ప

వైభవముగా ఎవరింట్లోనో పెళ్లి ఒకటి జరుగుతున్నది. బజంత్రీలతో సాయంకాలము వరుడు వచ్చాడు. ఆనాడు రాత్రి రసిక్ కలగన్నాడు—తన తలను పెళ్లిపగిడీ ఉన్నది, ఎర్రని అంగరకా తొడుక్కొని ఉన్నాడు, గాని తాను ఊళ్లోకి వెళ్ల లేదు, ఊరుఅవతలనున్న వెదురుపొదవెనుక నిలబడిఉన్నాడు. ఊళ్లోఉండే పిల్లలంతా! 'పెళ్లికొడుకువచ్చాడు' 'నీ మొగుడు వచ్చాడు,' అని కేకలువేసి సౌరభికి వెర్రెత్తించేస్తూఉన్నారు. సౌరభి వాళ్లతో చాలలేక ఏడ్చుకొంటున్నది. రసిక్ వాళ్లకు తగినశిక్ష చేదామని పరుగెత్తి వెళ్లబోతాడు, గాని ఆ వెదురుపొదలోనుంచి రాలేకుండా ఉన్నాడు. పాగా ఆ రువ్వల మధ్య చిక్కుకొంటున్నది, అంగరకా ముళ్లల్లో తగులుకొంటున్నది, ఎంతతంటాలుపడ్డా పైకి రాలేకుండా ఉన్నాడు. అంతలో తెలివి వచ్చి చాలా సిగ్గుపడ్డాడు. పెళ్లాము నిశ్చయము అయి కూర్చున్నది, గాని ఆపెళ్ళికూతురుని తన ఇంటికి తీసుకు రాగల యోగ్యత తనలో లేదు—తన చేతకానితనానికి ఇంత కంటె గొప్పప్రమాణము ఉండదు అనిపించింది. ఇంత తుచ్ఛపు బ్రతుకుతో తిరిగి మా ఊకురు వెళ్ళడము నాకు సాధ్యము కాని పని అనుకొన్నాడు.

దేశములో అనావృష్టి ప్రారంభించిందాఅంటే రోజు తరువాతరోజు నడుస్తూనే ఉంటుంది, గాని ఆకాశాన ఎక్కడా మేఘమున్నమాట కనబడదు; ఒకవేళ ఎప్పుడైనా కనబడ్డదా అంటే వర్షము పడదు; వర్షమూ పడ్డదంటే ఆ వర్షమువల్ల

నైనా తడవదు. కాని దేశములో వర్షాలు ప్రారంభిస్తే మాత్రము మేఘము ఒకమూల కనబడీ కనబడడములో ఆకాశమంతా కప్పుకొనిపోతుంది. విరామములేకుండా ధారా వర్షము కురిసిభూమండలమంతా జలమయ మయిపోతుంది. రసికుని భాగ్యములో అటువంటి చిత్రము ఒకటి జరిగింది.

జానకీ నందీ అనేపేరుగల గొప్ప ధనవంతుడు ఒకడు ఉండేవాడు. ఆయన ఎవరో చెప్పగా ఒకసంగతి విన్నాడు. ఆమర్నాడు ఆతని జోడుగుర్రాల బండి బట్టలనేతస్కూలు ఎదుటకు వచ్చి నిలుచున్నది. ఆ స్కూలు మాస్టరుగారితో అతను ఏవో నాలుగుమాటలు అన్నాడు. ఆ మర్నాడు రసిక్ హోటల్‌లోనుంచి బస ఎత్తేసి నందీగారి మూడోఅంతస్తులోని గదిలో చేరుకొన్నాడు.

నందీగారికి పైదేశాలతో గొప్ప కమిషను వ్యాపారము ఉండేది. రసిక్ ఏమీ కోరినదే నందీగారు అతనికి పేరుకి ఏదో ఉద్యోగము ఇచ్చి ఎందుకు అంత గొప్పజీతము ఇవ్వనిశ్చయించారో రసికుకు ఏమీ బోధపడలేదు. ఆ ఉద్యోగానికి వెదకకుండానే కావలసినంతమంది దొరుకుతారు. ఒకవేళ ఎవరినైనా వెదికి తీసుకువచ్చినా అంత మర్యాదచేయడము అవసరము లేదు. ఇల్లు విడిచిపెట్టిన తరువాత రసిక్ కొంతజ్ఞానము సంపాదించాడు. బజారులో తాను ఎంత వెల చేస్తాడో బాగా తెలుసుకొన్నాడు. గనుక జానకీబాబుగారు అతనియెడల కనపరిచే

ఆదరణ అతనిని భ్రమలో పెట్టలేదు. దానంతటికీ మూలకారణము గ్రహనక్షత్రాల సహాయముతప్ప వేరేదీ అతనికి కనబడలేదు.

కాని ఆ శుభగ్రహము అట్టేదూరాన లేదు. దాని విషయమయి క్లుప్తముగా కొంచెము చెప్పడము ఆవశ్యకము.

పూర్వము జానకీబాబుగారిస్థితి ఇప్పటిమోస్తరుగా ఉండేదికాదు. హైస్కూలుచదువు ముగించి ఎంతోతంటాలుపడి జానకీ కాలేజీలో ప్రవేశించాడు, అప్పుడు హరమోహన్ అనే కుర్రవాడొకడుండేవాడు, జానకీ అతనూ ఒకేక్లాసులో చదువుకొనేవారు. హరమోహన్ బ్రహ్మసమాజస్థుడు. కమిషన్ వర్తకము హరమోహన్‌తండ్రిది. ఆయనకు ఒకపెద్ద దొరలకంపెనీతో వ్యాపారము ఉంటూఉండేది, అందులో పెద్దదొర ఒకడికి హరమోహన్‌తండ్రిఅంటే చాలాఇష్టము. అతనే హరమోహన్‌తండ్రిని ఈవర్తకములో పెట్టాడు. హరమోహన్ తన ప్రియస్నేహితుడైన జానకీ నందీని ఆ వర్తకములో వంతుదారునిగా తీసుకొన్నాడు.

డబ్బులేకుండా యౌవనావస్థలో ఉన్నంతకాలమూ సంఘసంస్కరణ విషయములో జానకీఉత్సాహము హరమోహనుఉత్సాహాన్ని మించిఉండేది. అందుచేత తండ్రి కాలము చేసిన తరువాత జానకీ, అప్పటికి తండ్రి నిశ్చయపరచిఉంచిన తనచెల్లెలిపెళ్లిసంబంధము తప్పించి చెల్లిచేత పెద్దచదువు

చదివించవలెనని నిశ్చయించాడు. పెద్దయిన తరువాత వాళ్ల సాలికులములో ఎవరూ అతనిచెల్లెలిని పెళ్లాడకపోవడముచేత హరమోహను తాను కాయస్థుడైనప్పటికీ వాళ్ళను ఆ చిక్కు-లోనుంచి తప్పించవలెననే కోరికతో ఆమెను పెళ్లిచేసు-కొన్నాడు.

తరువాత చాలాకాలము గడిచింది; హరమోహన్ చనిపోయినాడు, జానకీచెల్లెలుకూడా కాలముచేసింది. వర్తకమంతా జానకీఒక్కనిదే అయిపోయింది. అద్దెఇల్లు మూడంతుస్తులమేడ అయింది. ఏనాటినుండో ఉన్న నికెల్-వాచీని అవమానపరిచి పారేయడమయింది, దానిస్థానే ఒక బంగారుఘుడియారము టిక్ టిక్ మంటూ జేబును అలంక-రించింది.

ఈరీతిగా ఆయనఖజానా పెరుగుతూఉన్నకొలది తాను దారిద్ర్యావస్థలో చిన్నప్పుడు కనపరిచిన ఉత్సాహమంతా తనకే కుర్రతనము అనిపిస్తూఉన్నది; ఆనాటిచరిత్ర ఏవిధముగానైనా పైకిరాకుండాచేసి సంఘములో తిరిగీ మీదికి లేదామనే కోరిక జానకీ బాబుగారిని బాగా పట్టుకొన్నది. తన కొమార్తెను హిందూసంఘములోనివాని కెవరికైనా ఇచ్చి పెళ్లిచేయవలెనని అతని దీక్ష. రూపాయిలాశచూపించి ఒకరిద్దరిని పెళ్లికి కుదిర్చాడు, గాని ఆ సంగతి విని ఆ కుర్రవాళ్ల బంధువులు వచ్చి గొడవచేసి పెళ్లి కాకుండాచేశారు. చదువుకొన్నవాడూ,

బుద్ధిమంతుడూ కావలెనని కూర్చోలేదు జానకీబాబుగారు; అటువంటివాడు కాకపోయినా అభ్యంతరము లేదు అతనికి—పిల్లదాని జీవితసౌఖ్యమంతా ధారపోసిఅయినా సంఘదేవత-ప్రసాదము సంపాదించవలెనని చాలా తాపత్రయపడు-తున్నాడు.

అటువంటి సమయములో జానకీబాబు బట్టలనేత స్కూలులో ఉన్న మాస్టరుగారిమాట విన్నాడు. ఆ మాస్టరు ధానాగర్ బసాక్ వంశములో పుట్టిన పిల్లవాడు. అతనితాత-గారు అభిరామ్ బసాక్—ఆయనపేరు విననివారు ఎవరు? ఇప్పుడు వాళ్లు మంచిస్థితిలో లేరు, నిజమే; గాని తనశాఖకంటె ఉత్తమశాఖ వారిది.

దూరమునుంచి చూస్తూనే ఇంటిఆవిడ పెళ్లికొడుకును ఇష్టపడ్డది.

"అబ్బాయికి చదువుసంధ్యలు ఏపాటి?" అని అడిగింది భర్తను.

"అటువంటి అనవసరమైన వేవీ లేవు అబ్బాయికి. కాని చదువువచ్చినవాళ్లను హిందూసంఘనిబంధనలలో కట్టిఉంచ-డము ఈరోజులలో అసాధ్యమైనపని."

"డబ్బా ఏగాణీ ఏమాత్రము?"

"సున్నకు ఏమీతగ్గదు, గాని అదే మనకు మంచి దంటాను!"

"అతనికి కావలసినవాళ్లూ దగ్గిరబంధువులూ ఉంటే పిలిపిద్దాము!"

"ఇప్పటికి అప్పుడే రెండుమూడుసార్లు చేశాము ఆలాంటి పని; బంధువులు రావడమే అయిందిగాని పెళ్లి మాత్రము కాలేదు. ఈమారు పెళ్లి ముందుగా చేసేసి సావకాశముగా బంధువులతో స్నేహముచేయవలెను అని నిశ్చయించాను."

ఇంటికి తిరిగివెళిపోదామనే కోరిక రాత్రింబగళ్లు రసికుని పట్టి పీడిస్తూఉన్నది, రూపాయిలు కూడబెట్టేమార్గ మేదీ ఎంతచూచినా కనబడకుండాఉన్నది—ఆ సమయములో, రెండిటినుండీ అతనిని విముక్తునిచేసేమార్గము ఈవిధముగా జానకీబాబుగారి కృపవల్ల అతనికంట పడ్డది. ఒక్క నిమిషమైనా ఆలస్యము చేయకూడదు అనుకొన్నాడు రసిక్.

"మీఅన్నగారికి కబురు పంపమంటావా అని," అడిగాడు జానకీబాబు. "అవసరము లేదు," అన్నాడు కాబోయే-పెళ్లికొడుకు. అంతా అయినతరువాత వెళ్లి అన్నను సంభ్రమ-పరచవలెనని అతనికోరిక. తాను ఎందుకూ పనికిరానివాడు అని అన్న అనుకొంటున్నాడు గనుక తన సామర్థ్యము

ఎటువంటిదో అతనికి ప్రత్యక్షముగా చూపించవలెనని అనుకొన్నాడు రసిక్

ఏదో మంచిరోజున పెళ్లిఅయిపోయింది. అనేకరకాల కానుకలూ కట్నాలూ దొరికినవి, గాని అన్నిటికంటె ముందు కోరిపుచ్చుకొన్నది బైసికిల్ ఒకటి.

మాఘమాసము ఆఖరయిపో వచ్చింది. పెసరచేలు కోతకు సిద్ధముగాఉన్నవి. అవిసిమొక్కలు కాయలతో నిండి-ఉన్నవి. చెరుకుపానకము ఎక్కడపడితే అక్కడ పెనాలలో మరుగుతున్నది, ఆ వాసనవల్ల గాలి బరువెక్కిందా అని అనిపిస్తున్నది. పల్లెలోని ఇంటింటాఉండే గాదెలన్నీ ధాన్య-ముతో నిండిఉన్నవి. గొల్లవాళ్ల వాకిట గడ్డికుప్పలు పడిఉన్నవి. గొల్లకుర్రవాళ్లు ఆవులనూ, గేదెలనూ మేపుతూ ఏటిఅవతల-నున్న పచ్చిక బయలుమీద కూర్చొనిఉన్నారు. రేవులోఉన్న బల్లకట్టుకు అంతగా పనిలేదు, నీళ్లుతగ్గిపోవడముచేత బట్టలు ఎత్తుకొని అంతా నీళ్లల్లోనుంచి నడిచి ఏరు దాటిపోతున్నారు.

రసిక్ కాలరూ, షర్టూ, తొడుగుకొని మీద *ఢాకా పంచ విరిచికట్టాడు. కమీజుమీద నల్లని బణాతుకోటు ఒకటితొడిగాడు, గుండీలు పెట్టలేదు. కాళ్లకు పువ్వుల-మేజోళ్లు, దానిమీద జిగజిగ మెరుస్తూఉన్న షోకైన బూట్సు. డిస్ట్రిక్టుబోర్డువారు వేయించిన మెట్టురోడ్డుమీద బైసికిల్

* బంగాళీలో ఢాకా, ఇంగ్లీషులో Dacca (డెక్కా.)

జోరుగా తొక్కుకొనివచ్చాడు. కాని పల్లె దగ్గిరపడే-సరికి మంచిరోడ్డు అయిపోయింది, గనుక బైసికిల్ వడి కొంచెము తగ్గించవలసివచ్చింది. అతని వేషమూ వైఖరీ చూచి ఎవరూ అతనిని పోల్చుకోలేదు. అతనూ ఎవరితో మాట్లాడ-లేదు. తనను ఎవరూ పోల్చుకోకముందే అన్నదగ్గిరికి వెళ్లి, పలకరిద్దామనే అతని కోరికకూడాను. ఇల్లు దగ్గిరపడిపోతూ ఉన్నది, కుర్ర వాళ్లకళ్లపడకుండా తప్పించుకొని పారిపోవడా-నికి వీలులేకపోయింది. వాళ్లు ఇతనిని తక్షణమే పోల్చేశారు; సౌరభిఇల్లు అక్కడికి చాలాదగ్గిర, ఆ ఇంటిదగ్గిరికి వెళ్లి, "సౌరి-దీదీ వరుడు వచ్చాడు,' 'సౌరి-దీదీ వరుడు వచ్చాడు," అని కేకలు వేశారు. గోపాల్ ఇంట్లోనే ఉన్నాడు, తక్షణము పైకి పరుగెత్తుకువచ్చాడు, గాని అప్పటికప్పుడే బైసికిల్-రసిక్ గారి ఇంటిదగ్గిరికి వెళ్లి ఆగిఉన్నది.

అప్పుడే చీకటి పడుతూ పడుతూ ఉన్నది. ఇంట్లో దీపములేదు, చీకటి అంధకారము. పైనుంచి తలుపుకు తాళము. అందరూ విడిచిపెట్టి పోవడముచేత చీకటిలో ఒంటరిగాఉన్న ఇల్లు "లేరు, ఎవరూ లేరు," అంటూ ఏడుస్తూ-ఉన్నదా అని అనిపించింది రసిక్ మనస్సుకు. మనస్సులో గొప్ప బాధ పుట్టింది, ఎదుటనున్నవన్నీ అస్పష్టమయిపోతూ ఉన్నవి. కాళ్లు వణకడము మొదలుపెట్టినవి. మూసివేసిఉన్న తలుపు పట్టుకొని నిలుచున్నాడు, గొంతుక ఎండిపోతున్నది, ఏ పేరూ నోటివెంట రాకుండా ఉన్నది. చాలా దూరాన సంధ్యహార-

తితో జేఘంట వాగుతున్నది.ఆ జేఘంట ఈ ప్రపంచము విడచి-పెట్టి పరలోకము చేరుకొన్న ఒక జీవుడుయొక్క వార్తను అక్కడనుండి తీసుకొనివస్తున్నదా అనిపించింది. కంటిఎదుట కనబడుతూఉన్న మట్టిగోడా, గడ్డిల్లూ, మూసిఉన్న తలుపూ, గోరంటకంచే, వాలిఉన్న ఈతచెట్టూ—ఇవన్నీ కూడా ఆ అంతరించిన సంసారమును సూచించే చిత్రపటాలే గాని, వాటిలో ఏమీ నిజములేదు అనిపించింది అతనికి.

గోపాల్ వచ్చి రసిక్ దగ్గిర నిలుచున్నాడు. రసిక్ ము-ఖాన రక్తములేదు, గోపాల్ వైపు ముఖము తిప్పాడు, గోపాల్ ఏమీ అనలేదు, ముఖము వాల్చుకొని నిలుచున్నాడు. "బోధ పడ్డది, అన్న లేదు," అన్నాడు రసిక్, ఆ మాటలు అంటూ ఆ తలుపుదగ్గిర చతికిలపడిపోయినాడు. గోపాల్ రసిక్ పక్కనే కూర్చొని, "పద రసిక్ దాదా, మాఇంటికి పద," అని అతిప్రేమతో రసిక్ చెయ్యి పట్టుకొని అన్నాడు. రసిక్ చెయ్యి విడుపించుకొని ఆ అరుగుమీదనే పడి దొర్లుతూ, అన్నా అన్నా అన్నా !అంటూ ఏడిచాడు. 'అన్నా' అని వినగానే తానే పరుగెత్తుకు రావలసిన అన్నదగ్గిరనుంచి జవాబు-లేదు.

గోపాల్ తండ్రి వచ్చి ఓదార్చి తనఇంటికి రసికుని తీసుకొని వెళ్లాడు. రసిక్ ఆ ఇంట్లోకి వెళ్లీ వెళ్లడములో తాను ఇచ్చిన రంగుల రొజాయి అతనికంట పడ్డది. ఆ రంగులరొజాయి

కప్పి సౌరభి దేనినో అతిజాగ్రత్తగా గోడకు చేరవేసి నిలబెట్టి-
ఉంచింది. అంగణములో అడుగులచప్పుడు వినబడగానే
ఇంట్లోకి పారిపోయింది. రోజాయికప్పినవస్తువు ఒక కొత్త-
బైసికిల్ అని దగ్గిరికి వస్తూనే రసిక్ పోల్చుకొన్నాడు. దాని
అర్థమేమిటో అతనికి తక్షణమే బోధపడ్డది. గుండెబద్దలయి-
పోయేటంత దుఃఖము లోపునుంచి తోసుకువచ్చింది, గాని
గొంతుకలో ఏదో చుట్టలుచుట్టలుగా అడ్డుపడ్డది; లోపునున్న
కన్నీటిని పైకి రానివ్వకుండాచేసింది.

రసిక్ వెళిపోయిన తరువాత రాత్రింబగళ్లు విశ్రా-
మములేకుండా కష్టపడి పెళ్లికూతురుకట్నమూ, ఈబైసికిల్
కొనడానికికావలసినసొమ్మూ కూడ పెట్టాడు వంశి. ఒక్కక్షణ-
ములో అన్నతాపత్రయమంతా చల్లారింది. అలసిపోయిన
గుర్రము గమ్యస్థానానికి వెళుతూనే చచ్చి పడిపోయినట్టుగా,
పెళ్ళికూతురుకట్నంరూపాయిలు జమఅయినవి, బైసికల్ వి. పి.
వచ్చి పోస్టులోఉన్నది, వంశిచెయ్యి మరి నడవ లేనన్నది. ఆనాడే
ఆగిపోయింది వంశిమగ్గము. గోపాల్‌తండ్రిని పిలిపించి అతని-
చెయ్యి పట్టుకొని అన్నాడు, "మరి ఒక్క సంవత్సరము
రసిక్‌కోసము చూడండి; ఇదుగో కట్నంరూపాయిలు నీచేతికే
ఇస్తున్నాను; రసిక్ ఊరికి రాగానే నేను తెప్పించిన బైసికిల్
వాడికి ఇచ్చి, 'అన్నను అడిగావు ఇది ఇవ్వమని, అభాగ్యుడు
మీ అన్న అప్పుడు ఇవ్వలేకపోయినాడు, గాని ఆ కోపము
మనస్సులో ఉంచుకోకు', అనిచెప్పు."

అన్నరూపాయిలు ముట్టుకోను అని ప్రతిజ్ఞచేసి కొన్నాళ్లకింద గ్రామము వదిలి వెళిపోయినాడు రసిక్. ఆ కఠోరమైన ప్రతిజ్ఞ విధాత విన్నాడు. రసిక్ ఈవాళ తిరిగివచ్చి చూచాడు—ఇప్పటికప్పుడే చాలా కాలము అయింది, అన్నగారి బహుమతి తనరాకకు ఎదురుచూస్తూ నిలుచొని ఉన్నది. కాని అది పుచ్చుకొనే మార్గము లేదు, దానిని తానే మూసేసుకొన్నాడు. అన్న తన జీవితాన్ని మగ్గముదగ్గిరనే నేసినేసి దానిని పూర్తిగా తమ్మునికే దానము-చేసేశాడు. తానుకూడా తనజీవనాన్ని మగ్గానికే బలిఇవ్వ-వలెను అని రసికులో గొప్పకోరిక పుట్టింది. కాని, అయ్యో ఇప్పు డేమిచేయగలడు! కలకత్తానగరములో రూపాయిలమరకు తనయావజ్జీవనాన్ని బలిఇచ్చి వచ్చాడే!

౧౯౧౧

# సెలవులు

"ఫటిక్ చక్రవర్తి" కుర్రవాళ్లకు నాయకుడు. ఒక కొత్త ఆట ఫటిక్‌మని ఆవాళ అతని తలలోకి దూరింది. పడవ-తెరచాపకొయ్యకోసమని తెచ్చిఉంచిన గుగ్గిలము దూలము ఒకటి నదిఒడ్డున పడి ఉన్నది. అందరూ కలిసి ఆ దూలాన్ని దొర్లించుకొని తీసుకుపోదామని ఫటిక్ అన్నాడు.

ఆ కర్ర గలవాడు కొయ్యఅవసరమువచ్చినప్పుడు కర్ర కనబడకపోతే ఎంత చికాకు పడతాడో, ఎంత గడబడ పడతా-డో, అతనికి ఎంతఇబ్బంది కలుగుతుందో—అదంతా ఊహించి అందరూ అతి సరదాగా ఆ పని చేదామని ఒప్పుకొన్నారు.

నడుములు బిగించి ఉత్సాహముతో అంతా పని మొదలు పెట్టబోతున్న వేళకు ఫటిక్ తమ్ముడు మాఖన్‌లాల్ ఆ దూలము మీద ఎక్కి అతిగంభీరముగా కూర్చున్నాడు. 'వీళ్లొక లెఖ్ఖ-కాదు' అన్నట్టుగా నిర్భయముగా అతను కూర్చోవడము చూచి ఆ కుర్రవాళ్లసరదా సగము తగ్గిపోయింది.

అందులోఒకడు మాఖన్‌దగ్గిరికి వచ్చి జడుస్తూ జడుస్తూ ఒకటిరెండు మార్లు మెల్లిగా అతనిని తోశాడు, గాని మాఖన్ మాత్రము కదలలేదు. కాలతత్త్వజ్ఞానమేమీలేని ఆ అకాల-తత్వజ్ఞాని పృథ్వీమీదనుండే అన్నిరకాల ఆటల యొక్కా-నిస్సారతనుగురించి ఆలోచిస్తున్నాడు ఆ కర్ర మీద కూర్చొని.

ఫటిక్ వచ్చాడు దగ్గిరికి, వచ్చి చేతులు విసురుతూ, "ఇదిగో చూడు దెబ్బ తగిలింది! ఇక లే!" అన్నాడు.

తమ్ముడు ఇటూ అటూ కొంచెము కదిలి మరీచక్కని జాగా చూచుకొని మరింత స్థిరముగా కూర్చున్నాడు.

అటువంటి సందర్భములో నలుగురిఎదుటా అన్న మర్యాద నిలుపుకోవలెనంటే తనమాట లక్ష్యపెట్టని తమ్ముడి బుగ్గమీద ఫడీమని ఒకటి తక్షణమే చరవవలసి ఉండెను—కాని ఫటికుకు సాహసము చాలిందికాదు. 'వాడికి తగిన శిక్ష చేయాలంటే ఎంతసేపు గాని చేయను' అని తనలో తాను అనుకొన్నాడు. అంతలో ఇంకొక మంచి ఆట అతనికి తట్టింది, అది మరీ మజాగా ఉంటుందని అనుకొని మాఖ౯తో కూడా ఆదూలము దొర్లించుకుపోదామని తనబృందమువాళ్లతో అన్నాడు.

మాఖ౯ అదీ బాగానే ఉన్నది, దానివల్ల కొంత గౌరవము వస్తుంది అనుకొన్నాడు. కాని 'ఆపదలేని గౌరవము చాలా అరుదు, గనుక అన్నిగౌరవాలతోపాటు దీనిలో కూడా కొంత ఆపద ఉండవచ్చును,' అన్నమాట మాఖనుకు గాని తతిమ్మాకుర్రవాళ్లకుగాని తట్టలేదు.

కుర్రవాళ్లు నడుములు బిగించి "ఆయ్‌లసా ఓ ఆయ్‌ల సా" అనుకొంటూ తోదామని దూలము పట్టుకొన్నారు. ఇంకా ఒకదొర్లు పూర్తిగా దొర్లిందో లేదో మాఖ౯ అతని

గాంభీర్యమూ, గౌరవమూ, తత్త్వజ్ఞానమూ—వీటన్నితో కూడా భూమిమీద సాష్టాంగము పడిపోయినాడు.

ఆటఆరంభములోనే అనుకున్నదానికంటె ఎక్కువ తమాషా జరిగినందుకు కుర్రవాళ్లందరికీ చాలా ఆనందము కలుగుతున్నది, గాని ఫటిక్ మాత్రము కొంచెము గాభరా పడుతున్నాడు. మాఖన్ తక్షణమే నేలమీదనుంచి లేచి ఒళ్లూపయిా తెలియకుండా ఫటిక్ మీదపడి ఫైడ్ ఫైడ్ మని బాదేశాడు. అతని ముక్కూ, ముఖమూ, గోళ్ళతో గీరేసి ఏడుస్తూ ఇంటివైపు వెళిపోయినాడు—అక్కడితో ఆవాళకు ఆట నిలిచిపోయింది.

ఫటిక్ తుంగముక్కలు రెండు లాగి నీళ్లలో సగము మునిగిఉన్న పడవొకటి అక్కడుంటే అది ఎక్కి ఆ తుంగ ముక్కలమొదళ్లు నములుతూ కూర్చున్నాడు.

అంతలో స్టీమరొకటి వచ్చి రేవులో నిలబడ్డది. ఒక పెద్దమనిషెవరో స్టీమరు దిగాడు; మధ్యవయస్సులో ఉంటాడు, మీసాలు నల్లగా ఉన్నవి, గాని జుట్టు పండిపోయింది. ఆయన ఫటిక్ దగ్గిరికివచ్చి 'చక్రవర్తుల' ఇల్లు ఎక్కడ అని అడిగాడు.

ఆ తుంగనములుతూ నములుతూ "అదుగో అటూ!" అని ఫటిక్ అన్నాడు. కాని "అటూ" అంటూ ఎటువైపు చూపించాడో పోల్చుకోవడము ఎవరి తరమూ కాదు.

ఆ పెద్దమనిషి మరి ఒకమారు, "ఎక్కడా?" అని అడిగాడు.

"నాకు తెలియదు," అన్నాడు ఫటిక్ ఎప్పటిలాగు నే తుంగలోని సారము విరామము లేకుండా పీలుస్తూ ఆ "బాబూ" ఇంకెవరి సహాయము వల్లనైనా ఇల్లు కనుక్కుందామని వెళ్లిపోయినాడు.

మరిఒక పదినిమిషాలలో 'బాఘూ బాగ్‌దీ' వచ్చి "ఫటిక్ దాదా * అమ్మ నిన్ను పిలుస్తున్నది," అని చెప్పాడు.

"నేను రాను," అని ఫటిక్ జబాబు చెప్పాడు.

బాఘూ ఫటికును బలవంతాన ఎత్తుకుతీసుకు వెళిపోయినాడు, ఏమీ చేయలేక ఫటిక్ కోపముకొద్దీ కాళ్లూ చేతులూ కొట్టుకుంటున్నాడు.

ఫటిక్ కనబడగానే తల్లి అగ్నిహోత్రము అయిపోయి, "మాఖన్‌ని మళ్లా కొడతావూ?" అన్నది.

"కొట్టలేదు," అన్నాడు ఫటిక్

"మళ్లా అబద్ధాలు ఆడుతున్నావు!"

---

* దాదా=అన్న: "దాదా" అనే పదము స్నేహితుల పేర్లకు కలిపి ఆదరము తెలియజేయడానికి ఉపయోగిస్తారు ; ఈ ఉపయోగములో అది పెద్దవారి పేర్లకుగాని చిన్నవారి పేర్లకుగాని కలపవచ్చును.

"వాడిని నేను కొట్టనే లేదు. కావాలంటే మాఖన్‌ని అడుగు."

మాఖన్‌ను అడిగితే ముందు చేసిన ఫిర్యాదు ప్రకారము తిరిగీ, "ఆహా, కొట్టాడు," అన్నాడు.

ఫటిక్ మరి సహించి ఊరుకోలేకపోయినాడు, గబగబ మాఖన్ దగ్గిరికి వెళ్లి, "మళ్లా అబద్ధాలా!" అని అంటూ వాడిదవడమీద గట్టిగా ఒకటి చరిచాడు.

తల్లి మాఖన్ పక్షమయి ఫటిక్ ఒంటిమీద గట్టిగా నాలుగు వేసింది. ఫటిక్ తల్లిని చేతితో తోసేశాడు.

తల్లి కేకలు వేస్తూ, "హాః! ఏమి సాహసమురా నీది! అమ్మ ఒంటిమీద చెయ్యి వేయడమే!" అన్నది.

ఆలాంటప్పుడు ఆ నల్లని మీసాల పండుజుట్టు బాబూ ఇంట్లోకి వచ్చి, "ఏమిటి కథ?" అన్నాడు.

ఫటిక్ తల్లి ఆశ్చర్యముతోనూ, ఆనందముతోనూ పరవశురాలై, "ఇదుగో అన్నయ్యా! ఎప్పుడు వచ్చావు అన్నయ్యా?" అంటూ అన్నయ్యకాళ్లకు ప్రణామము చేసింది.

అన్న చాలాకాలము క్రిందట ఉద్యోగము కోసము పశ్చిమదేశము వెళిపోయినారు. ఈలోపున ఫటిక్ తల్లికి ఇద్దరు పిల్లలు పుట్టారు, ఆ పిల్లలు పెద్దవాళ్లుకూడా అయినారు.

ఆమె భర్తకూడా కాలముచేశాడు—ఇన్ని అయినా అన్నను మాత్రము ఒక్కమాటూ చూడడము జరిగింది కాదు. ఇన్నాళ్లకు విశ్వంభరబాబు చెల్లెలిని చూడడానికి రాగలిగాడు.

చాలా సరదాగా కొన్నిరోజులు ఉన్నాడు అన్న. చెల్లెలుకూడా అతి కులాసాగా అన్నకు అనేకరకాలుగా ఆదరించింది. చివరకు విశ్వంభరబాబు రెండుమూడు రోజులకు వెళిపోతాడనగా ఒకనాడు పిల్లలచదువూసంధ్యలగురించీ, వాళ్ల తెలివితేటలగురించీ, బుద్ధిజ్ఞానాలగురించీ మాటలు వచ్చినవి. ఫటిక్ తన మాట ఏమీ లక్ష్యపెట్టడనీ, పాఠాలు శ్రద్ధగా చదవడనీ, మాఖన్‌ది మంచిస్వభావమనీ, జాగ్రత్తగా చదువుకుంటూఉంటాడనీ చెప్పింది తల్లి.

"ఫటిక్ రోజూ నన్ను కాల్చుకుతింటూఉంటాడు, కదూ!" అన్నది చివరకు.

ఫటికును కలకత్తా తీసుకొనివెళ్లి తనదగ్గిర ఉంచుకొని చదువు చెప్పిస్తానని అక్కతో అన్నాడు విశ్వంభర్. అక్క అతి సంతోషముతో ఒప్పుకొన్నది.

"ఏమిరా ఫటిక్, మామతో కలకత్తా వెళతావా?" అని తల్లి అడిగింది.

"వెళతాను," అన్నాడు ఫటిక్ సంతోషముతో గంతులువేస్తూ. ఫటిక్ ఎప్పుడో ఒకనాడు మాఖన్‌ని ఏటిలో తోసే-

స్తాడనో, లేక వాడితల పగలగొట్టేస్తాడనో లేక అటువంటి ప్రమాదము మరేదైనా ఎప్పుడో జరుగుతుందని తల్లికి సర్వదా భయముగానే ఉండేది; అందుచేత ఫటిక్ కలకత్తా వెళిపోతాడంటే ఆమెకు ఎటువంటి విచారమూ లేదు, కాని వెళిపోవడానికి కొడుకు అంతసరదా పడడము చూచి తల్లికి కొంచెము కష్టము అనిపించింది.

"ఎప్పుడు వెళతావు మామయ్యా, ఎప్పుడు వెళతావు?" అంటూ ఫటిక్ మామను అతి చికాకుపెట్టేశాడు. సరదావల్ల ఫటిక్‌కు రాత్రి నిద్ర పట్టలేదు.

చివరకు వెళిపోయేముందు అపరిమితానందమువల్ల ఫటిక్ హృదయము ఔదార్య పరవశ మయిపోయింది. మాఖన్‌కి తన చేపముల్లూ, గాలిపగడా మరి ఎప్పుడూ తిరిగీ అడగనని చెప్తుతూ ఇచ్చేశాడు.

కలకత్తా వెళ్లాడు ఫటిక్, మామగారి ఇంటికి, అత్తగారి-తో పరిచయము ప్రారంభమయింది. ఈవిధముగా అనవసరముగా తన పరివారము అభివృద్ధిచెందడము చూచి అత్తగారు చాలా సంతోషించిందని మాత్రము చెప్పడము కష్టము. తనకు అప్పుడే ముగ్గురు పిల్లలు ఉన్నారు, వాళ్లను చూచుకొంటూ తాను ఏర్పరచుకొన్న నియమాల ప్రకారము తన సంసారము గడు-పుచువస్తూఉన్నది. అలాంటప్పుడు ఎటువంటిశిక్షా లేకుండా పదమూడేళ్లు పల్లెటూరిలో పెరిగిన పరాయి కుర్రవాడొకడు

ఇంట్లోకి వచ్చిపడ్డాడంటే విప్లవమువచ్చి పడ్డట్టే కదా! విశ్వం-
భరుకు ఇన్నేళ్లొ వచ్చినా ప్రపంచజ్ఞానము ఏమీ లేదు!

ముఖ్యముగా, పదమూడుపధ్నాలుగేళ్ల పిల్లడంత
పనికిమాలిన వస్తువు పృథ్వీమీద ఇంకొకటిఉండదు. చూడడా-
నికా అందముగా ఉండడు, వాడిచేతఏదైనా పనిచేయించు-
దామా అంటే అందుకూ పనికిరాడు. అటువంటికుర్రవాడు
మనలో అనురాగముపుట్టించలేడు, అటువంటి వాని సహవా-
సము ఎవరూ కోరదగినది కాదు. వాడు చక్కగా మాటలాడ
లేకపోతే ముద్దుమాటలాడుతున్నాడని అసహ్యము వేస్తుంది,
తెలివితేటలతో మాటలాడితే ముదరవంకాయి మాటలాడు-
తున్నాడని అసహ్యము వేస్తుంది. చొక్కాలు బిగుతు అయి-
పోవచ్చునని కొంచెమైనా యోచించకుండా హఠాత్తుగా పెరిగి
పోతూఉంటాడు, చూచినవాళ్లందరికీ అసహ్యము పుట్టిస్తూ
ఉంటాడు. పసితనానికి ఉండే లాలిత్యము పోతుంది, కంఠానికి
ఉండే మాధుర్యము అకస్మాత్తుగా మాయమయిపోతుంది—
అదిచూచి అతనిమీద నిందమోపనివాడు ఒక్కడుండడు.
పసిపిల్లవాని దోషాలు అనేకము క్షమించవచ్చును, యౌవన-
ములో ఉండేవాడి దోషాలు క్షమించవచ్చును, గాని రెండు
అవస్థలకూ మధ్యనున్న వీడిదోషాలు,ఎంత స్వాభావికమైనవైనా,
ఎంత అనివార్యమైనవైనా, ఎవరూ సహించి ఊరుకోలేరు.

పృథ్వీమీద ఎందులోనూ ఇమడనూ అని అతనికీ తెలు-
సును, అందుచేత తనను చూచి తానే సిగ్గుపడుతూ అందరినీ

క్షమించమని ప్రార్థిస్తూఉన్నట్టుగా నడుచుకొంటూఉంటాడు. కాని అదే అతనిలో ప్రేమ బాగాఉదయించే సమయము, ఆలాంటప్పుడు దయగలవాడెవడైనా అతనియెడల కొంచెము స్నేహమూ, ప్రేమా కనపరిచినట్టైతే అతనికొరకు తనసర్వమూ ధారపోయగలడు. కాని అటువంటి వానియెడల దయకనపరచడానికి ఎవరికీ ధైర్యముండదు, ముద్దుచేయకూడదు అని చూచినవాళ్ళంతా నిందిస్తారు. అందుచేత, పాపము, వాళ్ళవైఖరీ, వాళ్ళబ్రతుకూ చూస్తే ఎవరికీ అక్కరలేని వీథి కుక్క జ్ఞాపకము వస్తుంది.

అటువంటి అవస్థలో ఉండే కుర్రవాళ్ళకు తల్లిఇల్లుతప్ప ఇంకెక్కడైనా నరకమే. ఎవరూ ప్రేమించని చోట వాళ్లను ఉంచితే, ఎటువైపుతిరిగినా ముళ్లు గుచ్చుకుంటూఉన్నట్టుగా ఉంటుంది వాళ్ళకు. ఆ వయస్సులో స్త్రీజాతిని స్వర్గలోకములో ఉండే దుర్లభ జీవులని భావిస్తూఉంటారు, అందుచేత స్త్రీయొక్క అనాదరణవాళ్లు సహించలేరు.

అత్తకళ్ళలో ఎటువంటి అనురాగమూ లేకపోవడము ఫటిక్‌కు అన్నిటికంటె కష్టము అనిపించింది. అత్త అతనికి ఏదైనా పనిచెపితే అతి ఆనందముతో, చేయవలసినదానికంటె ఎక్కువగా చేసేవాడు. అది చూచి అత్త చివాట్లుపెట్టి అతని ఉత్సాహములో బుగ్గిపోసేసేది—"చాలా బాగా చేశావు, ఇక చాలించి నీపని నువ్వు చేసుకో; పో, వెళ్లు; చదువుకో,"

అనేది. అతని జ్ఞానాభివృద్ధికోసము అత్త చేస్తూఉండే ప్రయత్నము దయావిహీనమైనదని, పాపము, ఆ అబ్బాయికి అటువంటప్పుడు అనిపించేది.

ఇంట్లో ఈవిధముగా ఎల్లప్పుడూ చీవాట్లు—మనసారా ఊపిరి తీసుకోడానికైనా జాగా లేదని అతనికి అనిపించేది, పాపము. మామగారిఇంట్లో ఆ గదిగోడలమధ్య చిక్కుకొని తన పల్లెటూరి నివాసముమాట ఎల్లప్పుడూ అనుకొంటూ కూర్చుండేవాడు.

వాళ్ల ఊళ్లో పెద్దగాలిపడగ ఒకటి బోఁ బోఁ మని ఎగరవేసుకొంటూ మైదానముమీద తిరుగుతూఉండేవాడు, 'తాయ్ రె నాయ్ రె నాయ్ రె నా' అని తాను కల్పించినపాట పాడుకొంటూ ఆ నది ఒడ్డున తిరుగుతూఉండేవాడు, నీళ్ళు ఎండిపోయి సన్నముగా పారుతూఉన్న ఆ ఏటిలోకి ఎప్పుడుపడితే అప్పుడు దబ్బున దుమికి ఈత కొడుతూఉండేవాడు, తన జట్టువాళ్ళతో కలిసి నానారకాలుగా అల్లరిచేస్తూఉండేవాడు—అదంతా ఇప్పుడు జ్ఞాపకము వస్తూఉన్నది; కేవలము అసహాయుడయి వేరుగతిలేక ఇక్కడపడిఉంటున్న ఫటిక్ మనస్సును ఇవన్నీ ఇప్పుడు ఆకర్షిస్తున్నవి—ఎటువంటి యోచనా లేకుండా తనమీద శిక్ష విధిస్తూఉండే తన తల్లికూడా అతని హృదయాన్ని రాత్రింబగళ్లు ఆకర్షిస్తున్నది.

జంతుప్రేమ (జంతువులలో కనబడే ప్రేమ)వంటి గుడ్డి ప్రేమ ఒకటి అతనిలో పుట్టింది. ఇంటికి వెళదామనే ఒకగుడ్డి కోరిక, చాలారోజులు చూడకపోవడమువల్ల పుట్టిన ఒక అవ్యక్త వాంఛ, సాయంకాలమప్పుడు తల్లికనబడకపోతే దూడలో పుట్టే 'అమ్మా అమ్మా' అనే ఏడుపు, అతని మనస్సును పూర్తిగా నింపింది. సంకోచమువల్లా, సిగ్గువల్లా వాడిపోయింది అతని ముఖము; ఎండిపోయి, పొడవుగా, చూడడానికి అతి-వికారముగా ఉన్నాడు అతను.

ఇంత మొద్దుఅబ్బాయీ, ఇంత ప్రరధ్యానము కుర్ర-వాడూ క్లాసులో ఇంకొకడు ఉండేవాడు కాడు. ఏదైనా ప్రశ్నఅడిగితే హాఁ అనుకొంటూ చూస్తూ నిలుచుండేవాడు, మాస్టరు దెబ్బల వర్షము ప్రారంభించేవాడు. మూటలు మోసిమోసి అలసిపోయిన గాడిదలాగు ఘటికా అది సహించి ఊరుకొనే వాడు. స్కూలు విడిచిపెట్టి అందరు కుర్రవాళ్ళూ ఆడుకోడానికి వెళిపోయినప్పుడు, ఒక్కడే ఎదుటనుండే డాబాలూ, మేడలూ చూస్తూ కిటికిలో కూర్చుండేవాడు——ఆ డాబాలమీద ఎక్కడైనా ఇద్దరు ముగ్గురు బాలురుగాని బాలికలుగాని గంతులువేసుకొంటూ ఆడుకోవడము కనబడితే అతనిప్రాణము కొట్టుకుపోయేది.

ఒకనాడు మనస్సు బాగా గట్టిచేసుకొని సాహసించి మామను అడిగాడు, "మామా, అమ్మదగ్గిరికి నేను ఎప్పుడు వెళ్లడం?" అని.

"స్కూలు సెలవులు రానీ," అన్నాడు మామ. కార్తిక-*మాసములో వస్తవి దుర్గపూజ సెలవులు—ఇంకా చాలా రోజులు పోవాలి.

ఫటిక్ ఒకనాడు తన పుస్తకాలు పారేసుకొన్నాడు. చదువు ఒకంతటగాని వచ్చేదికాదు అతనికి, పైగా పుస్తకాలు పారేసుకోవడమొకటి! ఫటిక్ ఒంట్లో మరి ప్రాణాలు లేవు ఆవాళ. మాస్టరు అతనికి పేముతో రోజూ దెబ్బలు బాగా తగలనిస్తూఉండేవాడు. అతనితో బాంధవ్యము ఉన్నట్టు ఒప్పుకోవడానికి ఆస్కూలులోనే చదువుతూఉండే అతని మామ-కొడుకులకుకూడా సిగ్గువేసేది, ఫటిక్ దశ ఇదీ చివరకు. స్కూలులో అతనికి అవమానము జరిగినప్పుడల్లా బావమరుదులు పైకుర్రవాళ్లకంటె విస్తారము సంతోషము కనపరుస్తూ ఉండేవారు.

బాధ మరి ఓర్చలేక ఒకనాడు అత్త దగ్గిరికి వెళ్లి "అత్తా నా పుస్తకాలు పారేసుకున్నాను," అని ఘోరమైన అపరాధముచేసిన వాడిలాగు చెప్పాడు.

"మహా మంచి పని చేశావు నాయనా! నీకు ఒక్క నెలలో నాలుగు సార్లు పుస్తకాలు కొని ఇస్తూఉండడము

---

* తెలుగుదేశపు కార్తికమాసమూ బంగాళాదేశపు కార్తికమాసమూ పూర్తిగా ఒకటికాదు.

నావశము కాదు తండ్రీ," అని మాటి విరుచుకొంటూ అన్నది అత్త.

ఫటిక్ మరేమీ అనకుండా వెళిపోయినాడు. పై వాళ్ల డబ్బు పాడు చేశాను కదా అనుకొంటూ చాలా దుఃఖించాడు. తల్లియెడల గౌరవమూ, ఆదరమూ అతనిహృదయములో పుట్టినవి. తన హీనతా తన దైన్యమూ తనను మట్టిలో కలిపే శాయని అనుకోవడ మారంభించాడు.

ఆవాళ స్కూలునుంచి వచ్చేసరికి నొప్పితో తల దిగ్-దిగ్ మని కొడుతూఉన్నది, ఒళ్లు సురుసురుమంటూఉన్నది— జ్వరము వచ్చింది అనుకొన్నాడు. తనకు జబ్బువస్తే అత్తతల-మీాద ఉపద్రవము తెచ్చిపెట్టినట్టు ఉంటుందని మహా కంగారు-పడ్డాడు..అకారణముగా, అనావశ్యకముగా ఆమెను కాల్చుకు తినడానికి ఈజ్వరము తెచ్చిపెట్టుకొన్నాడని అత్త తప్పకుండా అనుకొంటుందని ఫటిక్ తనలోతాను అనుకొన్నాడు. 'నాలాంటి పనీపాటూలేని చేతకానిపెద్దమ్మకు తల్లి తప్ప ఇంకెవ-రైనా సేవచేస్తారని అనుకోవడము సిగ్గుమాలిన ఆశ' అని ఫటిక్ కి, అనిపించింది.

మర్నాడు ప్రొద్దున్న ఫటిక్ ఇంట్లోలేడు, ఇరుగు-పొరుగుఇళ్లన్నీ వెతికారు, ఎక్కడా కనబడలేదు.

ఆ ముందురాత్రి వర్షము ఆరంభించి, ఒకటేవరసను కురుస్తున్నది. అందుచేత వెతకడానికివెళ్లిన మనుష్యులు

వృథాగా తడిసి ముద్దకావడమే అయిందిగాని ఘటిక్ ఎక్కడా దొరకలేదు. చివరకు మామ పోలీసులో రిపోర్టు ఇచ్చాడు. రోజంతా అయిపోయి సాయంకాలముఅయింది. గుర్రపుబండి ఒకటి వచ్చి విశ్వంభరబాబుగారి ఇంటి ఎదుట నిలబడ్డది. ఇంకా వర్షము ధారలుధారలుగా విరామములేకుండా పడుతూఉన్నది, రోడ్డుమీద మోకాలుబంటి నీరు నిలిచిఉన్నది.

ఇద్దరు పోలీసువాళ్లు ఘటికును రెండుచేతులతో జాగ్రత్తగా పట్టుకొని ఇంట్లోకి తీసుకువచ్చి విశ్వంభరబాబు ఎదుట నిలుచోబెట్టారు. తలదగ్గిరనుంచి పాదాలదాకా తడిసి ముద్దఅయిపోయి ఉన్నాడు, గజగజమని వణుకుతున్నాడు. ఘటిక్ ఒంటినిండా బురద, కళ్లు కణకణ లాడుతున్నవి నిప్పులలాగు. విశ్వంభరబాబు అతనిని ఎత్తుకొని ఇంట్లోకి తీసుకువెళ్లాడు.

అత్త ఘటికును చూస్తూనే అన్నది—"నాకెందుకు ఈశోభ, పైవాళ్ల పిల్లణ్ణి ఇంట్లో పెట్టుకొని? పంపేయండి బాబూ, వాడింటికి వాణ్ణి పంపేయండి."

కాని నిజముగా, అత్త ఆనాడు గాభరావల్ల తిన్నగా తిండిఅయినా తినలేదు, తనపిల్లలమీద ప్రొద్దుటనుండీ చికాకు పడుతూనే ఉన్నది.

ఏడుస్తూ ఫటిక్ అన్నాడు—"నేను అమ్మదగ్గిరికి వెళ్లిపో-తూఉంటే, నన్ను వెళ్ళనివ్వకుండా ఇక్కడికి తీసుకువచ్చారు మామయ్యా."

పిల్లవాడి జ్వరము జాస్తీఅయిపోయింది రాత్రిఅంతా పలవరిస్తున్నాడు. విశ్వంభరబాబు వైద్యుని తీసుకువచ్చాడు.

ఫటిక్ కళ్లు నిప్పులలాగు ఎర్రగా కాలుతున్నవి, ఒక్క-మాటు ఆ కళ్లువిప్పి, మతిపోయినవానిలాగు ఇంటి వాసాల-వైపు చూస్తూ, "మామా మాకు సెలవులు ఇచ్చారూ?" అని అడిగాడు.

విశ్వంభరబాబు జేబులోనుంచి రుమాలు తీసి కళ్లు-తుడుచుకొంటూ ఫటికుదగ్గిరికి వచ్చి అతి ముద్దుతో ఫటిక్ చెయ్యి పట్టుకొని ఆ పరుపుమీద కూర్చున్నాడు—అతని చెయ్యి ఎండిపోయిఉన్నది, నిప్పులాగు కాలుతున్నది.

ఫటిక్ తిరిగీ పేలాపన ఆరంభించాడు "నన్ను కొట్టకు అమ్మా, నేను ఏమీ తప్పుచేయలేదు," అని పలవరిస్తున్నాడు.

మర్నాడు ప్రొద్దున్న కొంచెముసేపు తెలివిగా ఉన్నాడు, ఫటిక్; కళ్ళువిప్పి ఎవరికోసమో ఎదురుచూస్తూఉన్నట్టుగా నాలుగువైపులా చూచాడు. తరువాత నిరాశ చేసుకున్నట్టుగా పక్కకు ఒత్తిగిలి గోడవైపు ముఖము తిప్పేశాడు.

విశ్వంభరబాబు ఘటిక్ మనస్సులో ఉండేది తెల్సుకొని అతని చెవిదగ్గిర ముఖము పెట్టి, "మీ అమ్మను రమ్మని కబురు పంపాను ఘటిక్," అని అన్నాడు.

మర్నాడుకూడా గడిచిపోయింది. డాక్టరు, "చాలా కష్టము," అని అన్నాడు విచారిస్తూ.

గదిలో విస్తారము వెలుతురు లేదు. విశ్వంభరబాబు రోగి పక్కమీద కూర్చొని ఘటిక్ తల్లి వస్తుందేమో అని ప్రతిక్షణమూ ఎదురుచూస్తున్నాడు.

కళాసులలాగు దీర్ఘాలు తీస్తూ ఘటిక్ పలవరింతమాటలు అంటున్నాడు, "ఒకతాడుకు అందదు, రెండుతాళ్ళకు అందుతుంది—ఏయ్ లెసా ఓ ఏయ్ లెసా!" కలకత్తా వస్తున్నప్పుడు కొంతదారి స్టీమరుమీద వచ్చాడు, స్టీమరు కళాసులు లంగరు ఎత్తుతున్నప్పుడూ దించుతున్నప్పుడూ ఆలాగు దీర్ఘాలు తీసుకొంటూ లోతుకొలుస్తుండేవారు. ఘటిక్ ఇప్పుడు జ్వరములో ఆకాళాసులమోస్తరు దీర్ఘాలుతీస్తూ లోతు కొలుస్తున్నాడు, గాని ఇప్పుడు అతను ప్రయాణముచేస్తూఉన్న సముద్రములో లోతు తాడుకు దొరకకుండా ఉన్నది.

అటువంటి సమయములో ఘటిక్ తల్లి పెద్ద కేకలు వేసుకొని ఏడ్చుకొంటూ ఒక భయంకరమైన తుపానులాగు ఆ జబ్బు గదిలో వచ్చిపడ్డది. అన్న ఎంతో కష్టముమీద ఆమె కేకలు కొం

చెము ఆపాడు—ఆమె ఫటిక్ పరుపుమీద బోర్లా పడిపోయి "ఫటిక్, నా బంగారు తండ్రీ, నాయనా, నా మాణిక్యం!" అని మొరపెట్టడము మొదలుపెట్టింది.

మామూలుగా జబాబు ఇచ్చినట్టుగా ఫటిక్ "ఓయ్" అన్నాడు.

"ఫటిక్, నా తండ్రీ, నా ధనం!" అని తల్లి ఏడుస్తూ పిలిచింది మళ్ళా.

ఫటిక్ పక్కకు తిరిగి ఎవరివైపూ చూడకుండా అన్నాడు, "అమ్మా, నాకు ఇక సెలవులు, ఇంటికి వెళతాను!"

౧౮౯౨

# అ ప రి చి తా

ఇప్పుడు నాకు ఇరవైఏడేళ్లు మాత్రమే. వయస్సునుపట్టి చూస్తే నా జీవితములో గొప్పఏమీలేదు, గుణాలనుపట్టి చూస్తే అంతకంటె లేదు. అయినా నాలో ఏమీ విలువ లేక-పోలేదు. భ్రమరమువచ్చి పువ్వువక్షముమీద కూర్చుంటుంది, ఆ పాదవిక్షేపమువల్లనే ఆ పువ్వుబ్రతుకు సార్థకమయి దానిలోనుంచి పండు పుడుతుంది — నాజీవితమూ ఆ పువ్వు-వంటిదే.

నా కథ పెద్దకథ కాదు; పెద్దదిగా పెంచి వ్రాయను. కాని చిన్నదిగనుక సామాన్యమైనది అని పొరపాటుపడనివారే నా కథలోని రసము గ్రహిస్తారు.

కాలేజీలో ప్యాసుకావలసిన పరీక్షలన్నీ ప్యాసుఅయి-పోయినాను. చిన్నప్పుడు నేను చాలా అందముగా ఉండే-వాడను, అదిచూచి మా స్కూలులోపండితుడు వెక్కిరిస్తూ ఉండేవాడు, నన్ను బూరగుపువ్వు అంటూఉండే వాడు, నన్ను మేడిపండుతో సరిపోలుస్తూఉండేవాడు—అతనికిపాండిత్యము ప్రయోగించడానికి అవకాశము దొరికింది, అది చూస్తే నాకు చిన్నప్పుడు సిగ్గుగా ఉండేది. కాని, పునర్జన్మము ఉండి తిరిగి నేను రూపవంతుడనై పుట్టి పండితుడు నన్ను రోజూ వెక్కి-

రిస్తూ ఉంటే ఎంతఆనందముగా ఉండును అని ఇప్పుడు నాకు అనిపిస్తూ ఉన్నది.

మా నాన్న మొదట నిరుపేద. ప్లీడరీచేసి అమితముగా డబ్బు గణించాడు. అనుభవించుదామంటే ఒక్కక్షణము పాటుఅయినా అవకాశము దొరకలేదు. ఊపిరి విడిచి చని-పోయినాడు, అప్పుడు ఆతనికి మొట్టమొదట సెలవుదొరకడము.

నాన్న పోయేసరికి నేను చాలా చిన్నవాడను. మా అమ్మే నన్ను పెంచి పెద్దవాడిని చేసింది. బీదఇంటపుట్టినందువల్ల మేము ఇప్పుడు ధనవంతులమన్న మాట మాఅమ్మ ఒక్కనాటికీ మరవ-లేకపోయేది, నన్ను మరవనిచ్చేది కాదు. చిన్నప్పుడు నన్ను ఒళ్లోనుంచి దిగనిచ్చేదికాదు, అతిముద్దుతో పెంచింది. బహుశా అందుచేతనే గాబోలు నేను ఇప్పటికీ నిజముగా పెద్దవాడను కాలేదు. గజాననునిచిన్న తమ్ముడు-ఈఅబ్బాయి, అన్నపూర్ణ ఒళ్లో పెరిగాడు, అని చూచీచూడాగానే ప్రతివాడూ ఇప్పటికీ అనుకొంటాడు.

మాఇంటికి నిజమైన పెద్ద మామామ. అతనే నా గార్డి-యన్. అతను నాకంటె అయిదారేళ్లు పెద్ద మహాఅయితే! కాని అతను ఫల్గూనది ఇసకలాగు మా సర్వమూ తనలోపల దాచి ఉంచేసేవాడు, పుడిసెడు నీళ్లుకావలెనంటే తవ్వి తీసుకో వలసివచ్చేది వేరేమార్గము కనబడేదికాదు. అందుచేత నాకు ఏవిషయములో నైనా ఆలోచనా అవసరము లేకపోయేది.

పెళ్లికానిపిల్ల ఇంట్లో ఉండేతండ్రి నన్ను సత్పాత్ర అని అనని వాడు ఒక్కడు లేడు—నాకు ఆఖరుకు ఒకపొగచుట్ట-యినా అలవాటు లేదు. "మంచివాడు"గా ఉంటే ఎటువంటి చిక్కులూ ఉండవు. కనుకనే నేను బహుమంచివాడను. తల్లి-మాటప్రకారము నడుచుకొనేశక్తి నాలో కావలసినంతఉన్నది—అనగా ఏమిటంటే వేరేమోస్తరుచేసే సాహసము నాలో అణుమాత్రమైనా లేదు. అంతఃపుర శాసనానికి లొంగిఉండేటట్టే నేనే తయారయినాను; స్వయంవరపక్షపాతులైన కన్యకలు ఈ సులక్షణము జ్ఞాపకము ఉంచుకోండి!

పెద్ద పెద్దఇళ్లనుంచి సంబంధాలు నాకోసము వచ్చినవి. కాని, పృథ్వీమీద నన్ను కాపాడుతూఉండే భాగ్యదేవత ఏజంటైన మా మామకు ఈ విషయములో మతవిశేషము ఒకటి ఉండెను మామకు ధనవంతుల పిల్లలంటే ఇష్టము లేదు. మా ఇంటికివచ్చినపిల్ల తలవంచుకొనే ఉండవలెను అని అతని కోరిక. కాని డబ్బుమీద ప్రీతిమాత్రము అతనిలో అస్థిగతము. అతను కోరినది డబ్బు లేనివియ్యంకుడు, గాని ఆడబ్బు లేని వియ్యంకుడు రూపాయిలు పంపడానికి మాత్రము వెనకతీయకూడదు. మనము కావలసినంత పిండి, తీసుకోగలుగవలెను, అయినా మనము వెండిచెంబులకుబదులుగా ఇత్తడిచెంబులతో నీళ్లు-పెట్టినా తప్పుపట్టకూడదు—మా మామకు కావలసినది అటువంటి సంబంధము.

నా స్నేహితుడు, హరీశ్ కాన్‌పూరులో ఉద్యోగములో ఉన్నాడు. సెలవులలో అతను కలకత్తా వచ్చి నా మనస్సు చంచలము చేసేశాడు, "అతి చక్కని పిల్ల ఒకర్తె ఉన్నది రా అబ్బాయి, పిల్లఅంటే ఆమె రా పిల్ల," అన్నాడు.

అప్పటికి కొద్దిరోజులు ముందుగానే ఎం.ఏ. ప్యాస్ అయిపోయినాను. ముందుకు దృష్టి పారినంత మేర సెలవులు తప్ప వేరేమీ కనబడడములేదు. పరీక్షలు మరి లేవు; ఉద్యోగము లేదు; ఉద్యోగానికోసము ప్రయత్నములేదు; ఆస్తిచూచుకుంటూఉండవలెనన్న పూచీలేదు; దానికితగిన శిక్షలేదు. లోపున అమ్మా బయట మామా—ఈ ఇద్దరే నా అస్తిత్వ మనగా!

సెలవు అనే మరుభూమిలో విశ్వవ్యాపిఅయిన నారీరూపాము నాహృదయానికి మరీచికమయి కనబడ్డది—ఆకాశాన ఎటువైపుచూచినా అమెచూపే, గాలిలో నాలుగువైపులా అమెనిశ్వాసమే, చెట్లమర్మరధ్వనిలో ఆమె రహస్యపు మాటలే. అటువంటప్పుడు వచ్చి చెప్పాడు హరీశ్ ఆ మాటలు —'పిల్లంటే అమె రా అబ్బాయి, పిల్ల!' వకుళవనములో వసంతకాలపుగాలికి ఆడుతూఉన్న నవపల్లవరాసులవలె నా మనస్సు ఎండానీడను కలిపి నేయడము మొదలుపెట్టింది. హరీశ్ గొప్ప రసికుడు, రసభరితముగాచేసి వర్ణించేశక్తి అతనిలో కావలసినంత ఉన్నది; నాలో ఉన్నది తృషార్త హృదయము—"మామ

దగ్గిర ఈ సంగతి కొంచెము కదిపి చూడు," అని అన్నాను నేను.

ఇటువంటి సందర్భాలకు హరీశ్ తరువాతనే ఎవ్వరైనా. అందుచేత హరీశ్ అంటే సరదాలేనివాడు లేడు. హరీశ్‌ని దొరికితే మరి వదిలేవాడు కాడు మామ. మామ కూర్చొని ఉండగా హరీశ్ ఆ ప్రసంగము ఎత్తాడు. మామకు పిల్లకంటె ముఖ్యముగా కావలసిన సంగతి పిల్లతండ్రిమాట. తండ్రి అవస్థ సరిగా మామ కోరుతూఉండేటటువంటిదే! లక్ష్మియొక్క మంగళఘటము ఒకప్పుడు నిండేఉండెను ఆవంశములో, గాని ఇప్పుడు మాత్రము పూర్తిగా ఖాళీఅనే చెప్పవచ్చును. ఐనా అడుగునమాత్రము కొద్దో గొప్పో ఇంకా లేకపోలేదు. స్వదేశములోఉంటే వంశమర్యాదలు కాపాడుకోవడము కష్టము అని గ్రహించి పిల్లతండ్రి పశ్చిమప్రాంతాలకు వెళిపోయి అక్కడ ఏడబ్బులేనివాని మోస్తరుగానో కాలము గడుపుతూ-ఉన్నాడు. అతనికి ఒక్కకొమార్తెతప్ప మరెవరూ లేరట, గనుక లక్ష్మీభాండము పిల్లదానివెనుకనే పంపేయడానికి అతనికి ఎటువంటిసంకోచమూ ఉండకూడదన్నమాట.

ఇవన్నీ మంచిసంగతులే, గాని పిల్లవయస్సు పదిహేను అని వినగానే మామఉత్సాహము కొంత తగ్గింది. గోత్రములో ఎటువంటి దోషమూలేదు కదా? అబ్బే ఏమీ దోషము లేదు. పిల్లకుతగిన సంబంధము ఎంతవెదికినా తండ్రికి కనబడలేదు

మొదటిసంగతి ఏమిటిఅంటే పెళ్లిబజారు చాలా గిరాకీగా ఉన్నది; పైగా విల్లు విరుస్తేనేగాని పిల్లను ఇవ్వను అని వ్రతము పట్టుకుకూర్చున్నాడు తండ్రి. కనుక చివరకు జరుగుతూఉన్న దేమిటి—తండ్రి పెళ్లి వెనక పెడుతున్నాడు గాని పిల్లవయస్సు-మాత్రము ఆగకుండా ఉన్నది.

ఏది ఏలాగున్నా హరీశ్ సరసమైన రసనలో కొంత రసము లేకపోలేదు. మామమనస్సు మెత్తపడ్డది, వివాహము-యొక్క భూమిక నిర్విఘ్నముగా జరిగిపోయింది. కలకత్తా తీసేయగా మిగిలిన ప్రపంచమంతా అండమాన్ ద్వీపములోని-భాగము అని మా మామ అభిప్రాయము. ఏదో ముఖ్యమైనపని ఉండడము చేత ఒక్కమారు 'కోన్నగర్' వెళ్లాడు మా మామ, పుట్టినప్పటినుండీ ఆ ఒక్కమారుతప్ప ఎప్పుడూ ఎక్కడికీ వెళ్ల లేదు. మా మామే మనువు అయిఉంటే కలకత్తాలోఉన్న హౌడా వంతెన దాటి వెళ్లడము సంహితములో నిషేధించేసి ఉండును. పిల్లను చూచివద్దామని నాకు చాలా కోరిక కలి-గింది, గాని అడగడానికి సాహసము లేకపోయింది. పిల్లను ఆశీర్వదించి వచ్చినవాడు, మా 'బినూ దాదా'* ఇతను మా మేనత్తకొడుకు. ఇతని రుచిలోనూ, విచక్షణలోనూ నాకు బాగా నమ్మకము ఉన్నది, వాటిని నమ్మినేను అంతా అతనిచేతులలో

*దాదా=అన్న. తెలుగువాళ్లలాగు కాకుండా, బంగాళీవాళ్లు మేనత్త బిడ్డలను 'అన్న' 'తమ్ముడు' 'అక్కా' 'చెల్లీ' అనిపిలుస్తారు.

విడిచిపెట్టగలను. బినూ-దా†తిరిగివచ్చి "లోప మేమీ కనబడ లేదోయ్; నిగ్గైన బంగారము, సందేహము లేదు," అన్నాడు. బినూదా సరిగా తూచినట్టుగా మాటలాడుతాడు ఏవిషయములోనైనా; అందరమూ "ఆహా, అద్భుత ముగా ఉన్న దే!" అనేచోట అతను, "ఫర్వాలేదు సంసారపక్షముగా ఉన్నది," అంటాడు. కనుక నావిషయములోమాత్రము ప్రజాపతికీ పంచశరునికీ విరోధము లేదు అని నాకు బోధపడ్డది.

పెళ్లికి ఆడపెళ్లివాళ్లే కలకత్తా రావలసివచ్చింది, ఈ మాట చెప్పకుండానే అందరూ పోల్చుకొనిఉంటారు. పెళ్లి-కూతురు తండ్రి, శంబునాథ్ బాబు, నన్ను మొదటిమాటు చూచి అశీర్వదించడము పెళ్లి మూడురోజు లున్నది అనగా; దీనినిపట్టి ఎవరికైనా తెలుస్తుంది శంభునాథ్ బాబు హరీశ్ ను ఎంతవరకు నమ్మాడో. నలభైకి ఒకటో అరో ఇటోఅటో అయిఉంటుంది అతని వయస్సు; నల్లనిజట్టు; మీసాలు కొంచెముకొంచెము నెరియడము మొదలుపెడుతున్నవి. అతి చక్కనివాడు ఏమీ సందేహము లేదు, వెయ్యిమందిలో ఉన్నా మనకళ్లు ముందుగా అతనిమీద పడతవి.

నన్నుచూచి సంతోషించాడు అనుకొంటాను. అయినా చెప్పడము కష్టము, పైకి ఏమీ తెలియనిచ్చేస్వభావము కాదు అతనిది, చాలా "చూప్ చాప్" మనిషి, చెప్పే రెండు-

† బినూదా = బినూదాదా

మూడు మాటలైనా ఖాటీగా చెప్పవలసినవాడు కాడు. మా మామమాటలుమాత్రము అనర్గళముగా ప్రవహిస్తూఉండెను, ధనములో నైతే నేమి, మానమర్యాదలలో నైతేనేమి, మేము ఈఊరిలోఉండే ఎవరికంటేకూడా తక్కువకాము అని అనేక విధాల అతను ఎత్తే ప్రతిప్రసంగములోనూ తెలియజేశాడు ఆమాటలు శంభునాథ్ బాబు వినిపించుకొన్నట్టు కనబడడు; మధ్య ఎక్కడా ఊఁ ఆఁ అయినా వినబడలేదు. నానోరైతే అది చూచి, మూసుకొనిపోయుఉండును, గాని మామనోరు మూయడము కష్టము. శంభునాథ్ బాబు ఏమీ మాటలాడక పోవడముచూచి మనిషిలో ప్రాణము లేదు అని అనుకొన్నాడు మామ, ఏమీ జోరు లేనివాడు మనిషి అని అనుకొన్నాడు. సంప్రదాయము ఎటువంటిదైనా వియ్యంకునిలో జోరుమాత్రము ఉండదగిన వస్తువు కాదు, గనుక అది చూచి మామ లోలోపున సంతోషించాడు. చివరకు శంభునాథ్ బాబు లేచాడు, మామ అతి క్లుప్తముగా మేడమీదనే సెలవు తీసుకొన్నాడు, కిందికి బండిదాకా వచ్చి సాగనంపలేదు.

కట్నము స్థిరపరిచారు, రెండుపక్షాలవారికీ అంగీకారముగానే ఉండెను. తాను అతిగడుసు, బాగాపండిపోయిన మనిషి అని మామ గర్వపడుతూఉండేవాడు. మాటలలో ఎటువంటిసందూ విడిచిపెట్టడు మామ. రూపాయిలసంఖ్య ఇంతకుముందే నిశ్చయము అయిపోయింది. ఎన్నితులాలబంగారమో, ఏవన్నెబంగారమో అదికూడా ఇప్పుడు స్థిరపరిచారు. ఈ

మాటలలో నాకు ఏవంతూ లేదు, ఇచ్చిపుచ్చుకోవడాలగురించి ఏమి స్థిరపరిచారో నాకు ఏమీ తెలియదు. ఈ స్థూలవిషయము వివాహములో ముఖ్యమైన అంశ అని మాత్రము నాకు తెలుసును. ఆ అంశ కాపాడేపూచీ ఎవరినెత్తిమీద ఉంచామో అతను ఏమాత్రమూ టోపీపడడు అనికూడా నేను ఎరుగుదును. మా మామే మాఇంటిగర్వానికి మూలాధారము. మాతోసంబంధించిన ప్రతివిషయములోనూ తన తెలివితేటలు ప్రయోగించి గెలుచుకు వస్తాడు మామ — ఆ మాట అందరూ ఒప్పుకోనేతీరవలెను. అందుచేత మాకు లేమిలేకపోయినా, అన్యపక్షమువారికి కావలసినంత లేమి ఉన్నా ప్రతివిషయములో మేము గెలిచి తీరుతాము. దానివల్ల ఎవడు చస్తాడు ఎవడుబ్రతుకుతాడు అనే ఆలోచనతో మా కేమీ సంబంధములేదు. మేము గెలిచితీరాలి—ఇదే ఈ పృథ్వీమీద మేము పట్టిన దీక్ష.

'గాయే హాలుద్' * అసంభవమైన ఆడంబరముతో జరిగింది. మేముపంపిన సామాను మోసుకువెళ్లిన మనుష్యులజనాభా ఎత్తవలెనంటే గుమస్తాలేనిదే సాధ్యముకాదు. వాళ్లకు మామూళ్లుఇవ్వడానికి పెళ్లివాళ్లకు అయేఖర్చుమాట తలచుకొని మామా, అమ్మా కలిసి పక్కలు బద్ధలైపోయినట్టుగా నవ్వారు.

* పెళ్లికి ముందు జరిగే ఒక విధానము.

అల్గోజా, సనాయి, బ్యాండు, కాన్సర్టు, మొదలు కొని మనదేశములో అన్నిటికంటే అధికము శబ్దముచేసే వాయిద్య యంత్రము ఏది ఉన్నదో అంతవరకు, అన్నీ కలిపి వాయింపించి కిరాతకోలాహలము చేసుకొంటూ సంగీతసరస్వతియొక్క పద్మ-వనము కుమ్ముకుపోతున్న మదపుటేనుగులాగు నేను విడిది-ఇంటికి వెళ్లి కల్యాణమండపము ప్రవేశించాను. ఉంగరాల తోనూ, హారాలతోనూ, జరీజవ్వారి తోనూ నిండిఉన్న నా ఒళ్లు వేలాముపాటకు సిద్ధముచేసిన దుకాణములాగు కనబడు-తున్నది. మామగారికి తెలియజేదామని ప్రతిఅంగముమీదా రాబోయే అల్లుడిఖరీదు వ్రాసుకొని వెళ్లినట్టుగా వెళ్లాను.

పెళ్లిఇంట్లో ప్రవేశించి మామ ఆనందించలేదు. ఇల్లు-చిన్నది, మగపెళ్లి వాళ్లంతా ఆ ఇంట్లో పట్టరు, ఇది మొదటి-కారణము. రెండవది, ఏర్పాటులన్నీ మధ్యరకముగా ఉన్నవి. అన్నిటికంటె ముఖ్యమైన కారణము, శంభునాథ్ బాబుగారి మోస్తరు చూడగా ఏమీఉత్సాహము ఉన్నట్టులేదు, ఆయన వినయము మోతాదుగా ఉన్నట్టు కనబడ్డది, ఆయన నోటివెంట మాట లేదు.

బట్టతలా, పగిలినగొంతుకా, స్థూలకాయమూ గల ఆజానుబాహుడొకడు నడుముబిగించి, మాటిమాటికీ చేతులు, జోడిస్తూ, తలవంచుకొని, అతినమ్రతతో చిరునవ్వునవ్వుతూ-కాన్సర్టు వాయిద్యము ప్రారంభమయినప్పటినుండి పెళ్లివారి-

నందరినీ ఆసనాధిష్ఠులను చేస్తున్నాడు. ఈయన ఒక వకీలు, శంభునాథ్ బాబుగారిస్నేహితుడు. ఈయన ఈలాగు చేస్తూ-ఉండబట్టి గాని లేకపోతే మొట్టమొదటనే ఇటోఅటో అయి-పోయిఉండును.

నేను సభలో కూర్చున్నకొంతసేపటికి మామ శంభు-నాథ్ బాబును పక్కగదిలోకి పిలుచుకొని వెళ్లాడు, అక్కడ మొదటఏమిజరిగిందో నాకు తెలియదు, గాని కొంతసేపయిన-తరువాత శంభునాథబాబు నాదగ్గిరికి వచ్చి, "ఒక్కమారు ఈలాగురా బాబాజీ!" అన్నాడు.

సమాచారము ఏమిటంటే, చెప్తాను వినండి— అందరికీకాకపోయినా కొంతకొంతమందికి జీవనములో ఏదో ఒకలక్ష్యము ఉంటుంది. అలాగే మా మామకూ ఒకలక్ష్యము ఉన్నది; తాను ఎవరివల్లా టోపీపడకుండా ఉండడము అనేది మా మామ లక్ష్యము. వియ్యంకుడు వస్తువులు పెట్టడములో ఏదో టోపీవేస్తాడని మామనమ్మకము. టోపీవేస్తేమాత్రము పెళ్లిఅయిపోయినతరువాత పగతీర్చుకోడానికి మరి అవకాశము దొరకదని అతనికి తెలుసును. ఇంటిఅద్దే, కట్నాలూ, మామూళ్లూ— వీటినిగురించి జరిగిన లాగులాటలనుబట్టి చూస్తే ఖర్చుపెట్టవలసిన విషయాలలో కేవలము శంభునాథ్ బాబుగారిమాటమీద నమ్ముకొని కూర్చోవడము ప్రమాద-మని మామ కనిపెట్టాడు. అందుచేత తనతోకూడా మా ఇంటి

కంసాలిని తీసుకొని వచ్చాడు. పక్కగదిలోకి వెళ్లి చూచాను. మామ బల్లమంచముమీద కూర్చొని ఉన్నాడు; కింద గచ్చుమీద మా ఇంటి కంసాలి కూర్చొని ఉన్నాడు, త్రాసూ, గీటురాయీ మొదలైన సామగ్రి అంతా ముందు పెట్టుకొని.

శంభునాథ్ బాబు నాతో అన్నాడు, "పెళ్ళి ప్రారంభము కాకముందే బంగారము మచ్చుచూపించి తూపించేసుకొంటా-నని మీ మామ అంటున్నారు, దానికి నువ్వేమి టంటావు?"

నేను తలవాల్చుకొని కూర్చున్నాను, ఏమీ అనలేదు.

"వా డేమిటంటాడు!, నేను ఏమిటంటే వాడూ అదే అంటాడు," అన్నాడు మామ.

"ఆలాగేనా ? ఆయనన్నమాటే నిఖరమా? ఈ విషయ-ములో నువ్వుచెప్పవలసినది ఏమీ లేదా? "అని శంభునాథ్-బాబు నావైపుచూస్తూ అన్నాడు.

కొంచెము తల ఆడించి ఇటువంటివాటిలో నాకు ఏవిధమైన అధికారమూ లేదని తెలియజేశాను.

"సరే అయితే కూర్చో, పిల్లఒంటిమీదనుంచి తీసి వస్తువులన్నీ పట్టుకొనివస్తాను," అని అంటూ శంభునాథబాబు లేచాడు.

"అనుపమ్ ఇక్కడెందుకు, సభలోకి వెళ్లి కూర్చో-నివ్వండి," అని మామ అన్నాడు.

"వద్దు, సభలోకి వద్దు, ఇక్కడే కూర్చోవాలి."

కొంచెముసేపుఅయినతరువాత గావంచామూట ఒకటి తీసుకువచ్చి, మంచముమీద పెట్టి, విప్పి పట్టుకొన్నాడు శంభునాథబాబు. తనతాతగారి కాలమునాటివి ఆ వస్తువులన్నీ, ఇప్పటిఫ్యాషన్ నాజూకుపని కాదు. అవి ఎంతమోటావస్తువులో అంతభారీవి.

వస్తువులు రెండుచేతుల్లో పట్టుకొని, "ఇవి మరి చూసేదేమిటి, కలితీఏమైనా ఉంటేనా వీటిలో! ఇప్పుడు ఇటువంటిబంగారము ఉపయోగించనే ఉపయోగించరు," అన్నాడు కంసాలి.

ఆలా అంటూ మొసలిమూతికంకణము ఒకటి తీసి దానిమీదఒక్క సుత్తిదెబ్బ వేసేసరికి అది వంగిపోయింది.

ఇప్పుడు చూపిస్తూఉన్నవన్నీ తరువాత ఇస్తాడో లేదో అని మామ తననోటుబుక్కులో ఆ వస్తువులపట్టీ ఎక్కించాడు లెక్క వేసి చూచాడు. సంఖ్యనుబట్టి చూచినా, తూనికనుబట్టి చూచినా, వెలనుబట్టిచూచినా అనుకొన్నదానికంటె అనేకరెట్లు అధికము.

ఆ వస్తువులలో ఒక తమ్మెట్లజత ఉన్నది. శంభునాథబాబు దానిని కంసాలిచేతికి ఇచ్చి పరీక్షచేయమని అన్నాడు.

"ఇది సీమలో తయారయి వచ్చినది, ఇందులో బంగా-రమువంతు అతిస్వల్పము," అన్నాడు కంసాలి.

"ఇది మీదగ్గిరే ఉండనివ్వండి," అని ఆ తమ్మెట్లజోడా మామచేతిలో పెట్టాడు.

మామ నిదానించి దానిని చూచాడు, చూచి పోల్చుకొన్నాడు, మొట్టమొదట ఇవి పిల్లను ఆశీర్వదించి నప్పుడు మేము పెట్టినవే.

మామముఖము ఎర్రగాఅయిపోయింది. 'దరిద్రుడు నన్ను టోపీవేయబోయినాడు నేను వాడి టోపీలోపడలేదు' అని అనుకొనే ఆనందము లేకుండాపోయింది, పైగా కాస్త కొసరు-కూడా దొరికింది, మామ ముఖము వాడిపోయింది, "నువ్వ సభలోకి వెళ్లి కూర్చో అనుపమ్," అన్నాడు ఆఖరుకు నావైపు తిరిగి.

"ఇప్పుడు సభలో కూర్చోనక్కరలేదు, మొదట మీకు భోజనాలు పెట్టించేస్తాను," అన్నాడు శంభునాథబాబు.

మామ అన్నాడు, "అ దేమిటి ఆకబురు, లగ్నము——"

"మీరేమీ కంగారుపడకండి, ముందు భోజనానికి లేవండి."

మనిషి అతిమంచివాడిలాగు ఉంటాడు పైకి, కాని లో-పునమాత్రము కావలసినంతజోరు ఉన్నది, స్పష్టము. మామ

లేవక తీరిందికాదు. పెళ్లివారి భోజనాలు అయిపోయినవి. విందులో ఆడంబర మేమీ కనబడలేదు గాని అంతా అతిపరి-శుభ్రముగా ఉండెను, భోజనానికివచ్చినవారంతా చాలా సంతోషించారు.

మాతోవచ్చినవారందరి భోజనాలూ కాగానే నన్ను లేవమన్నాడు శంభునాథబాబు.

"అదేమిటి, లగ్నానికిముందు పెళ్లికొడుకు ఏలాగు భోజనముచేస్తాడు?" అన్నాడు మామ.

మా మామ తన అభిప్రాయము అంతస్పష్టముగా వ్యక్త పరుస్తూఉన్నా దానినేమీ లక్ష్యపెట్టకుండా శంభునాథ్ బాబు నావైపు చూస్తూ, "నీ అభిప్రాయము ఏమిటి? భోజనము చేయడములో ఏమైనా దోషముఉన్న దంటావా?" అని అన్నాడు

'మాతృ-ఆజ్ఞ'స్వరూపమై మామ నాఎదుట నిలుచు-న్నాడు. ఆయనఅన్నదానికి విరుద్ధముగా నడుచుకోవడము అసంభవము కదా! భోజనానికి మరి వెళ్లలేకపోయినాను.

అప్పుడు శంభునాథబాబు ప్రారంభించాడు, "మిమ్మును చాలా కష్టపెట్టాను. నేను ధనవంతుడనుకాను. మీకుతగిన ఏర్పాట్లు చేయలేకపోయినాను, క్షమించండి. చాలారాత్రి-

అయిపోయింది, మీ శ్రమ మరి అధికముచేయడానికి నాకు ఇష్టములేదు. అయితే మరి—"

"పదండి, అయితే, సభలోకి వెళదాము, మేము సిద్ధముగానే ఉన్నాము," అన్నాడు మామ.

"మీ బళ్లను పిలుస్తాను?" అన్నాడు శంభునాథబాబు.

"హాస్యమాడుతున్నట్టున్నారే!" అన్నాడు మామ, ఆశ్చర్యపోతూ.

హాస్యముతో ప్రారంభించి చివరవరకు హాస్యమాడినది మీరే. అటువంటి హాస్యపుసంబంధాన్ని శాశ్వతపుసంబంధ-ముగాచేసే కోరిక నాలో లేదు," అన్నాడు శంభునాథబాబు.

మామ కళ్లు ఇంతింతచేసుకొని నిర్ఘాంతపోయి చూస్తున్నాడు.

"నా కొమార్తైవస్తువులు నేనే దొంగలించవచ్చును అని అనుకోగలిగినవారిచేతికి నా కొమార్తైను నేను ఎన్నటికీ అప్పచెప్పలేను," అన్నాడు శంభునాథబాబు.

నాతో ఒక్కమాట అనవలసిన అవసరము ఆతనికి కనబడలేదు. ఈ వ్యవహారమంతటిలో నేను ఎవ్-వడినీ కాను అని ఆతనికి బోధపడిపోయింది.

తరువాత జరిగినది చెప్పవలెనని నాకు లేదు. కట్టిన చీనాబుట్టలు తెంపి తీసేసి, సామానులన్నీ కలగాపులగముగా

మాటలుకట్టి, పూర్వము దక్షయజ్ఞమప్పుడుజరిగిన నాటకము తిరిగీ ఆడి, మొగపెళ్లివారు బయలుదేరారు.

ఇంటికి తిరిగివస్తున్నప్పుడు బ్యాండు, కాన్సర్టు, సనాయిమేళము, అన్నీకలిసి మరి పాటమొదలుపెట్టలేదు. అభ్రకముదీపాలచెట్లు తమ భారమంతా నక్షత్రాలకు అప్పచెప్పి మహానిర్వాణప్రాప్తిపొంది ఎక్కడకూర్చున్నవో ఆ సంగతి తెలియలేదు.

౨

ఇంట్లోఅంతా కోపముతో మండిపోతున్నారు. "ఎంత పొగరు పిల్లతండ్రికి! "పిల్లకు పెళ్లి ఏలాగు అవుతుందో చూస్తాము కదూ!" అని అంతా అన్నారు. కాని పిల్లనుపెళ్లి-కాకపోతే ఏలాగు అని భయపడనివాడికి బుద్ధిచెప్పే ఉపాయమేమిటి?

పిల్లతండ్రిచేత పెళ్ళిసభలోనుంచి తోలివేయబడ్డ పెళ్లి-కొడుకు హిందుదేశమంతటిలో ఇంకొకడు ఉండడు. దీపాలు వెలిగించి, బాజాబజంత్రీలు వాయిస్తూ, ఇంత హడావిడిచేస్తూ, ఏ నష్టగ్రహమో ఎందుకు ఇటువంటి సత్పాత్రనొసటను ఇంత పెద్ద మచ్చ పెట్టి వెళిపోయిందో కదా! 'పెళ్లికాలేదు సరే కదా, మమ్మును మోసపుచ్చి మాకు విందుసేసి మరీ పంపాడు,' అనుకొంటూ పెళ్లివాళ్లు తలమొత్తుకొన్నారు.

లోపల నున్న పాకయంత్రాలను అన్నముతో కూడా పైకి లాగి వాళ్ల మొఖాన పారేసి రాగలిగితే మావాళ్ల దుఃఖము కొంత-వరకు చల్లారిఉండును.

మానహాని కలిగించినందుకూ, బ్రీచ్ ఆఫ్ కాంట్రాక్ట్ చేసినందుకూ వాళ్లమీద దావాచేస్తానని మామ గొడవ-పెడుతూవచ్చాడు. అదికూడా జరిగిపోతే తమాషా పూర్తి-కావడానికి ఏపిసరుబాకీ ఉన్నదో అదీ పూర్తిఅయిపోతుంది అని మామంచి కోరే నలుగురూ మామకు నచ్చచెప్పారు.

నాకుకూడా బాగా కోపము వచ్చింది, ఆమాట వేరే చెప్పనక్కరలేదు. ఏమైనా, చివరకు శంభునాథబాబు వచ్చి మాకాళ్లమీద పడతాడు, వేరేమార్గము లేదు అని నా నమ్మకము; మీసముమీద చెయ్యివేసుకొని రాత్రింబగళ్లు ఈకోరికే కోరుతుండేవాడను.

కాని ఆ నల్లని కోపప్రవాహము పక్కనే మరిఒక ప్రవాహము నాలో పారుతుండెను; దీనిరంగు నలుపుకానే-కాదు. నా మనస్సంతా ఆ అపరిచితవైపు పరుగెత్తుతుండెను. ఇప్పటికీ దానిని అటువైపునుంచి తిప్పి తీసుకురాలేకుండా ఉన్నాను. ఆహా! గోడచాటున ఉండి పారిపోయింది కదా! ఆమె నొసటనున్నది చందనము; ఆమె కట్టుకొనిఉన్నది ఎర్ర-చీర; ఆమె సిగ్గుచేత ముఖము ఎర్రగా చేసుకొంటూఉన్నది, ఆమె హృదయములో ఏమి ఉన్నదో నేనెట్లు చెప్పగలను? నా

కల్పనాలోకములోనున్న కల్పలత తన వసంతపుష్పభారము నాకు సమర్పిద్దామని వంగిఉన్నది, ఆ గాలి వచ్చి నాకు తగులు-తూఉన్నది, వాసన కొడుతూఉన్నది, ఆకులకలకల వినబడుతూ-ఉన్నది. లోపున అడుగు ఎప్పుడు పెడుతుందాఅని కనిపెట్టుకొని ఉన్నాను,నాకూ ఆమెకూ మధ్యనున్నది ఆమె-లోపున-అడుగు-పెట్టడము,—ఆ కొస్తపిసరు దూరమే రెప్పపాటులో అపార-మైన దూరము అయిపోయింది.

ఇన్నాళ్లూ ప్రతిసాయంకాలమూ బినూదాగారిఇంటికి వెళ్లి బినూదాను చికాకుపెట్టేసేవాడను. బినూదా మాటలు అనేకముగా ఉపయోగించి దేనినైనా విపులముగా వర్ణించ-వలసినవాడుకాడు. అందుచేత అతనుఆడే ప్రతిమాటా స్ఫులింగమయి నాహృదయములో ప్రవేశించి అక్కడ నిప్పు-పుట్టించేది. పిల్లదానిది చాలా అద్భుతమైనరూపు అని పోల్చు-కొన్నాను. కాని నేను ఆమెను కంటచూడలేదు, ఆమెఆకా-రము నా మనస్సుకు ఒక అస్పష్టమైన పదార్థమే. బైటనా ఆమె నాకు దొరకలేదు, నామనస్సులోనికా తీసుకురాలేక-పోయినాను. అందుచేత నా మనస్సు నిట్టూర్పువిడుస్తూ ఆ పెళ్ళిసభగోడలచుట్టూ దయ్యములాగు తిరుగుతున్నది.

పిల్లకు నా ఫొటోగ్రాఫ్ ఇచ్చారని హరీశ్ చెప్పగా విన్నాను. చూచి ఇష్టపడి ఉంటుంది, సందేహాములేదు; ఇష్టపడకపోవడానికి కారణము లేదు. నా ఫొటోగ్రాఫ్ తన

పెట్టెలో పెట్టి దాచి ఉంచింది అని నా మనస్సు చెప్పుతూఉన్నది. ఒకొక్కనాడు మట్టమధ్యాహ్నమప్పుడు గదితలుపు వేసుకొని దానిని పెట్టెలోనుంచి పైకి తీసి చూడదూ? ముందుకు వంగి పటముదగ్గిర ముఖము పెట్టి ఆమె చూచినప్పుడు విరబోసిఉన్న ఆమెజుట్టు రెండుభుజాలమీదనుంచీ వచ్చి ఆపటముమీద పడదూ? మధ్యమధ్య ఎప్పుడైనా హఠాత్తుగా బయట అడు-గులచప్పుడు వినబడగానే, సుగంధముతోనిండిఉన్న తనపైట-చెంగు కప్పి ఆ పటము దాచేయదూ?

రోజులు గడిచిపోతూఉన్నవి. ఒక సంవత్సరము అయి-పోయింది, సిగ్గువల్ల పెళ్ళితో సంబంధించిన మాట ఒక్కటైనా నా నోటివెంట రానివ్వలేదు. నాకుజరిగిన అవమానమును గురించి నలుగురూ మరిచిపోయిన తరువాత తిరిగీ పెళ్ళిప్రయత్నము చేదామని అమ్మఅభిప్రాయము.

నాసంగతి ఈలాగు ఉంటూఉండగా అవతల పిల్లకుమంచి సంబంధము వచ్చింది, గాని పిల్ల పెళ్లిచేసుకోనని శపథము పట్టింది అని విన్నాను. వినేసరికి నా మనస్సున పులకరింపు పుట్టింది. పాపము, ఆ పిల్ల సరిగా భోజనమైనా చేయడము లేదు, అది నా కల్పనాచక్షువుకు కనబడుతూఉన్నది. సాయం-కాలమయి చీకటయిపోతూఉన్నది గాని తలదువ్వుకోవడము మాట ఆమెకు జ్ఞాపకము రాకుండాఉన్నది, పాపము; తండ్రి కూతురువైపు మాటిమాటికీ చూచేవాడు, చూచి ఏమి మా

అమ్మాయి రోజురోజుకీ ఈలాగు అయిపోతూఉన్నది అని అనుకొంటూఉంటాడు. ఒకనాడు హఠాత్తుగా ఆమెగదిలోనికి వచ్చిచూస్తాడు, అమ్మాయి రెండుకళ్లనిండా నీళ్లు, "నీకేమయింది చెప్పవూ తల్లీ?" అని బ్రతిమాలుకొంటూ అడుగుతాడు. "అబ్బే, ఏమీ లేదే ఎందుకు ఆలా' అడుగుతున్నావు నాన్నా?" అని అంటుంది కూతురు. తండ్రికి ఒక్కర్తే కుమార్తె, పాపము! అతి గారాబముగా పెంచాడు. అనావృష్టివల్ల వాడిపోతూఉన్న మొగ్గలాగు ఆనందమన్నమాట లేకుండా వాడిపోతూఉంటుంది అమ్మాయిముఖము; తండ్రి మరి భరించలేడు. అభిమానము పొయ్యిలో పెట్టేసి మా ద్వారముదగ్గిరికి వచ్చి నిలుచుంటాడు. తరువాత జరిగినదేమిటి? తరువాత నా మనస్సులో ప్రవహిస్తూ ఉన్న ఆ నల్లనిధార ఒక నల్లతాచుఅయి భుస్‌భుస్‌మంటూ లేస్తుంది. లేచి "సరే, మరిఒకమారు పెళ్ళిపందిరి ముస్తాబు-చేయండి, దీపాలూ దివిటీలూ వెలిగించండి, దేశదేశాలకు మీ శుభలేఖలు పంపండి, ఆఖరుకు పెళ్ళికొడుకు నెత్తినిఉన్నపాగా కాళ్లకిందవేసి కుమ్మి మీ బంధుమిత్రపరి-వారసమేతముగా వివాహసభ విడిచిపెట్టి వెళిపొండి," అంటుంది. కాని ఆ ధారతోపాటు మరిఒకధార ఉన్నది కదా, కన్నీటివలె నిర్మలమైనది—ఈ ధార రాజహంసరూపము ధరించి అంటుంది, "నేను పూర్వమొకమారు దమయంతి-పుష్పవనములోనికి వెళ్లాను, ఆలా' నన్ను మరిఒకమారు వెళ్లనీ; నేను వెళ్ళి విరహిణిచెవిలో సుఖసందేశము చెప్పి ఆమెకు

కొంచెము ఆనందము కలుగజేసి వస్తాను." తరువాత? తరువాతనా? చీకటి మరి ఉండదు, దుఃఖపురాత్రి తెల్లవారిపోతుంది, నవవర్షధారలు పడతవి, వాడిపోయినపువ్వు నవ్వుతూ తలఎత్తుతుంది. ఈమాటుకూడా భూలోకములో ఉన్న జనులంతా ఆ గోడలఇవతల, బయటనే, ఉండిపోతారు. కాని లోపలికి ఒక్కడుమాత్రము వెళతాడు. అటుతరువాత? తరువాత మరేమిటి, నా కథ పూర్తిఅయిపోవడమే!

కాని నా కథ ఆలాగు పూర్తికాలేదు. ఆ పూర్తికాని వైపుమాట కొంచెము వివరించి ఈ వ్రాత ముగిస్తాను.

3

అమ్మను తీర్థయాత్రకు తీసుకొని బయలుదేరాను. ఇప్పటికీ మామ హాడావంతెన దాటి వెళ్లడు గనుక ఈభారము నామీదనే పడ్డది. ప్రయాణముచేస్తున్నాను, నిద్రవచ్చింది, రైలులో నిద్రపోతున్నాను. రైలుగుంజాయింపులవల్ల అసందర్భమైన కలలుఅనేకముగా వస్తూఉన్నవి. మధ్యను ఎక్కడో ఒక స్టేషనుదగ్గిర హఠాత్తుగా తెలివివచ్చింది, లేచాను. వెలుతురూ చీకటీ కలిసిపోయిఉన్నవి—అదీ ఒక కలలాగే ఉన్నది. చిరపరిచితమైనవి ఒక్క నక్షత్రాలుమాత్రమే, మిగిలిన సమస్తమూ ఇంతకుముందు నేనెరగనిది, అస్పష్టముగా ఉన్నది. స్టేషనులో కొన్ని లాంతర్లు వెలుగుతున్నవి. మనపృథ్విలో

మనకు తెలియనిది ఎంతఉన్నదో చూడమని అవి దీపాలను ఎత్తి పట్టుకొని చూపిస్తున్నవి; నాలుగువైపులాఉన్న వాటికీ మనకూ ఎంతదూరమో చూడమని చూపిస్తున్నవి. అమ్మ నిద్రపోతున్నది. బండిలోనిదీపముమీద ఆకుపచ్చని తెర. ట్రంకులూ, పెట్టెలూ, బ్యాగులూ ఒకదానిమీదఒకటి అడ్డ-దిడ్డముగా పడిఉన్నవి—స్వప్నలోకములో కలగా పులగ-ముగా పడిఉన్న సామగ్రి అనిపిస్తున్నవి—ప్రదోషసమయాన మిణుకుమిణుకుమంటున్న పచ్చనికాంతిలో 'ఉన్నది' 'లేదు' అనే రెండుఅవస్థలకూ మధ్యను అల్లాడుతూ అతి చిత్రమైన వస్తువు లేవో అన్నట్టు కనబడుతున్నవి.

అటువంటప్పుడు ఆ అద్భుతమైనపృథ్వీమీద, ఆ అద్భు-తమైనరాత్రివేళ ఎవరో అంటున్నారు, "త్వరగా రావాలెను, ఈ బండిలో స్థలము ఉన్నది," అని.

నేను విన్నది పాటా అనిపించింది. బంగాలీయువతి కంఠములోనుంచి వస్తూఉన్న బంగాలీమాటలు ఎంతమధుర-ముగా ఉంటవో తెలుసుకోవలెనంటే అటువంటి అసమయాన, అటువంటి అస్థలములో అకస్మాత్తుగా అటువంటి మాటలు వినవలెను. ఆ కంఠానికి "స్త్రీకంఠము" అని పేరుపెట్టి, మనము పేరులుపెట్టి ఏర్పరచిన తరగతులలో ఒకదానిలో దానిని వేయకూడదు. అది కేవలము స్త్రీకంఠము కాదు—అది ఏ ఒక తరగతికీ చెందినకంఠము కాదు. ఆ కంఠము కంఠము;

ఆ కంఠము ఆకంఠమే. వినీవినడములో అటువంటికంఠము నేను ఎన్నడూ వినలేదు అని లోపునుంచి మనస్సు చెపుతుంది.

కంఠస్వరము మహాగొప్పవస్తువు అని నా నమ్మకము. రూపు అనేది విలువలేనిది అని కాదు నేను చెప్పేది, గాని కంఠ-స్వరము మనలో ఉండు అనిర్వచనీయమైన దానిని వ్యక్తపరిచే సాధనము, అంతరతమమైన దానిని వెల్లడిచేసే ఉపకరణము. అది మనలోపలఉన్న దాని ముఖవర్చస్సు. తొందరతొందరగా కిటికీతలుపు ఎత్తి ముఖము పైకి పెట్టాను, ఏమీ కనబడలేదు. గార్డు ప్లాట్ఫారమ్మీద చీకటిలో నిలబడి తన ఒంటికన్ను-లాంతరు ఆడించాడు, బండినడిచిపోయింది, నేను ఆ కిటికీదగ్గిర చతికిలపడిపోయినాను. నా కళ్ళఎదుట ఎవరూ లేరు, కాని హృదయరూపమొకటి నాహృదాయానికి మాత్రము కనబడు-తున్నది. అది ఆ తారామయమైన ఆకాశమువంటిది, మనను అన్నివైపులా చుట్టుకొనిఉంటుంది గాని పట్టుకోబోతే దొరకదు. ఆ కంఠస్వరము, ఆ అపరిచితకంఠస్వరము, రెప్పపాటులో చిర-పరిచితమైన ఆసనముమీదికి వచ్చి కూర్చున్నది. 'ఆహా, ఏమి అద్భుతమైన పరిపూర్ణత నీది! చంచలకాల క్షుబ్ధహృదయము-మీద పూసిన పువ్వువు నీవు, కాలతరంగాలు ఆ పూరేకులలో ఒక రేకునైనను కదపలేవు, అపూర్వకోమలత్వముగల ఆపువ్వు-మీద చిన్న డాగునైనా వేయలేవు!

ఇనప మృదంగము వాయిస్తూ రైలు పరుగెత్తుతున్నది. నాలోపునుండి వస్తూఉన్న పాట వింటూ నేనూ ప్రయాణము

చేస్తున్నాను: వినబడుతున్నది ఆ పాటపల్లవి ఒక్కటే——
"బండిలోస్థలమున్నది" "ఉన్నది స్థలమున్నది," ఇదే ఆ పల్లవి.
ఉన్నదీ? స్థలమున్నదీ? అయితే స్థలము దొరకడము లేదే! ఎవరికి
తెలిసిన వాళ్లూ ఎవ్వరూ లేరే! కాని ఆ తెలియకపోవడమనేది
ఉత్త కుహేలిక, మబ్బు, మాయ; అది ఛిన్నమయిపోగానే
సర్వమూ తెలుసుకోగలుగుతాము. అప్పుడు మన తెలుసుకో-
డానికి మరి అంతమంటూ ఉండదు. 'ఓ, సుధామయ కంఠమా,
అపురూపరూపము ధరించి నాహృదయమందున్న దానవు నీవు,
అనాదినుంచి నాకు తెలిసిన రూపముకాదు, ఆ నీ రూపము?
స్థలము ఉన్నది, ఉన్నది! త్వరత్వరగా రమ్మని పిలిచావు; త్వర-
గానే వచ్చాను; ఒక్కనిమిషమైనా ఆలస్యము కానివ్వలేదు.

రాత్రి బాగా నిద్రపట్టలేదు. ఎక్కడోతప్ప ప్రతిస్టేషను-
దగ్గిరా కిటికిలోనుంచి పైకి వంగి చూస్తున్నాను, నాకంటికి
కనబడని 'ఆమె' అర్ధరాత్రివేళ ఎక్కడైనా దిగిపోతుందేమో-
అని నాకు భయము వేసింది.

మర్నాడు ప్రొద్దున్నే ఒక పెద్దస్టేషనులో ఆ రైలు దిగి
వేరేరైలులో ఎక్కాలి. మావి ఫస్టుక్లాసుటిక్కెట్లు గనుక అక్కడ
జనసమ్మర్దము ఉండదు అని ఆశపడ్డాను. స్టేషను వచ్చింది, బండి
దిగాము. ప్లాట్‌ఫార్మ్‌మీద ఎవరో దొరగారి ఆర్‌డర్-
లీలు, దొరగారి సామానుతో బండికోసము కనిపెట్టుకొని
ఉన్నారు. ఏదో సేనానాయకుడు, పెద్దజనరల్, దేశాటనకయి

బయలు దేరాడు. రెండుమూడుమినిట్లలో బండివచ్చింది, ఫస్టు-క్లాసుఆశ వదలుకోవాలి అని బోధపడిపోయింది. ఏ బండిలో ఎక్కను అమ్మను తీసుకొని అని గొప్పచిక్కయిన ఆలోచనలో పడ్డాను. ప్రతిబండిలో నిండా మనుష్యులు. ప్రతి కిటికిలోనూ తలపెట్టి చూస్తూ ప్లాట్ ఫారమ్మీద నడుస్తున్నాను. ఒక సెకండుక్లాసుబండి దగ్గిరికి వచ్చాను, లోపునుంచి ఒక యువతిఎవరో మా అమ్మవైపుచూస్తూ, "మా గదిలోకి రావచ్చును, రండి, ఇక్కడ స్థల మున్నది", అని అన్నది.

నేను ఉలికిపడ్డాను. అద్భుతమైన ఆ మధురకంఠమే! అది ఆ పల్లవే పాడుతున్నది—"స్థల మున్నది, స్థల మున్నది." ఒక్కనిమిషము ఆలస్యముచేయకుండా అమ్మా, నేనూ ఆ బండిలో ఎక్కిపోయినాము. సామాను ఎక్కించడానికైనా వేళలేదు. నాలాంటి చేతకాని పెద్దమ్మ ఈ ప్రపంచములో మరి ఒకడు ఉండడు. బండి నడుస్తూఉంటే కూలీల నెత్తిమీదనుంచి ఆయువతే మా పరుపులూ పెట్టెలూ అందుకొన్నది. ఫొటో-గ్రాఫులుతీసే క్యామెరా నాది ప్లాట్ ఫార్మ్మీద ఉండిపో-యింది. అది నేను కనిపెట్టనేలేదు

తరువాత— తరువాత ఏమి వ్రాయడమో తెలియ-కుండా ఉన్నది. నా మనుస్సులోఉన్న అఖండానందము వర్ణించడము ఎక్కడ మొదలుపెట్టగలను? ఎక్కడ ముగించ-గలను? వాక్యానికివాక్యము అతికించుకొంటూ ఈ మూల కూర్చొవలెనని బుద్ధిపుట్టకుండా ఉన్నది.

ఇప్పటికి ఆ పాట కంటికి కనబడ్డది. ఆమె నిజముగా ఒక పాటే అనిపించింది. అమ్మముఖమువైపు తిరిగాను. చూచాను, అమ్మ రెప్ప వేయకుండా ఆమెవైపు చూస్తూఉన్నది. పిల్లవయస్సు పదహారు పది హేడేళ్లు ఉంటుంది, గాని యౌవనము తన-భారాన్ని ఆయువతిమనస్సునగాని దేహానగాని ఇంకా మోపి-నట్టు కనబడదు. ఆమెనడక మహా తేలిక, ముఖదీప్తి నిర్మలము, అపూర్వమైన శుచిత్వముగలది ఆమె సౌందర్యము, ఆమెలో ఎక్కడా, ఎటువంటి జడత్వమూ లేదు.

విస్తరించిచెప్పడము నాకు సాధ్యము కాని పని, అది నాకు తెలుసును. కాక, ఆమె ఏరంగుచీర కట్టుకొన్నది, ఏవిధముగా కట్టుకొన్నది, నేను సరీగా చెప్పలేను. కాని ఒకటిమాత్రము నిజము, ఆమె కట్టుకొన్న వాటిలోగాని, పెట్టుకొన్న వాటిలో-గాని ఆమెను వెనకపెట్టి బడాయికొట్టుకొంటూ మన కంట పడేది ఏదీ లేదు. ఆమె తనచుట్టూఉన్న అందరికంటె అధిక-మైనది, విలువైనది; నాగమల్లి మొక్కనుపూసిన తెల్లని మంజరి ఆమె, తిన్నని కాడకొనను వికసించి తానుపుట్టినచెట్టును అతి-క్రమించే లావణ్యముగలది ఆమె. ఆమెతో ఇద్దరుముగ్గురు చిన్నపిల్లలున్నారు. వాళ్లతో కలసి ఆమె ఆడుతున్న మాటలకు అంతములేదు, ఆమె జరుపుతున్న నవ్వులాటకు మితి లేదు. నేను చేతిలో పుస్తకమొకటి పట్టుకొని ధ్యానముమాత్రము వాళ్ల మీదనే నిలిపి కూర్చున్నాను. ఆమె ఆ చిన్నపిల్లలతో కలసి పిల్ల లాగునే ఆడుకొంటున్నది. నా చెవిని పడ్డంతవరకు నేను కనిపెట్టి

నని అది, కాని అందులో ఉండే విశేషము ఏమిటిఅంటే చిన్నపిల్ల-
లకూ పెద్దవాళ్ళకూ ఉండేభేదము ఏమాత్రమూ అందులో
కనబడ లేదు—చిన్నపిల్లలతో కలసి అతిఆనందముతో, సునా-
యాసముగా తానూ చిన్నపిల్లఅయిపోయింది. ఆమెవద్ద కొన్ని
బొమ్మలతో ఉన్న కథలపుస్తకా లున్నవి. ఆ కథలలో తాను
అనుకొన్న కథ ముందుగా చదివి వినిపించమని అందులో
ప్రతిపిల్లా ఆమెను పట్టుకువదలకుండా ఉన్నది. ఆ కథలన్నీ
వాళ్లు ఇంతకుముందు ఇరవైముప్పైసార్లైనా వినిఉంటారు,
సందేహము లేదు. ఆ పిల్లలు ఎందుకు అంత సరదాపడుతూ
ఉన్నారో, నాకుబోధపడ్డది— ఆమెసుధాకంఠములోనుంచి
వస్తూఉన్న, ప్రతిమాటా, మంత్రశక్తివలన అన్నట్టు, అమృత-
మవుతూఉన్నది. ఆమెమనస్సూ, దేహమూ ప్రాణముతో
నిండిఉన్నది. ఆమెఆడే ప్రతిమాటలో, చేసే ప్రతిపనిలో, ఆ
ప్రాణము వికాసముపొందుతున్నది. అందు చేత ఆమెనోటివెంట
కథ విన్నప్పుడు ఆ పిల్లలు కథను వినరు, ఆమెనే వింటారు;
ప్రాణధారవచ్చి వాళ్లహృదయముమీద పడుతుంది. నిండు-
తేజస్సుతో వికసిస్తూ ఉన్న ఆమె ప్రాణము ఆనాడు నాలోక-
ములో పడుతున్న సూర్యకిరణాలను సచేతనముగా చేసినవి.
ఆ తరుణి ప్రాణానికి క్లాంతిలేదు, మ్లానము లేదు. దానిలో
విశ్వవ్యాపియైన విస్తారత ఒకటి ఉండెను. ఆ విస్తారతే నాప్రపం-
చము, నామీద వ్యాపించిఉన్నది ఆప్రకృతియొక్క ఆకాశమే.
స్టేషనులో బండి ఆగడముతోనే మిఠాయివాడిని పిలిచి

ఒకరానెడు వేయించిన శనగపప్పు కొన్నది. ఆ పిల్లలతో కలిసి నవ్వుతూ, ఆడుతూ, ఆ చిన్నపిల్లలో తాను ఒకచిన్నపిల్ల అయి ఎటువంటిసంకోచమూ లేకుండా ఆ శనగపప్పు తినడము ప్రారంభించింది. నా స్వభావముచుట్టూ ఇనపతీగలతో కట్టిన ఆవరణ ఉన్నది—ఆహా, నేను కూడా అతి సహజముగా నవ్వుతూ ఆపిల్లలను ఒక పిడికెడు పప్పు ఇవ్వమని అడిగి, వాళ్లతోకలిసి తినలేకపోయినా నేమి! చెయ్యి చాచి నాకూ కోరిక ఉన్నదని తెలియచేయలేకపోయినా నేమి?

ఇదంతా బాగున్నదో బాగులేదో తెలియక మా అమ్మ ఈ రెండుభావాలమధ్యా ,అల్లాడుతూ రెండుమనస్సులుగలది అయిపోయింది. మొగవాడను నేను ఆ బండిలో ఉన్నా ఆమెలో ఏమీ సంకోచము కనబడలేదు, ముఖ్యముగా తిండిపోతులాగు ఆలాగు తినడము ఏమీ బాగులేదు. అయినా అది కేవలము సిగ్గుమాలినతనము అని మాత్రము అమ్మకు తట్ట-లేదు. ఆ పిల్లకు పళ్లువచ్చినవి గాని బుద్ధిచెప్పేవారెవరూ లేరు అని అనుకొన్నది. మా అమ్మ ఎవరితోనైనా పరిచయములేనిదే హఠాత్తుగా మాటలాడేయలేదు, కొంచెము దూరముగా ఉండడమే ఆమెస్వభావము, అదే ఆమె అభ్యాసము. ఆ యువతితో స్నేహముచేదామని అమ్మకు కోరికపుట్టింది గాని తన స్వభావములోఉన్న ఈ అడ్డును అతిక్రమించేశక్తి ఆమెలో లేకపోయింది.

ఇంతలో బండి ఒక పెద్ద స్టేషనుకు వచ్చి నిలబడ్డది. ఆ జనరల్-దొరగారి అనుచరబృందము ఒకటి ఈ స్టేషన్‌లో ఎక్కవలసిఉన్నది. ఏబండిలోనూ జాగా లేదు. వాళ్లు ఇటుతిరిగీ అటుతిరిగీ మాబండిదగ్గిరికి వస్తున్నారు. అమ్మ భయమువల్ల కర్రకట్టిపోతున్నది, నేనూ కొంచెము గడబిడపడుతున్నాను.

బండి ఇక రెండునిమిషాలలో బయలుదేరుతుందిఅనగా స్టేషన్ ఉద్యోగస్థుడు హిందువుడుఒకడు పేరువ్రాసిన కార్డులు-రెండు తీసుకువచ్చి బెంచీలతలదగ్గిర తగిలించాడు, "ఈ రెండు బెంచీలు ఇద్దరుదొరలకోసము మొట్టమొదటనుంచీ రిజర్వ్-అయిపోయినవి, మీరు వేరేబండి చూసుకోవలసిఉంటుంది," అని అన్నాడు. నేను గడబిడపడుతూ లేచి నిలుచున్నాను. ఆమె అతనితో హిందీభాషలో, "మేము ఇందులోనుంచి వెళ్లము," అన్నది.

స్టేషనువాడు వదలలేదు, మరీ జోరుగా అన్నాడు— "మీరు ఇది ఖాళీ చేయక వీలులేదు."

కాని కదిలేజాడ ఆ యువతిలో ఏమీ కానక స్టేషను-వాడు బండి దిగి స్టేషన్‌మాస్టర్‌ను తీసుకువచ్చాడు. ఆయన ఒక దొర. ఆయన వచ్చి నాతో ప్రారంభించాడు—"నాకు చెప్పడానికి చాలా కష్టముగా ఉన్నది, గాని—"

వినగానే నేను, "కూలీ" "కూలీ," అని కేకవేశాను. అది వినగానే ఆ యువతి రెండుకళ్లలోనుంచి అగ్నివర్షము

కురిపిస్తూ నావైపు చూచి అన్నది, "వద్దు, మీరు వెళ్లడానికి వీలులేదు, కూర్చున్నచోటనుండి కదలకండి."

ఈలా అంటూ లేచి ద్వారముదగ్గిర నిలుచొని ఇంగ్లీషులో ఆ దొరగారితో అన్నది, "ఈ బండి మొట్టమొదటినుండీ రిజర్వుచేశారు అన్నది ఉత్త అబద్ధము," ఆలా అంటూ ఆ పేర్లువ్రాసిన కార్డులు రెండూ తీసి ప్లాట్ ఫార్ మ్మీదికి విసిరేసింది.

ఇంతలో యూనిఫార్ మ్ వేసుకొని దొరా, అతని ఆర్డర్ లీ బండిఎదుట తయారు. బండిలో సామాను ఎక్కించమని ఆ దొర ఆర్ డర్ లీకి సంజ్ఞచేశాడు, అటుతరువాత ఆ యువతి ముఖమువైపు చూచాడు. ఆమెమాటలు విన్నాడు, ధోరణి చూచాడు. స్టేషన్ మాస్టరుమీద చెయ్యివేసి ఏదో సంజ్ఞచేసి పక్కకు తీసుకొనివెళ్లాడు. రహస్యముగా వాళ్లిద్దరూ ఏమిటి మాట్లాడుకొన్నారో మనకు తెలియదు. కాని రైలువిడిచే వేళ ఇప్పటికిఅప్పుడే దాటిపోయినా వేరేబండిఒకటి కొత్తగా ఆ ట్రైనుకు అతికించి అప్పుడు వదిలారు. ఆ యువతి ఆ పిల్లలతో కలిసి తిరిగీ శనగపప్పు తినడము ప్రారంభించింది. నేను సిగ్గుచేత మొఖము కిటికీలోనుంచి బయటికి పెట్టి, సృష్టియొక్క శోభను చూస్తూ కూర్చున్నాను.

బండి కాన్ పూర్ వచ్చి నిలబడ్డది. మూటాముల్లే కట్టి సిద్ధముగా ఉన్నది ఆ యువతి. స్టేషన్ దగ్గిర హిందూస్తానీ నౌకరు ఒకడు వచ్చి వాళ్లనందరినీ దింపుతున్నాడు.

అమ్మ మరి ఉండలేక, "నీ పేరు ఏమి టమ్మా?" అని అడిగింది.

"నా పేరు కల్యాణి."

వినగానే నేనూ అమ్మా కూడా ఉలికిపడ్డాము.

"మీ నాన్న గారు—"

"ఆయన ఒక డాక్టరు. ఇక్కడనే ఆయన ఉండేది. ఆయన పేరు శంభునాథ్ సేన్."

తరువాత వాళ్లంతా దిగిపోయినారు.

## ఉపసంహారము

మా మామ నిషేధము లక్ష్యపెట్టకుండా, మాతృఆజ్ఞ ఉల్లంఘించి, నేను తరువాత కాన్‌పూర్ వచ్చాను. కల్యాణిని చూచాను, చేతులు జోడించాను, తలవంచి అడుక్కున్నాను— శంభునాథ్ బాబు హృదయము కరిగేటట్టు చేశాను. కాని కల్యాణి "నేను పెళ్లి చేసుకోను," అన్నది.

"ఎందుచేత?" అని నేను అడిగాను.

"మాతృ ఆజ్ఞ" అన్నది.

ఇదేమి ఖర్మము, ఆమెకుకూడా మామ ఎవడైనా ఉన్నాడా ఏమిటి చెప్పుమా!

ఆమెకు అడ్డువస్తూఉన్నది మాతృభూమి అని విన్నాను తరువాత. పెళ్ళి తప్పిపోయినప్పటినుండి కల్యాణి ఆడపిల్లలకు చదువు చెప్పే దీక్ష పట్టుకొని కూర్చున్నదని విన్నాను.

కాని నేనుమాత్రము ఆశ వదులుకోలేదు. ఆ కంఠ-స్వరమూ, ఆ పాటా ఇప్పటికీ నా హృదయములో వినబడు-తున్నది. అది ఎదో దూరాన, అవతలిఒడ్డునుంచి వినబడుతూ-ఉన్న వేణుగానమా అనిపిస్తూఉన్నది, నా ప్రపంచముఅవతల-నుంచి వచ్చిన పాట అది. సమస్త ప్రపంచమును వెనకనుఉంచి ఆపైనుంచి వచ్చిన పిలుపు అది. రాత్రి ఆ అంధకారముమధ్య-నుండి వచ్చి చెవిని పడ్డవి ఆ మాటలు—"స్థల మున్నది," "స్థల మున్నది." ఆ మాటలు ఒక పల్లవిఅయి శాశ్వతకాల-మూ నాకు వినబడుతుంటవి. అప్పుడు నాకు ఇరవైమూడేళ్లు. ఇప్పుడు నాకు ఇరవైఏడు. ఇప్పటికీ నేను నాఆశ వదులుకోలేదు గాని మామను వదులుకొన్నాను. 'మా వాడు చంటిపిల్లవాడు' అన్నట్టుగా అమ్మమాత్రము నన్ను వదలలేకుండా ఉన్నది.

నేను ఇంకా పెళ్లికోసము ఆశిస్తున్నానని మీరంతా అనుకొంటున్నారు. ఆశించలేదు, ఎంతమాత్రము లేదు; పెళ్లి ఆశ లేనేలేదు. అర్ధరాత్రి వేళవిన్న ఆమధురకంఠస్వరముకోసము మాత్రమే నేను ఆశించే ఆశఅంతా, ఒక్కమారు నాకు లభించిన ఆ పాట, ఆ అపరిచితగానను—"స్థల మున్నది, స్థలమున్నది." ఉన్నది, సందేహ మేమిటి? లేకపోతే ఏలాగు నిలబడగలను? ఎక్కడ నిలబడగలను? అందుచేత సంవత్సరము తరువాత సంవత్సరము నడుస్తూఉన్నా నేను ఇక్కడనే ఉండిపోయి-నాను. ఆమె కనబడుతూఉంటుంది, ఆమెకంఠము వినబడుతూ-ఉంటుంది, వీలు చిక్కినప్పుడల్లా ఈపనీ ఆపనీ ఆమెను చేసి

పెడుతూఉంటాను. "ఇదిగో, స్థలము దొరికింది," అని నా మనస్సు అంటూఉంటుంది. ఓ అపరిచితా, నీ పరిచయము పూర్తి కాలేదు; పూర్తి కాదు; ఎంత అద్భుతమైనది నీ పరిచయము! కాని నా భాగ్యము బాగున్నది, నాకు స్థలము దొరికింది!"

౧౯౧౪

# మాస్టరు గారు

## భూమిక

సుమారు రెండుఘంటలరాత్రి. కలకత్తా ఒక నిశ్శబ్దశబ్ద సముద్రమయిఉన్నది. ఆ సముద్రములో ఒక పెద్ద అలను పుట్టిస్తూ పెద్దజోడుగుర్రాలబండిఒకటి భవానీపూరువైపునుంచి ధరమ్‌తల్లా మూలకు వచ్చి నిలబడ్డది. అక్కడ ఒక అద్దె బండి కనబడితే, జోడుగుర్రాలబండిలోనిబాబు ఆ బండిని పిలిచాడు. బండిలో అతనిపక్కను సీమనుంచి తిరిగివచ్చిన బంగాలీయువకుడు ఒకడుఉన్నాడు—ముందుబెంచీమీదికి కాళ్లుచాచుకొని బ్రాందీమత్తువల్ల ఒకమూలకు వాలి పడుకొని ఉన్నాడు. ఇతను ఆ ముందురోజునే సీమనుంచి తిరిగివచ్చాడు. ఇతనిస్వాగతము సంబంధములో జరిగినవిందు ఇప్పుడే పూర్తిఅయినది. అతనిని కొంతదూరమువరకు దిగబెట్టి పోదామని ఈ స్నేహితుడు తన బండిలో అతనిని తీసుకువస్తున్నాడు. స్నేహితుడు అతనిని రెండుమూడుమార్లు కదిపి లేపి, "మజుమ్‌దార్, బండి దొరికింది, ఇంటికి వెళ్లు," అని అన్నాడు.

మజుమ్‌దార్ ఉలికిపడి లేచి ఇంగ్లీషున ఏమిటో గొణుగుకొంటూ తిట్టుకొంటూ అద్దె బండి ఎక్కాడు. ఆ కోచ్‌మానుకు

అతనిని తీసుకువెళ్లవలసిన ఇంటివివరము బోధపరిచి స్నేహితుడు తిరిగీ ఆ బ్రూహామ్ ఎక్కి తనఇంటికి వెళిపోయినాడు.

బండి వెళ్లివెళ్లి పార్కు స్ట్రీటుదగ్గిర ముఖము తిప్పి ఎదుటనున్న మైదానమువైపు తిరిగింది. మజుమ్‌దార్ ఇంగ్లీషున మరిఒకతిట్టు తిట్టి తనలోతాను అనుకొన్నాడు— "ఇదేమిటి, ఇది కాదే దారి!" నిద్రమత్తుమీద, "ఇది బహుశా దగ్గిరదారి అయిఉంటుంది" అంటూ తిరిగీ నిద్రపోయినాడు.

మైదానముదగ్గిరికి రాగానే మజుమ్‌దార్ ఒళ్లు పులకరించింది, పక్కను ఎవరూ లేరు గాని ఖాళీజాగామాత్రము నిండిఉన్నది; అనిపించింది. పక్కనుండే ఖాళీ ఒక ఘనిష్ఠ పదార్థమయి తనను తోస్తున్నట్టు అనిపించింది. "ఏమిటి కథ, ఇ దేమీ బాగు లేదే! బండి ఇటువంటివ్యవహారము ఆరంభించిందేమిటి?" అనుకొంటూ, "ఏయ్, *గడ్‌వాన్, గడ్‌వాన్," అని కేకవేశాడు. గడువాన్ దగ్గిరనుంచి జబాబు లేదు. వెనకనున్న కటకటాలు తెరిచి †సైస్ చెయ్యి పట్టుకొని, ‡"తుమ్ భితర్ ఆకే బైఠో!" అని అన్నాడు. సైస్ భయపడుతూ అన్నాడు,

---

* కోచ్‌మాన్, గుర్రపుబండి తోలేవాడు.

† గుర్రపువాడు.

‡ "నువ్వు లోపుకు వచ్చి కూర్చో." ఇవి హిందుస్తానీ మాటలు. కలకత్తాలో బండివాళ్లు చాలాభాగము సాయిబులు, మిగతావాళ్లలో చాలామంది హిందుస్తాని మాతృభాషగా గలవాళ్లు. అందుచేత అందరూ తరుచుగా బండివాళ్లతో హిందుస్తానిలో మాట్లాడుతారు.

*"నయ్ సాబ్ భితర్ నయ్ జాయెగా." ఇది వినగానే మజుమ్‌దార్ ఒళ్లు మళ్ళీ పులకరించింది. సైన్ చెయ్యి మరింతగట్టిగా పట్టుకొని, "†జల్దీ భితర్ అవ్!" అన్నాడు.

సైన్ చెయ్యినులిపి లాగుకొని బండిమీదనుంచి ఒక్కగంతువేసి పరుగెత్తి పారిపోయినాడు. భయపడుతూభయపడుతూ మజుమ్‌దార్ పక్కకు తిరిగి చూచాడు. పక్కను ఏమీకనబడలేదు. అయినాపక్కనున్న అచలపదార్థముమాత్రము పట్టువదలకుండాఉన్నది. ఏలాగో కష్టపడి నోటివెంట మాట తెచ్చుకొని "‡గడ్‌వాన్, గాడీ రఖో!" అన్నాడు. గడ్‌వాన్ నిలబడి రెండుచేతులతో కళ్లెము గట్టిగా లాగి గుర్రాలను ఆపవలెనని ప్రయత్నముచేశాడు, గాని ఎంతప్రయత్నించినా ఆగకుండా ఉన్నవి అనిపించింది, మజుమ్‌దార్‌కి. గుర్రాలు ఆగకుండా రెడ్‌రోడ్ మీదనుంచి పరుగెత్తి మళ్లా దక్షిణమువైపు తిరిగినవి. మజుమ్‌దార్ చికాకుపడుతూ $"అరే కహాఁ జాతా?" అన్నాడు. జబాబు వినబడలేదు. పక్కనున్న ఖాలీవైపు ఉండుండి భయపడుతూ చూస్తున్నాడు, ఒళ్లు చమటపట్టిపోతున్నది. ఏలాగో కష్టపడి కదలకుండాఉండి మరింత ముడుచుకొని కూర్చున్నాడు. కాని అతను కొంచెము ఖాలీచేసేసరికి ఆ జాగా

---

* లేదు బాబూ, నేను లోపుకు రాను.

† త్వరగాలోపుకి రా!

‡ కోచమాన్, బండి ఆపు!

$ అరే, ఎక్కడికి పోతున్నావు?

నిండిపోయేది. "ఐరోపాదేశములో పూర్వము ఒక విద్వాంసుడు అన్నాడు, Nature abhors vacuum అని; ఆలాగే అవుతున్నది ఇప్పుడు నాదగ్గిర. కాని ఇ దేమిటి! ఇది ఎటువంటి nature? ఇది నాతో మాట్లాడకుండాఉంటే చాలును, జాగా అంతా దానికే విడిచిపెట్టి పైకి గెంతేస్తాను అనుకొంటున్నాడు మజుమ్దార్. కాని తాను అనుకోని దేమయినా జరగవచ్చునేమో అనే భయమువల్ల గంతి పారిపోడానికితగిన సాహసము చిక్కలేదు. *"పహరావాలా," అని కేక వేయడానికి ప్రయత్నముచేశాడు——కాని అతికష్టముమీద వినబడీవినబడని మాట గొంతుకలోనుంచి పైకి వచ్చింది, వినగానే అంతభయములోనూ అతనికే నవ్వువచ్చింది. అంధకారములో నిస్తబ్ధపార్లమెంటుసభ జరుపుతూఉన్న భూతాలవలె మైదానములో చెట్లు ఒకదానివైపు ఒకటి చూస్తూ నిలుచున్నవి. మాకు అంతా తెలుసునుగాని మేము ఏమీ చెప్పము అంటూ చికిలిస్తూఉన్న కళ్లలాగు స్తంభాలమీద గ్యాసులైట్లు మిణుకుమిణుకుమంటున్నవి. ముందు సీటుమీదికి చప్పున వెళ్లి కూర్చుందునా అని అనుకొన్నాడు మజుమ్దార్. ఇంకా అనుకొన్నాడో లేదో, ఆ ముందు సీటుమీదనుంచి ఏదో ఇతనివైపు చూస్తూఉన్నట్టుగా అనిపించింది——కళ్లులేవు, ఒళ్లులేదు, మరేదిలేదు ఒక్కచూపుమాత్రమే! ఆ చూపు ఎవరిదో తెలుసును గాని ఎంతప్రయత్నముచేసినా జ్ఞాపకము రాకుండాఉన్నది. బలవంతాన కళ్లు-

---

* కనిస్టేబు.

మూసుకొందామని మజుమ్దార్ ప్రయత్నము చేశాడు, గాని భయమువల్ల ఆ అర్థముకాని చూపువైపు బాగా కళ్లు విప్పి చూస్తూఉండవలసివచ్చింది, ఒక్కమారైనా కళ్లు మూయలేక-పోయినాడు.

బండి రోడ్డుమీద ఉత్తరపువైపునుంచి దక్షిణమూ దక్షిణమువైపునుంచి ఉత్తరమూ పరుగెత్తుతున్నది. గుర్రాలు అంతకంతకు మత్తెక్కినవై మరింతవడిగా పరుగెత్తుతున్నవి. బండికటకటాలు ఖడ్ఖడ్మని కొట్టుకొంటూ గొప్పశబ్దము చేస్తున్నవి. ఆలాంటప్పుడు బండి దేనికో తగిలి ధబ్మని నిలబడి పోయింది. మజుమ్దార్ ఉలికిపడి చూచేసరికి బండి వాళ్లవీథిలోనే ఉన్నది, గడ్వాన్ అతనిని లేపి, ఎక్కడికి తీసుకువెళ్లమంటాడు బాబూ, అని అడుగుతున్నాడు

మజుమ్దారుకి కోపము వచ్చి అన్నాడు, "ఇంతసేపూ నన్ను మైదానములో ఈలాగు తిప్పుతున్నా వెందుకు?"

"ఏదీ, మైదానములో తిప్పలేదే!" అని గడ్వాన్ అన్నాడు.

మజుమ్దార్ నమ్మలేదు, "అయితే ఇదంతా కలా?" అని అడిగాడు.

గడ్వాన్ ఆలోచిస్తూ కొంచెము నిలుచొని, భయప-డుతూ అన్నాడు, "కేవలము కల కాదనుకుంటాను బాబూ,

మూడుసంవత్సరాలకిందట ఈ బండిలోనే ఒక సంగతి జరిగింది బాబూ!"

అప్పటికి మజుమ్‌దార్ నిద్రా నిషా పూర్తిగా పోవడము-చేత గడ్‌వాన్‌కథ వినుపించుకోకుండా బండి దిగి అద్దె ఇచ్చేసి ఇంట్లోకి వెళిపోయినాడు.

౧

అధర్ మజుమ్‌దార్ తండ్రి స్టీమరు ఏజంటుగుమాస్తాపని-నుండి క్రమక్రమముగా పెద్దస్టీమరుకంపెని ఏజంటుఉద్యోగ-ములోకి వచ్చాడు. తండ్రిఆర్జించిన డబ్బుమీద చాలా వడ్డీ వచ్చేది అధర్ బాబుకు, తాను పనిచేయడము అవసరము లేక-పోయింది. అతనితండ్రి తెల్లతలపాగాపెట్టుకొని అద్దెబండిలో రోజూ ఆఫీసుకు వెళుతూఉండేవాడు. క్రియాకర్మలకై తేనేమి దానధర్మాలకై తేనేమి ఆయనకు ఎటువంటిలోటూ ఉండేది కాదు. లేనివాళ్లూ, ఆపదలోఉన్న వాళ్లూ—అన్నిరకాలవాళ్లూ అనేకమంది అతనిదగ్గిరికి సహాయముచేయమని వచ్చేవారు; ఆమాట తలచుకొంటూ ఎంతో సంతోషిస్తూఉండేవాడు, గర్వపడుతూఉండేవాడు.

అధర్ బాబు పెద్ద భవంతి కట్టించాడు. జోడుగుర్రాలబండి ఒకటి పెట్టాడు,గాని అతనికి లోకులతో ఎటువంటిసంపర్కమూ లేదు. వడ్డీవ్యాపారముతో సంబంధించిన బ్రోకర్లు అతని

వద్దకు వచ్చి కూర్చొని హుక్కాతాగి మాటలాడి వెళ్లి-పోతూఉండేవారు. ఎటార్నీఆఫీసునుండి గుమాస్తాలు వచ్చి పత్రాలగురించీ, షరతులగురించీ మాట్లాడి వెళిపోతూఉండే-వారు. అతను చాలా చిక్కనివాడు—ఆ ఊళ్లో ఒకఫుట్ బాల్ క్లబ్ ఉన్నది. ఆ క్లబ్ కుర్రవాళ్లు నెత్తురుకోత వాళ్లు, ఎంతకీ-వదలవలసినవాళ్లు కారు; వాళ్లుకూడా ఆఖరికి ఒక్కదమ్మిడీ-అయినా ఈయనదగ్గిరనుండి లాగలేకపోయినారు.

ఆలాంటి సందర్భములో ఆ ఇంట్లోకి అతిథిఒకడు వచ్చి-కూర్చున్నాడు. 'పిల్లలులేరు పిల్లలులేరు,'అనుకొంటూఉండగా చాలా సంవత్సరాలైన తరువాత కొడుకుఒకడు పుట్టాడు అధర్ బాబుకు. పిల్లవాడిది సరీగా తల్లిరూపు పెద్దపెద్దకళ్లు, సూదిముక్కు, నాగమల్లిమొగ్గచాయ; చూచినవాళ్లందరూ "ఆహా, పిల్లవాడు కాడమ్మా, సాక్షాత్తు సుబ్రహ్మణ్యమూర్తే!" అనేవారు. అధర్ బాబుఅనుచరుడు ఒకడుఉండేవాడు 'రతి-కాంతు'డని. అధర్ బాబంటే మహాభక్తి ఇతనికి—ఆ రతికాంతుడు, "గొప్పఇంటి పిల్లవాడుఉండవలసిన మోస్తరుగా ఉన్నాడు పిల్లవాడు," అని అన్నాడు.

పిల్లవాడికి వేణుగోపాల్ అని పేరుపెట్టారు. అధర్ బాబు భార్య 'ననిబాల' ఇంతకుముందు ఎన్నడూ భర్త అంగీకారము లేనిదే తనఇష్టప్రకారము ఇంటిఖర్చులు చేయలేదు. అతనికి ఉండే ఒకటిరెండు సరదాలగురించీ, ఇంట్లో జరపవలసిన

మర్యాదలనుగురించీ, లాంఛనాలనుగురించీ అప్పుడప్పుడు మొగుడుకీ పెళ్లానికీ మాటలు జరుగుతుండడమే గాని చివరకు మాత్రము మొగుడిలోభము చూచి ఎంత అసహ్యపడుతూ ఉన్నా పెళ్లాము మొగుడు చెప్పినట్టుగానే చేసేది.

ఇప్పుడు ననిబాలను అధర్ బాబు మరి నొక్కిపెట్టి ఉంచలేకపోయినాడు; — వేణుగోపాల్ తో సంబంధించిన విషయాలలోమాత్రము అతని చిక్కనితనము చాలలేక-పోయింది. జమా ఖర్చులూ, అన్నీ ఒకటితరువాతఒకటి వెనక పడ్డవి. పిల్లవాడికాళ్లకు గజ్జలు, చేతులకు గొలుసులు, తలకు టోపీ, తొడగడానికి నానారకాల స్వదేశీబట్టలు, నానారంగుల విదేశబట్టలు — ఇటువంటివి లెక్కలేనన్ని కొనేది ననిబాల. వాటికికావలసిన డబ్బు భర్తదగ్గిర సంపాదించేది; ఒకప్పుడు కన్నీటిధారలద్వారా ఆ పని సాధించేది, మరిఒకప్పుడు మాటలవర్షమువల్ల సాధించేది, అవసరమున్న వస్తువు గాని, అవసరములేని వస్తువు గాని వేణుగోపాల్ కోసము కావాలె-నంటే వచ్చితీరాలి. ఇనపపెట్టె ఖాలీ అని గాని, రేపు ఇస్తానని-గాని, అబద్ధాలతో మరిపించుదామంటే మరి వీలులేకపోయేది.

౨

వేణుగోపాల్ పెద్దవాడవుతున్నాడు. వేణుకోసము ఖర్చుపెట్టడము అధర్ లాలుకు మెల్లిమెల్లిగా అలవాటయి-

పోయింది. పిల్లవాడికోసము పెద్దపెద్ద పరీక్షలుప్యాసైన ఒక ముసలి మాస్టరును చాలా జీతము ఇచ్చి ఉంచాడు అధర్ లాల్. ఈమాస్టరు వేణుగోపాల్ ని మంచిమాటలవల్లా, శిష్టాచారాలవల్లా లొంగదీదామని చాలా ప్రయత్నముచేశాడు. కాని కఠినమైన శిక్షద్వారానే యావజ్జీవమూ తనమాస్టరీమర్యాదను నిలుపుకొనివస్తూఉన్నవాడు ఆయన,అందుచేత ఆ తీపమాటలు అపస్వరముగా వినబడేవి, ఆ శుష్కసాధనమువల్ల పిల్లవాడు మోసపోలేదు. ననిబాల భర్తతో ఒకనాడు అన్నది, "ఏమిటి ఆ మాస్టరు!—చూసేసరికి అబ్బాయి హడిలిపోతూఉంటే, అతనిని మానిపించేయకూడదూ ఇకను!"

ముసలిమాస్టరుగారికి సెలవు ఇచ్చేశారు. పూర్వము స్త్రీలకు స్వయంవరము ఉండేది, అలాగే ననిబాలకొడుక్కి ఇప్పుడు స్వయంమేస్టరీ! పిల్లవాడువరించనంతసేపు మాస్టరుకు ఎన్నిసర్టిఫికెట్లు ఉన్నా, ఎన్నిపాసులు ఉన్నా, అన్నీ వృథా!

ఇక్కడికథ ఈలాగు ఉంటూఉండగా మురికి కండువా వేసుకొని, చింకి క్యాన్వీసుజోళ్లతో హరలాల్ అనేపేరుగల యువకుడొకడు మాస్టరుఉద్యోగానికని వచ్చాడు. అతనికి తండ్రి లేడు; తల్లి వంటపుట్టిపనిచేస్తూ కూలికి ధాన్యము దంచుతూ, వాళ్లఉళ్లోఉన్న హైస్కూలులో కొడుకును మెట్రిక్యులేషన వరకు చదివించింది; హరలాల్ మెట్రిక్యులేషన ప్యాసుఅయినాడు. ఇప్పుడు కాలేజీలో చదువుతానని ప్రతిజ్ఞ

పట్టి బయలుదేరి కలకత్తా వచ్చాడు. తిండిలేకపోవడమువల్ల అతనిముఖములో కిందిభాగము ఎండిపోయి ఇండియా మ్యాపులో కన్యాకుమారి అగ్రములాగు కనబడుతున్నది, కపాలముమాత్రము హిమాలయపర్వతములాగు పెద్దదిగా ఉండి—చూచేవాళ్ళకంటికి మొట్టమొదట కనబడుతుంటుంది. ఇసకతోనిండిన ఎడారిలో ఎండవల్లపుట్టిన తళుకువలె లేమిని తెలియజేసే అస్వాభావికమైన తళుకు అతనికళ్లలో కనబడు-తున్నది.

"ఏమిటి కావాలి నీకు? ఎవరికోసము వచ్చావు?" అని దర్వాన్ అడిగాడు.

"ఇంటి యజమానుని దర్శనముచేదామని వచ్చాను," అన్నాడు హారలాల్

"దర్శనము దొరకదు," అన్నాడు దర్వాన్.

ఏమిటిచేయడము అని హారలాల్ ముందూవెనకా అవుతూఉన్నాడు, అటువంటప్పుడు మన ఏడుసంవత్సరాల అబ్బాయి వేణుగోపాల్ అప్పుడే తోటలో ఆట ముగించి దేవిడీదగ్గిరికి వచ్చాడు. హారలాల్ అక్కడ ఇంకా అనుమా-నిస్తూ, నిలుచోవడను చూచి దర్వాన్, "వెళ్లమంటే వెళ్ల వేమిరా!" అని తిరిగీ అన్నాడు.

చూడగానే వేణుకు తిక్కపుట్టి, "వద్దు, వెళ్లవద్దు" అన్నాడు; అంటూ హారలాల్ చెయ్యి పట్టుకొని మేడమీద వరండాలోకి తనతండ్రి దగ్గిరికి తీసుకువెళ్లి నిలబెట్టాడు.

అధర్ బాబు మధ్యాహ్నము నిద్రనుంచి అప్పుడే లేచాడు, ఇంకా బద్ధకము వదలలేదు, కాళ్లు ఆడించుకొంటూ పేముకుర్చీమీద కూర్చున్నాడు. వృద్ధ రతిలాల్ బల్లమంచముమీద మఠము వేసుకొని కూర్చొని గుడుగుడు పీలుస్తున్నాడు. ఆనాడు ఆవేళప్పుడు, అటువంటి అవస్థలో ఉంటూఉండగా హారలాల్ మాస్టరుగా నిర్ణయించబడ్డాడు.

"ఎంతవరకు చదివారు మీరు?" అని అడిగాడు రతికాంత. ముఖము కొంచెము దించుకొని," మెట్రిక్యులేషన్ ప్యాసుఅయినాను అన్నాడు హారలాల్.

రతికాంత కనుబొమ్మలు ఎత్తి, ఆశ్చర్యపడుతూ, "మెట్రిక్యులేషనే? కాలేజీచదువు చదివారు అనుకొన్నాను, వయస్సు ఏమీ తక్కువ కాదే!" అన్నాడు. హారలాల్ ఏమీ మాటాడలేదు. అధర్ బాబుని ఆశ్రయించుకొని ఉన్నవారికీ, ఆశ్రయముకోరుతూ వచ్చినవారికీ బాధగలిగే మాటలాడుతూ ఉండడమంటే రతికాంతకు చాలా సరదా.

రతికాంత వేణుని ముద్దుగా ఒళ్లోకి లాక్కోడానికి ప్రయత్నము చేస్తూ అన్నాడు, "ఎంతోమంది బి. ఏ.లూ, ఎం.

వే.లూ వచ్చారు వెళ్లారు, ఎవరూ నచ్చలేదు మా వరహాల-
బాబుకి, ఆఖరుకు ఈ మెట్రిక్యులేషనుపాసుఅయిన మాస్టరు
దగ్గిర చదువుకుంటా డేమిటి?"

వేణు, "ఛా!" అంటూ, రతికాంతముద్దు ఒకపక్కకు-
తోసేసి తప్పించుకొని పారిపోయినాడు. రతికాంతను చూస్తే
వేణుకు పరమఅసహ్యము, కాని ఆ అసహ్యము చూచి
మరింత సంతోషించాలని ప్రయత్నించేవాడు రతి. అదే పిల్లల-
లోఉండే మాధుర్యము అని అంటూఉండేవాడు, పిల్లవాడిని
"చందమామ" అంటూఉండేవాడు, 'వజ్రాల బాబు' 'వరహాల-
బాబు' అనేవాడు; అంటే పిల్లవాడికి మరీ కోపమువచ్చేది,
మండిపడిపోయేవాడు.

ప్రయత్న మేమీ సఫల మయేటట్టుగా లేదు, అను-
కొన్నాడు, హారలాల్ ఆ ఇంట్లోనుంచి వెళిపోయి ఏలాగైనా
బయట పడితే చాలును అనిపించింది అతనికి. అప్పుడు
హాఠాత్తుగా అధర్ బాబుకు తట్టింది, ఇతను చాలా తక్కువ
జీతానికి దొరుకుతాడు అని. ఇంట్లోనే బసఇచ్చి, భోజనము-
పెట్టి, అయిదురూపాయిలు ఇవ్వడానికి ఒప్పుకొన్నాడు
అధర్ బాబు. అతనిని ఇంట్లోనే ఉంచుకోవడమువల్ల ఖర్చు
ఖాంచెము కావచ్చును, కాని దానికి తగినట్టు పని రాబట్టుకుంటే
తీరిపోతుంది అనుకొన్నాడు.

3

ఈమాటు మాస్టరు స్థిరపడ్డాడు. మొట్టమొదటినుంచీ వేణుకీ హారలాల్‌కీ ఎంతబాగా పొత్తుకలిసిపోయిందంటే ఇద్దరూ అన్నదమ్ములా అనిపించింది అందరికీ. కలకత్తాలో హారలాల్‌కి బంధువులెవరూ లేరు. ఈ చక్కని చిట్టి అబ్బాయి అతని హృదయాన్ని కాగలించుకొని కూర్చున్నాడు. పాపము, ఆ అభాగ్యుడు హారలాల్‌కి ఎవరినీ ఇంత మనస్ఫూర్తిగా ప్రేమించడను ఇంతకుముందు ఎన్నడూ ప్రాప్తించలేదు. ఏ విధముగా నా స్థితి బాగుచేసుకోగలను అనుకొంటూ పుస్త-కాలు పట్టుకొని రాత్రింబగళ్లు చదువులోనే కూర్చొనేవాడు —చిన్నప్పటినుండి ఇప్పటివరకు ఇదే పని అతనికి. తల్లి ఒకరి ఇంట్లో కూలిపని చేయవలసివచ్చింది కదా అని హారలాల్ చిన్నవయస్సునుండి తనను తాను అణచుకొని అతిభయముతో నడుచుకొంటూ ఉండేవాడు. శిక్షాపద్ధతిచుట్టూఉన్న గట్లను దాటి అల్లరిద్వారా తనబాల్యప్రతాపానికి జయముకలిగించ-డము గాని, దానివల్ల సుఖముపొందడము గాని, అందరు పిల్లలకూ ప్రాప్తించినట్టు హారలాల్‌కి ఎన్నడూ ప్రాప్తించలేదు. అతను ఏజట్టులోనూ చేరేవాడు కాదు. తన చింకిపుస్తకాలూ, విరిగిపోయిన పలకా మాత్రమే అతనిజట్టు. పుట్టినప్పటినుండి నోరైనా విప్పకుండా అతిమంచిగా ఉండి తనతల్లి దుఃఖాన్ని-గురించీ, తనఅవస్థనుగురించీ ఎల్లప్పుడూ ఆలోచిస్తూ అతి

జాగ్రతగా ప్రవర్తిస్తూఉండవలసినవాని అవస్థ చాలాకష్ట-మైనది కదా! ఎటువంటిఆలోచనా లేకుండా స్వేచ్ఛగా తిరిగే భాగ్యము అటువంటిపిల్లవాడికి లభించదు. ఆపిల్లవాడు ఎన్న-డూసంతోషముతో స్వేచ్ఛగా గంతులు వేయలేదు, దుఃఖము వచ్చి మనస్ఫూర్తిగా ఏడవలేదు—ఇతరులకు ఇష్టముండదనీ, చికాకుగాఉంటుందనీ తన శిశుశక్తిఅంతా ప్రయోగించి తన సంతోషాన్నీ దుఃఖాన్నీ ఎల్లప్పుడూ నొక్కిపెట్టి ఉంచుతుం-టాడు. అటువంటి పిల్లవాడియెడల కనికరము కనపరచడము ఎంత అవసరమో ఈ లోకములో అంత అరుదు.

ప్రపంచములోఉండే అందరిమనుష్యులకాళ్లక్రిందనూ పడి-ఉండడమువల్ల నొక్కుకొనిపోయిఉన్న, హరలాల్‌లో ఇంత-స్నేహరసము ఉన్నదనీ, అవకాశము చిక్కినయడల పైకి-రావలెనని కనిపెట్టుకొని ఉన్నదనీ, హరలాల్‌కే తెలియలేదు. హరలాల్ వేణుతో ఆడుతూఉండేవాడు, వేణుకు చదువు-చెప్తుతూఉండేవాడు, వేణుకు జబ్బుచేస్తే సేవచేస్తూఉండే-వాడు. అప్పుడు అతనికి, తన ఉన్నతికోసము పాటుపడుతూ-ఉండడమొక్కటే కాదు పృథ్వీమీద ఉన్నది, దానికంటె గొప్ప పదార్థమొకటిఉన్నది, అది మనకు లభించినప్పుడే దానితో సరిపోల్చదగినది మరిఒకటి లేదని బోధపడుతుంది, అని అప్పుడు బోధపడ్డది.

హరలాల్ దొరకినప్పటినుండీ వేణుకుకూడా ప్రాణాలు వచ్చినవి. వేణుకు ఇద్దరు చెల్లెళ్లు ఉన్నారు, ఒకర్తె చంటిపిల్ల

రెండోది మూడుసంవత్సరాల పిల్ల, కాని వీళ్లు తనజట్టుకు తగినవాళ్లు కారని వేణుఅభిప్రాయము. వాళ్లపేటలో తనఈడుఅబ్బాయిలు లేకపోలేదు. కాని అధర్‌లాల్ తనది చాలా గొప్ప ఇల్లు అని నిశ్చయించుకొని కూర్చోవడమువల్ల తనఈడుకుతో కలిసి ఆడుకోడానికితగినపిల్లలు దొరకలేదు. అందుచేత హరలాల్ ఒక్కడే వేణు జట్టుగాడు. ఇంతకుముందు పదిమందిమీద సరుదుకుపోయి సహించడానికి ఒకవిధముగా సాధ్యమయిఉన్న వేణుఅల్లరి ఇప్పుడు పూర్తిగా హరలాల్ ఒక్కడే భరించి ఉండవలసివచ్చింది. ఇది ప్రతిరోజూ భరించడమువల్ల హరలాల్ అనురాగము మరింత వృద్ధిఅయిపోయింది. "మన వరహాలబాబును పాడుచేసేస్తూన్నాడు, ఈ మాస్టరు," అని రతికాంత ఒకనాడుఅన్నాడు. వాళ్లసంబంధము మాస్టరుకీ శిష్యుడికీ ఉండవలసినట్టుగా లేదు అని అధర్‌బాబుకుకూడా అప్పుడప్పుడు అనిపించేది, గాని వేణునూహరలాల్‌నీ వేరుచేసేటంతటి సాహసము ఎవరి కున్నది?

## ౪

వేణు పదకొండేళ్లవాడు అయినాడు. హరలాల్ ఎఫ్. ఏ. ప్యాసుఅయి స్కాలర్‌షిప్ సంపాదించి బి. ఏ. లో చేరాడు. ఇన్నాళ్లయినప్పటికీ అతనికి ఒకరిద్దరైనా స్నేహితులు జతపడలేదని అనుకోవడము పొరపాటు, కాని అతని స్నేహితులందరిలోకి ప్రియమైనస్నేహితుడు వేణుగోపాల్. రోజూ

కాలేజీనుంచి రాగానే డాల్‌హౌస్‌స్క్వేరుకో, ఈడెన్-గార్డెన్స్‌కో వేణును షికారుతీసుకొని వెళిపోతూఉండే-వాడు. వేణుకు గ్రీసుదేశపు వీరులకథలు చెప్తుతూఉండేవాడు; స్కాట్, విక్టర్ హ్యూగో మొదలైనవాళ్ల కథలు చెప్తుతూ-ఉండేవాడు; ఇంగ్లీషుకావ్యాలు పెద్దగొంతుకతో చదివి, అర్థముచెప్తుతూ బోధపరిచేవాడు. వేణుకు షేక్‌స్పియర్ వ్రాసిన జూలియస్‌సీజర్ చదివి వినిపించి అర్థము చెప్పేవాడు, అతనిచేత ఆంటోనీ ఇచ్చిన స్పీచ్ కంఠతాపెట్టించుదామని ప్రయత్నము చేసేవాడు. హరలాల్‌మనస్సుకు మెలకువ తెప్పించడములో అంత అల్పవయస్కుడైన వేణు, మంత్రము-లాగు,పనిచేశాడు. తానొక్కడే కూర్చొని ఇంగ్లీషుకావ్యాలు కంఠతా పెడుతున్నప్పుడు హరలాల్ వాటిభావము ఇంత బాగా ఎన్నడూ గ్రహించలేదు. ఇప్పుడు తాను చదివే దేశ-చరిత్రలలోనూ, విజ్ఞానశాస్త్రాలలోనూ, సాహిత్యములోనూ ఉండే చక్కని సంగతులన్నీ వేణుకు బోధపరుద్దామని ఉత్సా-హము ఉండడముచేత తాను ముందు అవి అతిజాగ్రత్తగా బోధపరుచుకొంటున్నాడు. వేణుకు ఆనందము కలిగించాలని చేసే ఈ ప్రయత్నమువల్ల భోదపరుచుకొనేశక్తీ, ఆనందము-పొందేశక్తీ అతనిలో చాలా విస్తారమయినవి.

వేణు స్కూలునుంచి వస్తూనే ఏదో తొందరతొంద-రగా కొంచెము ఫలహారము చేసేసి హరలాల్‌దగ్గిరికి వెళి-పోదామని అతిగాబరాపడేవాడు. తల్లి ఇది ఇష్టానని చెప్పేది,

అది ఇష్టానని చెప్పేది, గాని ఎన్నిమంచిమాటలు చెప్పిఅయినా వేణును ఇంట్లో ఉంచలేకపోయేది. నినిబాలకు ఇది చాలా కష్టముగా ఉండేది, తన ఉద్యోగము శాశ్వతముగా ఉండాలని హారలాల్ కుర్రవాడిని పూర్తిగా వశపరుచుకొంటున్నాడని ఆమె అనుమానించేది. ఒకనాడు హారలాల్‌ని పిలిపించి పరదా వెనకనుంచి అన్నది—"మీరు మాస్టరు; చదువుచెప్పడమే మీ పని. కనుక పిల్లడికి ప్రొద్దున్న ఒక ఘంటా సాయంకాలము ఒక ఘంటా చెపితే చాలును, రాత్రీ పగలూ వాడితోనే ఉంటా రెందుకూ? మునుపటిలాగు కాదు ఇప్పుడు, అమ్మా నాన్నా అంటే వాడికి నజరే లేదు. మహాబాగా ఉంది కదూ, మీరు నేర్పుతున్నది! మునుపు అమ్మఅనేసరికి గంతులు వేస్తూ పరదాపడేవాడు. ఇప్పుడో! ఎంతపిలిచినా ఫికరే లేదు! పెద్ద ఇంటిపిల్లవాడు కదా మా వేణు, వాడితో అంతగా భుజముభుజముకలుపుతున్నారు ఎందుచేత?"

ఆవాళ రతికాంత హుక్కా తాగుతూతాగుతూ బాతాఖానీ ప్రారంభించాడు అధర్‌బాబుతో—ముగ్గుర్ని చూచాడట రతిబాబు: పెద్దఇంట్లో పిల్లవాడికి మాస్టరుగా చేరడము, పిల్లవాడి మనస్సు బాగా వశపర్చుకోవడము, పిల్లవాడు పెద్ద వాడయి ఆస్తి చేతిలోకి తెచ్చుకోగానే ఆ పిల్లవాడిని తమఇష్టప్రకారము నడిపిస్తూఉండడము—ఇదే కథ అట ఆ ముగ్గురిదీను! హారలాల్‌కు స్పష్టముగా బోధపడ్డది, అతనిని మనస్సులో పెట్టుకొని రతి అంటూన్న మాటలు అవన్నీ

అని. కాని హారలాల్ ఒక్కమాట అనలేదు; విని, అక్కడ-నుంచి వెళ్ళిపోయినాడు. ఇది సహించి ఊరుకోగలిగాడు గాని, ఆనాడు వేణుతల్లి అన్న మాటలు జ్ఞాపకమువచ్చేసరికి అతని-గుండె బద్దలయిపోయింది. అప్పుడు బోధపడ్డది, గొప్పఇంటి-పిల్లవాడికి మాస్టరుగా ఉండడమంటే ఏమిటో. పిల్లవాడికి పాలకోసము సాలలో ఆవును ఉంచినట్టుగా చదువుకోసము కూడా ఒకమాస్టర్ని ఉంచుతారు. ఆలాంటిసందర్భములో పిల్లవాడితో భుజము కలిపి స్నేహము చేయడమా! ఎంత సాహసము!—ఇంట్లోనౌకర్లు మొదలుపెట్టి వేణుతల్లివరకు, ఎవరూ అదిచూచి సహించలేకపోయినారు! స్వార్థసాధనానికి మాస్టరు వేస్తూన్న ఎత్తు ఇది అని అందరూ పోల్చుకొన్నారు.

తల్లి ఆనాడు ఆలాగు అన్నప్పుడు హారలాల్ అతిభయ పడుతూ వణుకుతూఉన్న కంఠముతో అన్నాడు—"లేదమ్మా, పిల్లడికి చదువుమాత్రము చెపుతూఉంటాను, అతనితో మరి-ఏవిధమైన సంబంధమూ ఉంచుకోను."

వేణుతో ఆడుకుండే వేళ అయింది గాని హారలాల్ కాలేజినుంచి రోజూవచ్చేటట్టుగా, ఆ సాయంత్రము రాలేదు. వీధివీధీ తిరుగుతూ ఆ నాడు ఆసాయంకాలమంతా ఏలాగు గడిపాడో ఆ హారలాల్‌కే తెలియాలి. చీకటి పడ్డది. చదువు చెప్పేవేళయింది. హారలాల్ వచ్చాడు. వేణు ముఖము గంభీరముగా పెట్టుకొని కూర్చున్నాడు. రాకపోవడము తన-

తప్పు కాదు అని అయినా హరలాల్ చెప్పలేదు. చదువు మాత్రము చెప్పి వెళిపోయినాడు. ఆవాళ చదు వేమీ జరగలేదు.

హరలాల్ రోజూ ఇంకా చీకటి ఉండగానే లేచి తన గదిలో కూర్చొని చదువుకొంటూఉండేవాడు. వేణు లేస్తూనే ముఖము కడుక్కొని హరలాల్ దగ్గిరికి పరుగెత్తివెళుతూ-ఉండేవాడు. వాళ్లతోటలో గచ్చుతో కట్టిన నీళ్లతొట్టిఒకటి ఉన్నది. దానిలో చేపలు ఉన్నవి, ఇద్దరూ వెళ్లి వాటికి మురీలు తినిపించడము వాళ్లు రోజూ చేసే మొదటిపని. తోటలో ఒక మూలను చిన్న చిన్న రాళ్లు పేర్చి ఒకచిట్టి తోట వేణు తయారు చేశాడు. దానికి ఒక చిట్టి గేటు, చుట్టూ చిన్న చిన్న గోడలు, లోపున చిన్న చిన్న రోడ్లు, చిన్న రాళ్లతోనూ రాతిముక్కల-తోనూ, తయారుచేశాడు. ఇది ఒక రుషిఆశ్రమము, తోట-మాలి అధికారము ఈచిట్టితోటమీద లేదు, వేణూ, మాస్టరూ రోజూ ఉదయము వచ్చి దానిని సంరక్షణ చేస్తూఉండేవారు—వాళ్లు చేసే రెండోపని ఇది. అప్పటికి ఎండ బాగా వస్తే ఇంట్లోకి వెళిపోయేవారు, వేణు మాస్టరుగారిదగ్గిర కూర్చొని చదువు-కొనేవాడు. ముందురోజు సాయంత్రము కథవినడము జరగ-లేదు, కనుక అది విందామని వేణు ఈవాళ సాధ్యమైనంత పెందలాడే లేచి మాస్టరుగారిదగ్గిరికి పరుగెత్తుకొని వచ్చాడు, ఈవాళ ఇంత పెందలాడే లేవడము మాస్టరుగారిని పీకకొట్ట-డము అని అనుటకొంటూ అతి గర్వముగా గదిలోకి వెళ్లాడు,

గాని చూచేసరికి మాస్టరుగారు లేరు,— అంతకుముందే బయటికి వెళిపోయినారని దర్వాన్‌ని అడిగి తెలుసుకొన్నాడు.

ఆనాడుకూడా తన చిట్టిమనస్సును దుఃఖముతో నింపుకొని మాస్టరుగారితో చదువుతున్నంతసేపూ ముఖము గంభీరము చేసుకొనే కూర్చున్నాడు. తెల్లవారకముందు ఎందుకు బయటికి వెళ్లారని కూడా వేణు మాస్టరుగారిని అడగలేదు. హారలాల్ వేణుగోపాల్ వైపు చూడనైనా చూడకుండా పుస్తకమువైపుమాత్రము చూస్తూ చదువుకాగానే వెళిపోయినాడు. వేణు ఆవాళ ప్రొద్దున్న తల్లిదగ్గిర కూర్చొని భోజనము చేస్తూఉన్నప్పుడు తల్లి అడిగింది, "ఏమిటయింది రా నీకు, నిన్నసాయంత్రమునుండీ? మొఖము ఎందుకు ఆలా పెట్టుకు కూర్చున్నావు? తిండికూడా తిన్నగా తినడము లేదే, ఏమిటయింది నీకు?"

వేణు ఏమీ అనలేదు. భోజనమయిన తరువాత తల్లి వేణును దగ్గిరికి తీసుకొని, ఒంటిమీద చెయ్యివేసి, ధువ్వుతూ, చాలా ముద్దుచేసి, అనేకమార్లు అడిగింది. వేణుమరిపట్టలేక వెక్కి వెక్కి ఏడుస్తూ అన్నాడు—

'మాస్టరుగారూ—"

"మాస్టగారు—ఏమిటి?"

మాస్టరుగారు ఏమిటి చేశారో చెప్పలేకపోయినాడు వేణు. ఫిర్యాదు మాటలతో చెప్పడము వచ్చిందికాదు.

"మాస్టరుగారు తల్లికి వ్యతిరేకముగా ఏదో చెప్తున్నాడు కదూ?" అని అడిగింది తల్లి.

వేణుకు బోధపడలేదు తల్లిఅన్నమాట, ఏమీ జబాబు ఇవ్వకుండా వెళిపోయినాడు.

౫

అంతలో అధర్ బాబు బట్టలు ఏవోకొన్ని ఎవరో దొంగలించారు. పోలీసుకు రిపోర్టుచేశారు, పోలీసువాళ్ళు సెర్చిచేయడానికి వచ్చి హారలాల్ పెట్టెకూడా విడిచిపెట్ట లేదు. "దొంగతనము చేసినవాడు చోరీమాలు తన పెట్టెలో దాచి ఉంచుతాడా!" అని రతికాంత అమాయకముగా అన్నాడు.

పోయినవస్తువుల జాడ దొరక లేదు. ఇటువంటినష్టము కలిగినప్పుడు సహించి ఊరుకోలేదు అధర్ బాబు. ప్రపంచములోఉండే అందరిమీంద మండిపడిపోతున్నాడు. రతికాంత మొదలుపెట్టాడు—— "లేకపోయినా, ఇంట్లో ఇంతమంది మనుష్యులా! ఎవరిమీంద తప్పుమోపగలము, ఎవరిని అనుమానించగలము? ఎవడి ఇష్టమువచ్చినప్పుడు వాడు వస్తాడు ఎవడిఇష్టము వచ్చినప్పుడు వాడు వెళతాడు."

అధర్‌లాల్ హారలాల్‌కు కబురుపంపించి అన్నాడు, "చూడండి మాస్టరుగారూ, పై వాళ్ల నెవరినైనా ఇంట్లో ఉండనిస్తే నాకు చాలా ఇబ్బందిగా ఉన్నది, మీరు వేరే ఇల్లు-చూసుకొని అక్కడికి వెళిపొండి, సరిగా వేళకు వచ్చి చదువు-చెప్పి వెళిపోతూఉండండి, కావలంటే జీతము రెండు రూపా-యిలు అధికము చేయడానికి నాకేమీ అభ్యంతరము లేదు."

"మంచి పని అది," అన్నాడు రతికాంత, గుడుగుడు పీలుస్తూ; "మీకూ మంచే అతనికీ మంచే!"

హారలాల్ తలవంచుకొని విన్నాడు, తక్షణము ఏమీ-జబాబు చెప్పలేకపోయినాడు. తన గదిలోకి వచ్చి అధర్‌బాబుకు ఉత్తరము వ్రాసి పంపాడు.—అనేక కారణాలవల్ల వేణుగోపాల్‌కు చదువుచెప్పడానికి తనకు వీలులేదనీ, సెల-వయితే ఆనాడే పని విడిచిపెట్టి వెళిపోడానికి సిద్ధముగా ఉన్నాడనీ, ఆ ఉత్తరములో వ్రాశాడు.

ఆవాళ వేణు స్కూలునుంచి ఇంటికివచ్చి చూచేసరికి మాస్టరుగారి గది ఖాళీ, మాస్టరుగారి విరిగిపోయిన టిన్ పెట్టె మూలను కనబడలేదు. తాడుమీద రోజూ ఆరవేసిఉండే దోవతీ, గావంచా కూడా కనబడలేదు, తాడుమాత్రము ఉన్నది. టేబిలుమీద పుస్తకాలూ, నోటుబుక్కులూ, కలగా పులగముగా పడిఉండేవి, ఈవాళ అవేవీ కనబడలేదు. వాటికి బదులుగా పెద్ద గాజుజాడీ ఒకటి నీళ్ళతో నింపి దాని-

మీాద ఉంచారు. అందులో వేణు ఆడుకుండే ఎర్రనిచేపలు
కిందికీ మీాదికీ పరిగెత్తుతున్నవి. మాస్టరుగారి దస్తూరితో వేణు
పేరు వ్రాసిన చిన్న కాగితము ఒకటి ఆ జాడీమీాద అంటించి
ఉన్నది. టేబిలుమీాద జాడీపక్కను చక్కని బైండుచేసిన
ఇంగ్లీషుబొమ్మల పుస్తకము ఒకటి ఉన్నది. దాని మొదటిపేజీలో
మాస్టరుగారి దస్తూరితోనే వేణుపేరు వ్రాసిఉన్నది. దానికింద
ఆవాళతారీకూ, మాసమూ, సంవత్సరమూ వ్రాసిఉన్నవి.

వేణు తండ్రిదగ్గిరికి పరిగెత్తుకొని వెళ్లి, "మాస్టరుగారు
ఎక్కడకి వెళిపోయినారు నాన్నా?" అని అడిగాడు. తండ్రి
వేణును దగ్గిరికి తీసుకొని, "అతను పని విడిచిపెట్టి వెళిపోయి
నాడు," అని అన్నాడు.

వేణు చెయ్యి లాగుకొని పక్కగదిలోకి వెళ్లి పరుపు
మీాద బోర్లాపడుకొని ఏడుపు మొదలుపెట్టాడు. అధర్ బాబు
విచారిస్తూ కూర్చున్నాడు. ఏమిచేయడమో తెలియలేదు.

మర్నాడు ప్రొద్దున్న సుమారు పదిఘంటలనర అయి
ఉంటుంది, హారలాల్ ఒక * మెస్‌లో తనగదిలో మంచము
మీాద కూర్చొని, కాలేజీకి ఈవాళ వెళ్లనా వద్దా అని
ఆలోచిస్తున్నాడు, ఆ సమయములో అధర్ బాబుగారి దర్వాన్
వచ్చి గదిలో ప్రవేశించాడు. ఇదేమి టిది అని హారలాల్

* చిన్న ప్రైవేటు హోటలు.

ఆశ్చర్యపోయి చూస్తున్నాడు, దర్వాన్ వెవకనే వేణు పరు-
గెత్తుకొని వచ్చి అమాంతముగా హరలాల్ మీద పడి అతని
మెడపట్టుకొని గట్టిగా కౌగలించుకొన్నాడు. హరలాల్
నోటిలోనుంచి మాట రాలేదు. మాటలాడబోతే కళ్ల వెంట
నీళ్లు కారిపోతవనే భయముచేత మాటలాడలేదు. "మాస్టరు
గారూ, మా ఇంటికి పదండి!" అని వేణు అన్నాడు.

వేణు వాళ్లముసలి దర్వాన్ 'చంద్రభాన్'ను పట్టు-
కొన్నాడు, నన్ను ఏలాగైనా మాస్టరుగారి బసకు తీసుకు-
వెళ్లవలసింది అని. మాస్టరుగారి టిన్ పెట్టె మోసుకువెళ్లిన
కూలీద్వారా ఆయన ఎక్కడికి వెళ్లాడో తెలుసుకొని చంద్ర-
భాన్ ఈవాళ వేణును స్కూలుకు తీసుకువెళ్లవలసిన బండి-
మీద ఈ మెస్‌కు తీసుకువచ్చాడు.

హరలాల్ వేణుతో ఇంటికి వెళ్లలేకపోయినాడు;
వేణుఇంటికి వెళ్లడానికి ఎందుచేత వీలులేదో ఆ కారణమైనా
వేణుతో చెప్పలేకపోయినాడు. వేణు మాస్టరుగారి మెడ పట్టు-
కొని, "మా ఇంటికి పదండి," అన్నాడు. చాలా రోజులవరకూ
రాత్రింబగళ్లు వేణుస్పర్శా, వేణుమాటలూ మాస్టరుగారిని
వదలలేదు; అవి మెడపట్టుకొని ఊపిరితిరగకుండా చేస్తూ-
ఉన్నవి అనిపించింది ఆయనకు. కాని రానురాను కొన్నాళ్లకు
అదంతా ఇద్దరూ మరిచిపోయినారు.

౬

ఎంత ప్రయత్నము చేసినా హారలాల్ మునపటి మోస్తరుగా మనస్సు ఇచ్చి చదవలేకపోయినాడు; పుస్తకము పట్టుకొని ఒక్కరిదగ్గిర కూర్చోనే లేకపోయేవాడు. ఒక పేజీ చదివేవాడు ఎంతో కష్టముమీద, తఫ్‌మని పుస్తకము మూసేసి ఏమీ పని-లేనిదే రోడ్డుమీద ఒకచివరనుంచి ఇంకొకచివరకు పచారుచేసి వచ్చేవాడు. కాలేజీలో లెక్చరునోట్సులో మధ్యమధ్య పెద్ద ఖాలీలు ఉండిపోయేవి. మధ్యమధ్య వ్రాత ఉండేది, అది ఈజిప్టు దేశస్థులు పూర్వము వ్రాసే హీరాగ్లిఫిక్సులాగు ఉంటే ఉంటుందేమోగాని ఇంగ్లీషులాగుమాత్రము ఉండేది కాదు.

ఇవన్నీ మంచి సూచనలు కావు అని హారలాల్‌కు బోధపడ్డది. పరీక్ష ఒకవేళ ప్యాసు అయినా స్కాలరుషిప్ నిలుపుకుండేటంత బాగా మార్కులు రావు, అది నిశ్చయము. స్కాలరుషిప్ లేకుండా కలకత్తాలో ఒక్కరోజు ఉండలేడు. అదికాక తల్లికికూడా మూడునాలుగు రూపాయిలు ప్రతి నెలా పంపించకపోతే ఆమెకు జరగదు. చాలా ఆలోచించి చూచాడు. సంగతి ఏమీ బాగులేదని అనుకొంటూ, పని ఏదైనా చూచుకొందామని బయలుదేరాడు. పని సంపాదించడము కష్టమే గాని పని సంపాదించకపోతే అతనికి మరీ కష్టము. అందుచేత ఆశ కూడదు అని తెలిసినా ఆశను వదలకుండా కూర్చున్నాడు.

హారలాల్ పని వెతుక్కుంటూ చివరకు ఒక పెద్ద దొరల కంపెనీలోకి వెళ్ళి భాగ్యవశాత్తు ఆ కంపెనీ పెద్దదొరకంట పడ్డాడు. ముఖము చూడగానే ఎవరినైనా పోల్చేసుకోగలను అని ఆ దొరకు పెద్ద నమ్మకము ఒకటి ఉండేది. అతను హారలాల్‌ను పిలిచి అతనితో నాలుగు మాటలాడి, "మనిషి పనికివస్తాడు," అని తనలో తాను నిశ్చయించుకొన్నాడు.

"మీకు పనేమైనా తెలుసునా?" అని దొర అడిగాడు.

"తెలియదు," అన్నాడు హారలాల్.

"ఎవరైనా పెద్దవాళ్లదగ్గిరనుంచి సర్టిఫికేట్ తీసుకు రాగలరూ?"

తీసుకురాలేదు, అతనికి తెలిసినవాళ్లు ఎవరూ లేరు. ఆ సంగతి విని దొర మరీ సంతోషించి అన్నాడు, "సరే పాతిక రూపాయిల మీద చేరండి, పనినేర్చుకొన్నతరువాత జీతము అధికము చేస్తాను." ఈలాగు అంటూ హారలాల్ బట్టలూ వేషమూ చూచి, "పదిహేను రూపాయిలు అడ్వాన్సుగా ఇస్తాను, తీసుకువెళ్లి ఆఫీసులో ఉద్యోగానికి తగిన బట్టలు కొనుక్కొని రండి," అన్నాడు.

హారలాల్ బట్టలు తయారైనవి, ఆఫీసుకు వెళుతున్నాడు. పెద్దదొరగారు అతనిచేత రాక్షసిపని చేయించేవాడు. తక్కిన గుమాస్తాలు ఇంటికి వెళిపోయినా హారలాల్ మాత్రము

ఆఫీసులో ఉండి పనిచేయ వలసివచ్చేది. ఆఫీసు కాగితాలలోని సంగతులు దొరగారికి సవిస్తరముగా చెప్పవలసివస్తే ఒకొక్క-నాడు దొరగారి ఇంటికికూడా వెళుతూఉండేవాడు.

ఈ విధముగా కష్టపడి అతిత్వరలో పనినేర్చుకొన్నాడు హీరలాల్. తోటి గుమాస్తాలు ఈర్ష్యకొద్దీ హీరలాల్‌ను మోసపుచ్చుదామని చాలా ప్రయత్నముచేసేవారు. పైదొరల దగ్గిరికి వెళ్ళి అతనిమీద ఫిర్యాదుచేసేవారు. హీరలాల్ ఏమీ అనేవాడుకాడు. సాధువు, అమాయకుడు, అయినా అతనికి ఎవరూ ఏమీ హానిచేయలేకపోయినారు.

క్రమముగా హీరలాల్‌కు నలభై రూపాయిలు జీతము అయింది. ఒక చిన్నసందులో చిన్న ఇల్లొకటి చూచి తల్లిని గ్రామమునుంచి తీసుకువచ్చాడు. ఇన్నాళ్లకు తల్లిదుఃఖము శాంతించింది.

తల్లి అన్నది, "నాయనా, నాకున్న రెండో కోరికకూడా సఫలము చేయి, కోడలినిచూసే సుఖము నాకు ఇయ్యి." తల్లి-పాదాలకు నమస్కారముచేసి, "ఆ విషయములోమాత్రము నన్ను క్షమించాలి అమ్మా," అన్నాడు హీరలాల్.

తల్లికి ఇంకొక కోరికఉండెను—"రాత్రింబగళ్లు నీ శిష్యుడు వేణుగోపాల్‌మాట నాతో చెప్తూఉంటావే అతన్ని ఒకమారు విందుకు పిలుచుకురా నాయనా, అతన్ని చూడా-లని నాకు చాలా ఉన్నది," అని తల్లి ఒకనాడు అన్నది.

"ఇటువంటి ఇంటిలో అతనికి ఏలాగు విందు చేయడము అమ్మా? మరికొంతకాల మయిన తరవాత మనము పెద్ద ఇంటికి బసమార్చుకొన్నప్పుడు తీసుకువస్తాను," అన్నాడు హారలాల్.

౭

హారలాల్‌కు పెద్ద జీతము అయింది. చిన్న సందులో నుంచి పెద్దవీథిలోకి బసమార్చాడు. చిన్న ఇల్లు వదిలి పెద్ద ఇంట్లోకివచ్చాడు. అయినా, ఎందుచేతనో, అధర్ బాబుగారి ఇంటికి వెళదామనిగాని, వేణుగోపాల్‌ను తన ఇంటికి భోజనానికి పిలుద్దామనిగాని హారలాల్‌కు బుద్ధిపుట్టలేదు.

తన సంకోచము ఇక ఎన్నటికీ పోదు గాబోలు అని అనుకొంటున్నాడు, అటువంటప్పుడు వేణుతల్లి చనిపోయిందని హారలాల్ విన్నాడు. వినగానే ఒక్కనిమిషమైనా ఆలస్యము చేయకుండా అధర్ బాబుగారి ఇంటికి వెళ్లాడు.

ఇంతకాలానికి ఈ అసమవయస్కులైన ఇద్దరు స్నేహితులూ తిరిగీ మరిఒకమారు కలుసుకొన్నారు. వేణు అశుచిపోయినతరువాత హారలాల్ వేణుఇంటికి అప్పుడప్పుడు వస్తూఉండేవాడు. కాని మునపటి రోజులు మరిరాలేదు. వేణు పెద్దవాడయినాడు, మాట్లాడుతూఉన్నంతసేపూ మీసము మీద చెయ్యివేసి ఆనూగునూగు మీసాలు తిప్పుకొంటూండేవాడు. అతనుచేసే ప్రతిచిన్నపనిలోనూ బాబూగిరీ వ్యక్త

మవుతూ౦డేది. తన తోటివాళ్లూ, తనకుసరిపోయే వాళ్లూ, స్నేహితులూ కూడా కావలసినంతమంది ఇప్పుడు కుదిరారు. అతనికి. కలకత్తానాటకాలలో ఆడవాళ్లు పాడే జావిళీలు గ్రామొఫోన్ మీద వాయించి తన స్నేహితులతో ఎల్ల-ప్పుడూ ఆనందిస్తూ౦డేవాడు. ఆ చేతులుపోయిన కుర్చీ, ఆ సిరాడాగుల టేబిలూ, చదువుకుండే గదిలో ఇప్పుడు కన-బడ లేదు. నిలువుటద్దాలతోనూ, పటాలతోనూ, సోఫాల-తోనూ నిండిఉన్న వేణుగది ఛాతీ విరుచుకొని నిలుచున్న మనిషిలాగు ఠీవిగా కనబడుతున్నది. ఇప్పుడు వేణుగోపాల్ కాలేజీలో చదువుతున్నాడు, గాని సీనియర్ ఎఫ్.ఏ. దాటి వెళ్లే జాడ కానరాలేదు, దాటవలెనని తాపత్రయముకూడా అతనిలో ఉన్నట్టు కనబడ లేదు. రెండుమూడు పరీక్షలు ప్యాస యితే పెళ్లిబజారులో వేణుఖరీదు కొంచెము ఎక్కుతుందని అధర్ బాబు ఆలోచిస్తున్నాడు. కాని తల్లిమాత్రము చనిపో-యేవరకు అనేది — "అందరి మోస్తరు కాదు మా వేణు, ప్యాసునిబట్టి మావాడివిలువ చూస్తే పనికిరాదు—మా ఇనపపెట్టెలో గవర్నమెంటుపత్రాలు పెరుగుతూఉన్నంతసేపు మాకు ఎటువంటిభయమూ అక్కరలేదు." వేణుకు తల్లి-మాటలు బాగా నచ్చినవి.

వేణుకు ఏవిధముగా చూచినా తన అవసరము లేదు అని హారరాల్ కు తక్షణమే బోధపడిపోయింది. కాని ఉండుండి ఆనాటికథ జ్ఞాపకము వస్తూఉన్నది హారలాల్ కు— 'ఆనాడు

ఉదయము హఠాత్తుగా ఆ మెస్‌లోకివచ్చి తన మెడపట్టుకొని "మా ఇంటికి పదండి మాష్టరుగారూ,' అన్నాడు. ఆహా! ఆ వే ణేడీ? ఆ ఇల్లేదీ? ఇప్పుడు ఎవరికి కావాలి మాష్టరుగారు?

పోనీ, అప్పుడప్పుడు వేణుగోపాల్‌ను తనఇంటికి భోజనానికి తీసుకువెళుతూఉందామని మాష్టరుగారికి కోరికపుట్టింది. కాని అతనిని పిలవడానికి తగిన సాహసములేకపోయింది. 'అతన్ని ఇవాళ తీసుకువెళదాము' అని ఒకొకమాటు అనుకుండేవాడు, 'పోనీ ఎందుకు, లాభములేదు—రమ్మంటే వేణు లేదనడు గాని, అయినా ఎందుకు?" అని అనుకొనేవాడు మరికొంతసేపటికి.

కాని హారలాల్‌తల్లి ఎంతకూ వదిలింది కాదు—"నా చేతితో నేను వండి అతనికి ఒకమాటు విందుచేయాలని చాలా కోరికగా ఉన్నది రా బాబూ; పాపము, అతని తల్లి కూడా పోయింది రా!" అని మాటిమాటికీ అనేది.

ఆఖరుకు ఒకనాడు అతనిని పిలుద్దామని అధర్‌బాబుగారి ఇంటికి వెళ్లాడు. వేణుదగ్గిరికి వెళ్లి తండ్రిసెలవుతీసుకు వస్తానని అన్నాడు. "మా నాన్నసెలవు ఎందుకు, ఇప్పటికీ నేను ఆ వరహాల బాబును అనుకొంటున్నారా ఏమిటి మాష్టరుగారూ?" అని వేణు అన్నాడు.

వేణు హారలాల్‌ఇంటికి భోజనానికివచ్చాడు. సుబ్రహ్మణ్యమూర్తిలాంటి ఆ అబ్బాయిని చూచింది హారలాల్ తల్లి

ప్రేమతో నిండిఉన్న కళ్లతో ఆశీర్వాదము చేసింది, ఎంతో ముద్దుతో భోజనము పెట్టింది. "ఇటువంటి వయస్సులో ఉన్న ఈకుర్రవాణ్ణి విడిచి వెళిపోయినప్పుడు ఆ తల్లి ప్రాణము ఏలాగు కొట్టుకున్నదో కదా!" అని వేణు భోజనము చేస్తూఉన్నంతసేపూ అనుకొంటూనేఉన్నది హారలాల్ తల్లి.

భోజనము కాగానే వేణు అన్నాడు—"మాస్టరుగారూ, నేను కొంచెము పెందలాడే ఇంటికి వెళ్లాలి, ఈవాళ నా స్నేహితులు ఇద్దరు వస్తామన్నారు."

ఆలాగు అంటూ జేబులోనుంచి బంగారము వాచీ తీసి టైము చూచాడు. క్షిప్తముగా సెలవుతీసుకొని జోడుగుర్రాల-బండి ఎక్కాడు. హారలాల్ ద్వారముదాకా వచ్చి నిల-బడ్డాడు. బండీ వీధికివీధీ కదిలినట్టుగా శబ్దముచేసుకొంటూ ఒక్క నిమిషములో అదృశ్యమయిపోయింది.

"హారలాల్, అతన్ని అప్పుడప్పుడు భోజనానికి తీసుకు వస్తూఉండురా బాబూ ఈ వయస్సులో తల్లిచచ్చిపోయింది అని జ్ఞాపకము వచ్చేసరికి నా గుండె బద్దలయిపోతూంటుంది రా నాయనా."

తల్లిమాటలు విని హారలాల్ ఏమీ జబాబుచెప్పలేదు. ఆ తల్లిలేని పిల్లడి మనస్సును ఓదార్చవలసిన అవసరము హార-లాల్ కి కనబడలేదు. పెద్ద నిట్టూర్పు విడిచి తనలో తాను అను-

[illegible]డు, "చాలును, ఇక్కడితో చాలిస్తే బాగాఉంటుంది, మ[illegible] ఎన్నడూ [illegible] పిలవను, మునుపు అయిదురూపాయిలు జీతము పుచ్చుకొన్న మాష్టరును నేను, ఇప్పటికీ ఆ హారలాల్ నేనా!"

౮

రలాల్ ఒకనాడు బాగా చీకటిపడ్డ తరువాత అఫీసునుంచి ఇంటికి వచ్చాడు తనకోసమని కనిపెట్టుకొని ఎవరో చీకటిలో కూర్చొనిఉన్నారు, ఆ సంగతి తెలియకుండా హర-లాల్ మేడమీదికి వెళిపోయిఉందును, గాని ఇంట్లో అడుగు పెట్టేసరికి సెంటువాసన ఎగిరిపోతున్నది. ఇంట్లో ప్రవేశిస్తూనే, ఎవరండీ మీరు!" అని అడిగాడు. వేణు లేచి నిలుచొని, "నే నండీ మాష్టరుగారూ" అని అన్నాడు.

"ఇ దేమిటి! ఎప్పటినుంచి వచ్చికూర్చున్నావు?" అని హారలాల్ అడిగాడు.

"చాలా సే పయింది వచ్చికూర్చున్నాను, మీరు ఇంత ఆలస్యముగా ఆఫీసునుంచి వస్తూంటారని నాకు తెలియ లేదు." అన్నాడు వేణు.

చాలారోజులకిందట ఆనాడు భోజనానికి వచ్చినప్పటి-నుండీ వేణు ఈ ఇంటికి ఈ ఒక్కమారైనా రాలేదు, వేణూ

మాస్టరుగారూ మరి కలియలేదు. ముందుగా ఖబురైనా
కుండా వేణుసామంత్రము హఠాత్తుగా వచ్చి ఆ అంధకార-
ములో ఆలాగు కనిపెట్టుకొనిఉండడము చూచి మాస్టరు
గారు కొంచెము గడబడపడ్డారు.

మేడమీదికి వెళ్ళి దీపము వెలిగించి ఇద్దరూ గదిలో
కూర్చున్నారు. "అంతా క్షేమమా? విశేషాలేమీ లేవుకదా?"
అని మాస్టరుగారు అడిగారు.

వేణుకు రానురాను చదువుఅంటే చికాకు వేస్తున్నది.
ఎఫ్.ఏ. లో ఉండిపోయినాడు. సోదిలాగు చిరకాలమూ చది-
వినవే చదువుతూఉండడము ఎవరితరము బాబూ! అతనికంటె
ఎన్నో సంవత్సరాలు చిన్నవాళ్లతో క్లాసులో కూర్చొని చదవ-
డానికి చాలా సిగ్గుగాఉన్నది అతనికి. కానీ తండ్రి ఏమీ
బోధపరుచుకోడు.

"అయితే నువ్వేమిటి చేస్తానంటావు?" అని మాస్టరు
గారు అడిగారు.

సీమ వెళ్లి బారిస్టరీ ప్యాసయి వస్తాడట. అతనిక్లాసు-
లోనే చదువుతూన్న కుర్రవాడు, తనకంటె చదువులో
చాలా తక్కువవాడు, ఒకడు ఉన్నాడట అతను బారిస్టరు
పరీక్షకు వెళదామని నిశ్చయించాడట.

"మీనాన్నకు తెలియజేశావా నీ కోరిక?" అని మాస్ట-
రుగారు అడిగారు.

తెలియజేశాను. "ప్యాసుకానిదే సీమ వెళ్ళడముమాట నాదగ్గిర ఎత్తకు అన్నాడు నాన్న. కాని నా మనస్సు బాగు-లేదు, నేను ఇక్కడ ప్యాసుకాలేను," అని అన్నాడు వేణు.

మాష్టరుగారు విని ఆలోచిస్తూ కూర్చున్నాడు, ఏమీ అనలేదు. వేణు తిరిగీ ప్రారంభించాడు—"ఆ సందర్భములో, నాన్న ఈవాళ నన్ను నోటికివచ్చిన మాటలన్నీ అన్నాడు. అందుచేత ఇంట్లోనుంచి వచ్చేశాను. అమ్మఉంటే ఈలాగు ఎప్పుడూ జరగకపోను." ఈమాటలు అంటూఅంటూ ఏడుపు ఆరంభించాడు.

"పద, నేనూ నువ్వూ కలిసి మీ నాన్న దగ్గిరికి వెళదాము ఆలోచించి ఏది మంచిదయితే అది చేదాము," అని అన్నారు మాష్టరుగారు

" లేదు, నేను మరి అక్కడికి రాను, " అన్నాడు వేణు

తండ్రితో పోట్లాడి వచ్చి తన ఇంట్లో ఉండిపోవడము హారలాల్ కి ఎంతమాత్రము నచ్చలేదు, అయినా 'మా ఇంట్లో ఉండవద్దు,' అని ఏలాగు చెప్పగలడు. కొంచెము సేపు పోతే అతని మనస్సు మెత్తనవుతుంది. అప్పుడు మంచిమాటలు చెప్పి-మరిపించి అతనిని వాళ్ల ఇంటికి తీసుకువెళ్లవచ్చును అనుకొని "భోజనము అయిందా, వేణూ?" అని అడిగాడు.

"లేదు నాకు ఆకలి లేదు ఈవాళ, నేను భోజనము చేయను."

"నేను అది ఎంతమాత్రం ఒప్పుకోను"—అంటూ మాస్టరుగారు లేచి ఇంట్లోకి అమ్మదగ్గిరికి వెళ్లి, "వేణు వచ్చాడు, అతనికోసము ఫలహారము ఏమైనా చెయ్యిఅమ్మా," అని అన్నాడు.

విని అమ్మ చాలా సరదాపడి ఫలహారము తయారు చేదామని లేచింది. హారలాల్ ఆఫీసుబట్టలు విడిచి కాళ్లూ చేతులూ కడుక్కొని వేణుదగ్గిరికి వచ్చి కూర్చున్నాడు. హారలాల్ కొంచెము దగ్గి గొంతుక సవరించుకొని వేణువీపు-మీద చెయ్యి వేసి అన్నాడు, "సంగతి బాగులేదు వేణూ! నాన్నగారితో పోట్లాడి ఇంట్లోనుంచి వెళిపోరావడము నీకు తగిన పని కాదు వేణూ"

విని వేణు తత్క్షణము మంచముమీదనుంచి లేచి, "ఇక్కడఉంటే మీకు ఇబ్బంది కలుగుతుంది అంటే శతశ్ గారి ఇంటికి వెళిపోతాను," అన్నాడు; అంటూ వెళిపోబోయినాడు. మాస్టరుగారు అతని చెయ్యి పట్టుకొని, "ఉండు, కొంచెము ఏదైనాతిని వెళ్లు," అన్నారు.

"వద్దు, నేనేమీ తినలేను," అని కోపముతో అన్నాడు వేణు, అంటూ చెయ్యి వదిలించుకొని గదిలోనుంచి పైకి వచ్చేశాడు.

ఇంతలో తల్లి హారలాల్ కోసము సిద్ధముగా ఉంచిన ఫలహారము పళ్లెములో పెట్టి తీసుకువస్తూ వరండాలో ఎదురుపడ్డది, "వెళిపోతున్నావు ఏమి నాయనా?" అని అడిగింది.

"పని ఉన్నది, నేను వెళిపోవాలి అన్నాడు," వేణు.

"ఏమైనా సరే వెళ్లనివ్వను, ఫలహారము చేయనిదే వెళ్లడానికి వీలులేదు," అని తల్లి అన్నది. వరండామీదనే పళ్లెము ఉంచి వేణుగోపాల్ చెయ్యి పట్టుకొని కూర్చోపెట్టి అతనిచేత ఫలహారము చేయించింది.

కోపముగా ఉండడమువల్ల వేణు ఏమీతినడములేదు, దీనిమీదా దానిమీదా చెయ్యివేసి తీసేస్తూన్నాడు. అంతలో గుర్రపుబండిఒకటి వచ్చి గుమ్మముదగ్గిర నిలబడ్డది. మొదట ఒక దర్వాన్ మెట్లు ఎక్కుతున్నాడు, అతని వెనకనే శప్ శప్ మని స్లిప్పర్లు శబ్దముచేసుకొంటూ అధర్ బాబు వస్తూన్నాడు. వేణు ముఖములో రక్తములేదు.

తల్లి గదిలోకి వెళిపోయింది. అధర్ బాబు మీదికివచ్చి వేణుఎదుట నిలబడి హారలాల్ వైపుచూస్తూ అన్నాడు, "ఇదా సమాచారము! రతి అప్పుడే నాతో అన్నాడు, కాని కడుపులో ఇంతింత ఉద్దేశాలు పెట్టుకొనిఉన్నావని నేను నమ్మలేదు. వేణును పూర్తిగా వశపరుచుకొని ఇష్టమువచ్చిన ఆటలు ఆడిద్దామని అనుకొంటున్నావు గాని నేను అది సాగనివ్వను,

జ్ఞాపకము ఉంచుకో. పిల్లవాడిని దొంగలాడుతావేమి! నీ
మీద పోలీసుకేసు పెట్టి నిన్ను జైలులో పెట్టించి మరీ
వదులుతాను, జాగ్రత్త!" అని ఈలా వేణువైపు ముఖము
తిప్పి, "ఇకలే, పద!" అన్నాడు. వేణు ఊఁ అనకుండా, ఆఁ
అనకుండా తండ్రి వెనకనే వెళిపోయినాడు.

ఆవాళ హరలాల్‌కుమాత్రము అన్నము నోటికి వెళ్లిం-
దికాదు.

౯

హరలాల్ కంపెనీవాళ్లు కొత్తవ్యాపారము ఒకటి
మొదలుపెట్టి, చుట్టుపక్కఊళ్లలో ధాన్యమూ, కాయ
ధాన్యాలూ బేరముచేసి చాలాభారీగా కొంటున్నారు ఇప్పుడు.
ఆసంబంధములో హరలాల్ వారానికి ఒకమారు, ప్రతిశని-
వారమూ, ఉదయముబండిలో ఏడెనిమిదివేల రూపాయిలు
పట్టుకొని వెళ్లవలసివచ్చేది. ఆచుట్టుపక్క ఊళ్లన్నిటికీ వీలుగా
ఉండేటట్టు కేంద్రముఒకటి మఫసల్‌లో ఏర్పరిచారు. సరుకు
సప్లయిచేసిన వర్తకులతో లెక్కపరిష్కారము చేసుకోడానికి
పదిరూపాయలనోట్లూ, అయిదురూపాయిలనోట్లూ పట్టుకొని
ఆ సబ్ఆఫీసుకు ప్రతివారమూ వెళ్లేవాడు. అక్కడ రసీదులూ,
చిత్తాలు సరిగా ఉన్నవోలేవో చూచి వారముపొడుగునా
అక్కడ అవసరానికి సరిపోయేటట్టు రూపాయిలు అక్కడఉంచి

వచ్చేవాడు. ఆఫీసు దర్వానులుఇద్దరు హరలాల్‌కు సాయము వస్తూఉండేవారు. హరలాల్ దగ్గిర సెక్యూరిటీ పుచ్చుకోలేదని ఆఫీసులో అందరూ మూలుగుతూఉండేవారు, గాని పెద్ద-దొరగారు తనమీదనే పూచీ అంతా పెట్టుకొంటాను అనడము-చేత సెక్యూరిటీ అవసరము లేకపోయింది.

మాఘమాసమునుండి ఈ వ్యాపారము జరుగుతూ ఉన్నది. చైత్రమువరకు ఈలాగే జరిగేట్టుగా ఉన్నది. ఈ సంబంధములో హరలాల్ చేయవలసిన పని చాలా ఉండేది. హరలాల్ సాయంత్రము ఆఫీసునుండి ఇంటికి తరుచుగా ఆతి ఆలస్యముగా గాని రాలేకపోయేవాడు.

ఈలాగే ఒకనాడు ఇంటికి ఆలస్యముగా వచ్చేసరికి వేణు వచ్చి ఉన్నాడని విన్నాడు. తల్లి అతనికి భోజనము పెట్టి అతిముద్దుతో కూర్చోపెట్టింది. వేణూ ఆమే కబుర్లు చెప్తూ కొంటూ చాలాసేపు కూర్చోవడమువల్ల ఆమె మనస్సు మరింత ప్రేమతో నిండిపోయింది, వేణు ఆమె హృదయాన్ని మరింత ఆకర్షించడము మొదలు పెట్టాడు.

ఈలాగు మరి రెండుమూడు మార్లు జరిగింది. హర-లాల్ తల్లి అన్నది—"ఇంట్లో అమ్మ లేదు కదూ, అందుచేత అక్కడ ఉండబుద్ధిపుట్టదు అబ్బాయికి. వేణు నీ తమ్ముడని నాలోనేను అనుకొంటున్నాను, సాక్షాత్తు నాకడుపున పుట్టా-డు అనిపిస్తూంది నాకు, ఆ ప్రేమరుచి తగిలింది గనుక కేవలము

నన్ను 'అమ్మా' అని పిలవడానికి ఇక్కడికి వస్తూవుంటాడు."
ఈలాగు అంటూ పైటచెంగు కళ్లను ఒత్తుకొని కన్నీళ్లు
తుడుచుకొన్నది.

ఒకనాడు ఈలాగునే హరలాల్‌కి వేణుకి [illegible]డ్డాడు,
వేణు హరలాల్ కోసము కనిపెట్టుకొని ఉన్నాడు[illegible] మాట్లా-
డుతూ చాలా రాత్రివరకు ఇద్దరూ కూర్చున్నారు. వేణు
అన్నాడు, "ఇప్పుడు మా నాన్న సంగతి చూస్తే నాకు ఇంటి-
దగ్గిరఉండబుద్ధి పుట్టకుండా ఉన్నది. [illegible]ముఖ్యముగా ఒకమాట
అనుకుంటే నాకు మరీ కష్టముగా ఉన్నది. నాన్న తిరిగీ పెళ్లి
చేసుకొందామని చూస్తున్నాడు. రతిబాబు సంబంధము
కుదుర్చుకొని వచ్చాడట, ఎల్లప్పుడూ తానూ రతిబాబు
కూర్చొని ఆ కబుర్లే మాట్లాడుతూఉంటారు. మునుపు నేను
ఎక్కడికైనా బయటికి వెళ్లి త్వరగా ఇంటికి రాకపోతే నాన్న
గాభరాపడుతూఉండే వాడు. ఇప్పుడు మూడేసినాలుగేసి
రోజులు ఇంటికి రాకుండా బయటఉండిపోతే అడగనైనాఅడ-
గడు. నేను ఇంట్లోలేకపోతే సంతోషపడతాడని కూడా నా
నమ్మకము, నేను ఇంట్లోఉన్నంతసేపు పెళ్లిమాటలు కులాసాగా
జరగవు. నేను లేకపోతే కాస్త ఊపిరితిరుగుతుంది వాళ్లకు.
ఈ పెళ్లి అయితే మాత్రము నేను ఆ ఇంట్లో మరి ఉండలేను,
నాకు మీరు దారి ఏదైనా చూపించాలి, నాకు స్వాతంత్ర్య-
ము కావాలి."

హారలాల్ హృదయము దుఃఖముతోనూ, ప్రేమతోనూ నిండిపోయింది. దుఃఖసమయములో వేణు అందరినీ విడిచిపెట్టి తన మాస్టరుగారిదగ్గిరికి వచ్చాడు పాపము అనుకొంటూ హారలాల్ కొంత ఆనందము పొందాడు, అది చిక్కైన వ్యవహారములాగు ఉన్నదని చాలా భయముగా ఉన్నా. కాని మాస్టరుగారు చేయగలిగినది ఏమాత్రము!

"ఏలాగైనా సీమ వెళ్ళి బ్యారిస్టరీ పాసుఅయ్యి రాగలిగితే ఈచిక్కులోనుంచి విముక్తుడను అవుతాః మాస్టరు-గారూ.

" అధర్ బాబుగారు నిన్ను వెళ్లనిస్తారా?"

నేను ఇంట్లోనుంచి వెళిపోతే బ్రతికాను అను కొంటాడు నాన్న. కాని సొమ్ముమీద నాన్నకు గల మోహాము ఇంతా అంతా కాదు గనుక సీమవెళ్ళడానికి కావలసిన డబ్బు అతనిదగ్గిరనుంచి లాగడము సులభముకాదు, ఏదైనా ఎత్తు-మీద తీసుకురావాలి."

వేణుఊహాను చూచి మాస్టరుగారికి నవ్వువచ్చింది, నవ్వుతూ, "ఏమిటిఆ ఎత్తు?" అని అడిగారు.

వేణు అన్నాడు, "నేను ప్రోనోటుమీద డబ్బు తెస్తాను. ఆ డబ్బుకోసమని నామీద దావాపడితే తప్పించుకొనే మార్గము ఏదీ నాకు లేదు అని కనిపెట్టి నాన్న ఆ అప్పు

తీర్చేస్తాడు. ఆ రూపాయిలతో సీమవెళ్ళిపోతాను. నేను అక్కడికి వెళ్ళాక నా ఖర్చులకోసము రూపాయిలు పంపించ-కుండా ఊరుకోలేడు."

"నీకు అప్పు ఎవరు ఇస్తారు?"

"మీరు ఇవ్వలేరూ, మాష్టరుగారూ

హరలాలు ఆశ్చర్యపడుతూ, "నేనా!" అన్నాడు, నోటివెంట మరి మాట వచ్చింది కాదు.

"మీ దర్వాన్ పొట్లాలు కట్టి నోట్లూ, సంచులతో రూపాయిలూ, తీసుకువస్తున్నాడు?" అన్నాడు వేణు.

"ఆ దర్వాన్ నాదర్వాన్ అయినట్టుగానే ఆ నోట్లు నానోట్లు!" అని నవ్వుతూ అన్నారు మాష్టరుగారు.

ఆ రూపాయిల కథ వేణుకు అప్పుడు మాష్టరుగారు బోధపరిచారు, "ఒక రాత్రిపాటు దరిద్రుని ఇంట్లో ఆ[illegible]యము వాటికి, మర్నాడు ప్రొద్దున్నే పదివైపులా పారిపోతవి."

"మీ దొర నాకు అప్పుఇయ్యలేడూ, కావలంటే వడ్డీ జాస్తీగా ఇస్తాను?" అని వేణు అడిగాడు.

"మీ నాన్నగారు సెక్యూరిటీ ఉంటే నేను అడుగు-తున్నాను కదా అని ఇస్తే ఇయ్యవచ్చును."

"సెక్యూరిటీ ఉండేటట్లైతే రూపాయిలే ఇచ్చును నాన్న."

వాదన అక్కడదాకా వచ్చి అక్కడ ఆగిపోయింది. తనకు ఇల్లూవాకలీ ఏమైనా ఉంటే అది అమ్మేసి ఆ డబ్బు ఇచ్చి-ఉందును అని తనలో తాను అనుకొన్నాడు హరలాల్. కాని చిక్కంతా ఎందువల్ల నంటే ఇల్లూవాకలీ, భూమీపుట్రా ఏమీ లేవు.

౧౦

ఒక శుక్రవారము సాయంకాలము జోడుగుర్రాలబండి హీరలాల్ ఇంటి ఎదుటకు వచ్చి నిలబడ్డది. వేణు బండిలోనుంచి దిగగానే హరలాల్ దర్వాన్ బాగా వంగి సలాముచేసి గాభరాగాభరాగా మీదికివెళ్లి కబురుచెప్పాడు. హరలాల్ పడకగదిలో నేల కూర్చొని రూపాయిలలెక్క సరిచూస్తూ-ఉన్నాడు. వేణు మేడ ఎక్కి ఆ గదిలోకి వచ్చాడు. ఈవాళ కొత్తమోస్తరుగా దుస్తులు వేసుకొన్నాడు, షోకుగా కట్టుకొంటూఉండే దోవతీ కండువాకు బదులుగా ఈవాళ ఫార్సీ పంట్లామూ కోటూ వేశాడు, టోపీ పెట్టుకొన్నాడు. రెండు చేతులవేళ్లనూ ఉంగరాలు వజ్రాలూ కెంపులతో జిగ్ జిగ్ మంటూన్నవి. మెడలో బంగారపు వాచీగొలుసు, దానిచివరను తగిలించిఉన్న వాచీ జేబులో ఎత్తుగా కనబడుతున్నది. కమీజుచేతులకు ఉన్న వజ్రాలుతాపిన బొత్తాములు పైకి కనబడుతున్నది.

రూపాయిలు లెక్కపెట్టడము ఆపి హారలాల్ ఆశ్చర్యముతో, "ఇదేమిటి ఇది? ఇంత రాత్రివేళ ఈ వేషమేమిటి?" అని అన్నాడు.

వేణు అన్నాడు, "నాన్నకు రేపు పెళ్లి, ఆమాట నాకు తెలియకుండా దాచి ఉంచారు గాని నాకు తెలిసిపోయింది. మా బారక్‌పూర్ బంగళాలో కొన్నాళ్లు ఉండి వస్తానని చెప్పి వచ్చాను. వెళతానంటే నాన్న సంతోషపడుతూ ఒప్పుకొన్నాడు, అందుచేత మా బారక్‌పూర్ తోటఇంటికి వచ్చేశాను. మరి ఇంటికి వెళ్లవలెననే లేదు. సాహసము లేదుగాని గంగలోపడి చచ్చిపోదామని బుద్ధిపుడుతున్నది."

ఈలా' అంటూ అంటూ వేణు ఏడవడము మొదలు పెట్టాడు. హారలాల్ గుండెలో బల్లెముతో పొడిచినట్టు అయింది. ఎవరో పరాయిస్త్రీవచ్చి తనతల్లి గదిలో ప్రవేశిస్తుంది, తల్లి మంచముమీద పడుకుంటుంది, తల్లిస్థానము ఆక్రమిస్తుంది అనుకొంటూ వేణు ఎంతదుఃఖపడుతుంటాడో కదా! అందుచేత నే వేణుకు ఇల్లు కంటకమయము అయిపోయింది పాపము. ఈ బాధ వెళ్లి హారలాల్ హృదయానికి తగిలింది. బీదవాళ్లు కాకపోయినంతమాత్రాన ఈ లోకములో అవమానమూ, దుఃఖమూ ఉండవు అనుకోవడము ఉత్త భ్రమ అని హారలాల్‌కు అప్పుడు బాగా బోధపడ్డది. వేణుమనస్సును ఏవిధముగా శాంతపరచడమో హారలాల్‌కు తెలియలేదు. వేణుచెయ్యి

తనచేతితో పట్టుకొన్నాడు. ఆ చెయ్యివైపు చూడగానే, ఇంత దుఃఖముగా ఉన్నప్పుడు వేణు ఇంత ముస్తాబయి ఏలాగు రాగలిగాడో బోధపడడములేదు, అని హరలాల్ తనలో తాను అనుకొన్నాడు.

హరలాల్ తన ఉంగరాలవైపు చూస్తూఉండడము వేణు చూచాడు. మాష్టరుగారి మనస్సులోపుట్టిన సందేహము బోధపడ్డ దనుకొని, "ఈ ఉంగరాలు మా అమ్మవండీ మాష్టరు గారూ," అన్నాడు.

ఆమాట విని మాష్టరుగారు కళ్ల నీళ్లుపెట్టుకొన్నారు, అవి బొటబొట కారకుండా ఆపుకోవడము కష్టసాధ్య మయింది. కొంచెముసేపు అయిన తరువాత, "వేణూ, భోజన మయిందా?" అని అడిగారు.

"మీ భోజనము ఇంకా కాలేదూ?" అని వేణు అడిగాడు.

"రూపాయిలు లెక్కపెట్టి *ఐరన్ చెస్ట్ లో పెట్టనిదే భోజనానికి లేవను," అని అన్నారు మాష్టరుగారు.

"మీరు భోజనము చేసిరండి, నేను ఇక్కడ కూర్చుంటాను. అమ్మగారు మీకోసము కనిపెట్టుకొని ఉంటారు.

* ఇనప బీరువా.

హారలాల్ కొంచెముసేపు ఆలోచించాడు, చివరకు అన్నాడు, "నేను ఒక చిటికెలో భోజనము చేసేసి వస్తాను."

హారలాల్ తొందర తొందరగా భోజనముచేసి తల్లితో కూడా గదిలోకి వచ్చాడు. వేణు తల్లిపాదాలకు నమస్కా-రముచేశాడు; తల్లి వేణుబుగ్గలు నొక్కి ముద్దుపెట్టుకొన్నది. వేణుఅవస్థఅంతా వినడమువల్ల తల్లిగుండె బద్దలయిపోతూ ఉన్నది. తనహృదయములో ఉండే ప్రేమఅంతా ఇచ్చినా వేణు కొరత పోగొట్టలేను కదా అని ఆ తల్లిదుఃఖము.

నాలుగువైపులా పడిఉన్న రూపాయిలూనోట్ల మధ్య ముగ్గురూ కూర్చొని వేణుచిన్నప్పటి మాటలు అనుకోవడము ఆరంభించారు. మేష్టరుగారూ వేణూ కలిసిఉన్న రోజులు ఎంత మనోహరమయినవి! ఆనాటివి ఎన్నో సంగతులు జ్ఞాపకము వచ్చినవి. వేణుతల్లి వేణుకు కనపరిచిన అపరిమితప్రేమ మాట కూడా వచ్చింది.

ఈలాగు మాట్లాడుతూ చాలా రాత్రిదాకా కూర్చు-న్నారు. వేణు ఒకమాటు చప్పున వాచీ పైకి తీసి చూచి అన్నాడు, "ఈవాళకు ఇది చాలిద్దామండీ మాష్టరుగారూ, ఇంకా ఆలస్యముచేస్తే బండి తప్పిపోతాను."

"ఈవాళకు ఇక్కడ పడుకో బాబూ," అన్నది తల్లి, "ప్రొద్దున్నే లేచి ఇద్దరూ కలిసి వెళ్లవచ్చును."

"క్షమించండి అమ్మా, ఈరాత్రి మాత్రము నన్ను ఉండ మనకండి. ఈవాళ నేను వెళ్ళకతీరదు," అన్నాడు వేణు.

"మాస్టరుగారూ, ఈ ఉంగరాలూ, వాచీ మీదగ్గిరే ఉంచండి. మా తోటలోకి ఇవన్నీ తీసుకువెళ్ళడము మంచిది కాదు, తిరిగి వచ్చేటప్పుడు తీసుకొంటాను. నా బండిలో చర్మము బ్యాగ్* ఉన్నది, మీ దర్వానుతో చెప్పండి అది తీసుకురమ్మని, ఇవి అందులో పెట్టి ఉంచేస్తాను," అన్నాడు వేణు.

ఆఫీసు దర్వాను బ్యాగ్ తీసుకు వచ్చాడు. వేణు తన వాచిగొలుసూ, ఉంగరాలూ, బొత్తాములూ, మొదలైనవన్నీ ఆ బ్యాగులో ఉంచాడు. హరలాల్ చాలా జాగ్రత్తమనిషి, ఆబ్యాగ్ తీసుకువెళ్లి ఐరన్ సేఫ్‌లో పెట్టి తాళము వేశాడు.

వేణు హరలాల్ తల్లి పాదధూళి తీసుకొన్నాడు. ఆమె గొంతుకలోనుంచి మాట రాకుండా ఉన్నది, వేణును ఆశీర్వదించింది, "తల్లి జగదాంబ నీకు తల్లిఅయి నిన్ను రక్షించుగాక!"

తరువాత వేణు హరలాల్ పాదాలు ముట్టుకొని ప్రణామము చేశాడు. ఇంతకు ముందు ఎన్నడూ వేణు ఈలాగు

తో చేసిన చిన్న పెట్టె.

చేయలేదు. హరలాల్ ఏమీ అనలేదు, అతని వీపుమీద చెయ్యివేసి అతనితో కలిసి కిందికి వచ్చాడు. బండి లాంతర్లు వెలుగుతూఉన్నవి. గుర్రాలు తొందర పడుతూన్నవి! కలకత్తా గ్యాసులైట్లతో నిండి ఉన్న అంధకారములోనికి వేణును తీసుకొని బండి అదృశ్యమయిపోయింది.

హరలాల్ తన గదిలోకి వచ్చి చాలా సేపటివరకూ ఏమిచేయకుండా అలానే కూర్చున్నాడు. చివరకు ఒకపెద్ద నిట్టూర్పు వదిలి రూపాయిలు లెక్కపెట్టి వేరువేరు కుప్పలు చేసి సంచీలలో నింపాడు, నోట్లు ఇంతకుమునుపే లెక్కపెట్టి కట్టలుకట్టి ఐరన్ సేఫ్‌లో పెట్టిఉన్నవి.

ఇనపపెట్టె తాళాలు తలగడకింద నేపెట్టుకొని హరలాల్ ఆరూపాయిల గదిలోనే చాలా రాత్రి అయినతరువాత పడుకొన్నాడు. అతనికి బాగా నిద్ర పట్టలేదు; కలఒకటి వచ్చింది: వేణుతల్లి కనబడ్డది కలలో. పరదా వెనుకనుండి అతనిని తిడుతూఉన్నది. మాటలు స్పష్టముగా వినబడడములేదు. ఆ కెంపులలోనుంచీ, మాణిక్యాలలోనుంచీ, వజ్రాలలోనుంచీ కిరణాలుమాత్రము ఆనల్లని పరదాను పొడుచుకొని పైకివచ్చి ఆడుతున్నవి. హరలాల్ 'వేణూ' అని పిలుద్దామని బ్రహ్మాండమయినప్రయత్నముచేస్తూన్నాడు గాని నోటివెంట మాట రాకుండాఉన్నది. అటువంటప్పుడు పిడుగుపడ్డట్టు పెద్దశబ్దమేదో ఒకటిఅయింది. ఆపరదా తెగి పడిపోయింది. ఉలికిపడి హరలాల్

లేచాడు. అంధకారము స్తూపాకారముగా అన్నివైపులా కనబడుతున్నది. కిటికీతలుపు తోసేస్తూ జఫ్‌మని గాలి లోపలికి వచ్చేసరికి దీపము ఆరిపోయింది. హారలాల్ ఒళ్లు చమటలో మునిగిపోయిఉన్నది. చప్పున లేచి దీపము వెలిగించాడు హారలాల్. వాచీ చూచాడు, నాలుగు ఘంటలు అయింది. మరి నిద్రపోవడానికి వేళలేదు. రూపాయిలు పట్టుకొని రైలుకు వెళ్లడానికి సిద్ధముకావలెను.

హారలాల్ ముఖముకడుగుకొని తిరిగీ తన గదివైపు వెళుతూఉన్నాడు, తల్లిగదిలోనుంచి మాట వినబడ్డది; "లేచావురా, బాబూ?" అంటూఉన్నది తల్లి.

తెల్లవారగణ్లే మంగళదాయకమైన తన తల్లిముఖము ఆనాడు చూదామని హారలాల్ తల్లిగదిలోకి వెళ్ళాడు. కొడుకుచేసిన ప్రణామము అందుకొని తల్లి తనలోతాను కొడుకును ఆశీర్వదించి పైకి అన్నది, "బాబూ ఇప్పుడే నేను కలగన్నాను రా; నివ్వు కోడలును తీసుకురావడానికి వెళుతూ ఉన్నావని. తెల్లవారుఝామున వచ్చే కలలు ఎన్నటికీ అబద్ధము కావు రా బాబూ!"

హారలాల్ నవ్వుకొంటూ తన గదిలోకి వచ్చేశాడు. కింద కూర్చొని రూపాయిలసంచులూ, నోట్లకట్టలూ పెట్టెలో సరదడము మొదలుపెట్టాడు. మధ్య హఠాత్తుగా పని నిలిచి-పోయింది; హారలాల్ గుండెలో రాయిపడ్డది—రెండుమూడు

నోట్లసంచులు ఖాళీ! కలగంటున్నానా అనిపించింది హారలాల్ కు. మూతులు పట్టుకొని ఆ సంచులు ఇనపపెట్టెమీద కొట్టాడు, వాటిలో ఏమీ లేదు అని స్పష్టము, అయినా వదలకుండా ఆ మూడుసంచులూ మూతులు విప్పి తిరగవేసి చూచాడు. ఒకసంచిలో నుంచి చిన్న ఉత్తరాలు రెండు పడ్డవి, వేణు దస్తూరితో ఉన్నవి ఆ ఉత్తరాలు, ఒకటి హారలాల్ పేరా ఒకటి తన తండ్రి పేరా.

తొందరతొందరగా చదవడము మొదలుపెట్టాడు. ఏమిటి చదువుతున్నాడో తనకే తెలియడములేదు అని-పించింది. అక్షరాలు బాగా కనబడడములేదు. భాష మరిచి పోయినానా అనిపించింది అతనికి.

ఎలాగైతేనేమి రెండు ఉత్తరాలూ చదివాడు. వాటి సారాంశము ఏమిటి అంటే — మూడు వేలరూపాయిల పది రూపాయిలనోట్లు తీసుకొని వేణు సీమ వెళిపోయినాడు. స్టీమరు తెల్లవారు ఝామున బయలుదేరుతుందట. హారలాల్ భోజ-నానికి వెళ్లినప్పుడు వేణు ఈపని చేశాడు. "నాన్నకు కూడా ఒక ఉత్తరము వ్రాస్తున్నాను. ఈ అప్పు నాన్న దిద్దేస్తాడు, అది ఈలాగుఉంటూ ఉండగా—ఆ బ్యాగ్ విప్పితే అందులో మా అమ్మ నగలు కనబడతవి, వాటిఖరీదు నాకు సరీగా తెలియదు గాని మూడు వేలరూపాయిలకు జాస్తీ ఉంటుంది అనుకొంటాను. అమ్మే బ్రతికిఉండి, నేను సీమ వెళ్లడానికి

నాన్న నాకు డబ్బుఇవ్వనుఅంటే అమ్మ తన వస్తువులన్నీ అమ్మి నా ఖర్చులకు కావలసిన డబ్బుఅంతా ఇచ్చిఉండును. అమ్మ వస్తువులు నాన్న మరిఒకరికి ఇవ్వడము చూచి నేను ఎంత మాత్రము సహించలేను. అందుచేత తంటాలుపడి ఏలాగో ఆవస్తువులు నేనే తీసుకువచ్చేశాను. నాన్న మీాకుతక్షణము రూపాయిలు ఇవ్వనిపక్షమందు ఈ నగలు అమ్మో లేక తనఖా పెట్టో మీారు రూపాయిలు తెచ్చుకోండి. ఇవి మా అమ్మ వస్తువులు, గనుక నావస్తువులే!—ఇదికాక ఇంకా చాలా గ్రంథము వ్రాశాడు, గాని అదిఅంతా అప్రస్తుతము.

హారలాల్ తక్షణము గదికి తాళము వేసి బండిచేసుకొని స్టీమరు రేవుకు బయలుదేరాడు. వేణు ఏ స్టీమరులో వెళ్లాడో ఆ స్టీమరుపేరు కూడా హారలాల్‌కు తెలియదు. డాల్‌హౌసీ స్క్వేరు దాకా వచ్చేసరికి తెల్లవారకముందే రెండు స్టీమర్లు బయలుదేరి వెళిపోయినవని హారలాల్ విన్నాడు. రెండూ ఇంగ్లాండే వెళుతూఉన్నవట, ఆ రెండిటిలో దేనిలో వేణు ఉన్నాడో కనుక్కొనే సాధనను హారలాల్‌కు తెలియలేదు. ఇంతకూ కనుక్కున్నా ఆ స్టీమరును అందుకోవడము ఏలాగు?

ఆ స్క్వేరు దగ్గిరనుంచి హారలాల్ ఇంటివైపు తిరిగాడు. నాలుగువైపులా బాగా ఎండవచ్చింది. కలకత్తా పూర్తిగా నిద్రనుండి లేచిపోయింది. హారలాల్‌కు ఒంటిమీాద తెలివిలేదు. దేహమూ రూపమూ లేని ఒక భయంకరమైన ప్రతికూలతను

హారలాల్ తన శక్తిఅంతా ప్రయోగించి తోయవలెనని ప్రయత్నముచేస్తున్నాడు. ఆ ప్రతికూలత అన్నివైపులా నిండి ఉన్నది, ఎంతతోసినా రవంతైనా కదలకుండాఉన్నది. ఇంట్లో తల్లి ఉన్నది — ప్రతిరోజూ ఆ ఇంటికి వచ్చేసరికి ఒంట్లోని ఆయాసమూ, మనస్సులోని కష్టమూ పూర్తిగా ఒక్కక్షణ-ములో మాయమయిపోయేవి. ఆ ఇంటిముందరికి వచ్చి బండి నిలబడ్డది, బండివాడికి అద్దె ఇచ్చి పంపివేసి నిరాశతోనూ, భయముతోనూ కుంగిపోతూ ఇంట్లో ప్రవేశించాడు.

తల్లి అతి ఆతురతగా లోపున వరండాలో నిలుచోని ఉన్నది, కొడుకును చూడగానే, "ఎక్కడికి నాయనా, వెళ్లావు?" అని అడిగింది.

"నీకు ఒక కోడలిని జతపెట్టి తీసుకువద్దామని వెళ్లాను అమ్మా," అని అంటూ శుష్కకంఠముతో నవ్వి నిలుచున్న దగ్గిరే తెలివి తప్పి పడిపోయినాడు.

తల్లి "బాబోయి" "నాయనోయి" అంటూ, తలా నోరూ కొట్టుకొంటూ, పరుగెత్తివెళ్లి నీళ్లు తెచ్చి కొడుకు-ముఖముమీద కొట్టింది.

కొంచెముసేపు అయిన తరువాత హారలాల్ కళ్లు విప్పి శూన్యదృష్టితో నాలుగువైపులా చూస్తూ లేచి కూర్చున్నాడు. "అమ్మా, మరేమీ గాభరాపడకు, నన్నుమాత్రము కాస్సేపు

ఒంటరిగా కూర్చోనీ," అని అంటూ హరలాల్ లేచి గదిలోకి వెళ్లి లోపునుంచి గడియవేసుకొన్నాడు. బయట, తలుపుదగ్గిర, నేలమీద తల్లి చతికిలపడిపోయింది, ఫాల్గున మాసపుఎండ ఒంటినిండా పడుతున్నది. మూసిఉన్న తలుపు-మీద తల చారవేసుకొని తల్లి కూర్చున్నది; ఉండుండి, "హరలాల్, బాబూ హరలాల్," అని పిలుస్తూఉన్నది.

"ఇప్పుడే బయటకు వస్తాను. నివ్వు ఆ ఎండలో కూర్చోకు అమ్మా!" అని లోపునుంచి జబాబు మాటిమాటికీ వస్తూన్నది.

తల్లి అక్కడే ఆ ఎండలోనే కూర్చొని దేవుని ప్రార్థిస్తూఉన్నది తనలో తాను.

ఆఫీసుదర్వాన్ వచ్చి తలుపు కొట్టి, "బాబూ ఇప్పుడైనా బయలుదేరక పోతే బండి దొరకదు," అని కేకవేశాడు.

"ఈవాళ ఏడు ఘంటలబండిలో వెళ్లను," అని లోపు-నుంచే హరలాల్ జబాబు చెప్పాడు.

"అయితే మరి ఎప్పుడు వెళతారు?" అని అడిగాడు దర్వాన్.

"అది తరవాత చెపుతాను," అన్నాడు హరలాల్

దర్వానుకు ఏమీ బోధపడలేదు,—చేతులు జోడించుకొని తలతిప్పుకుంటూ కిందికి దిగిపోయినాడు.

హీరలాల్ తనలో తాను ఒకటేమాట తిరిగి తిరిగి అనుకుంటున్నాడు—"ఎవరితో చెప్పేది ఈమాట? ఇది చోరీ! వేణును జైలులో పెట్టించేదా?"

హఠాత్తుగా ఆ నగలమాట జ్ఞాపకమువచ్చింది—వాటి సంగతి పూర్తిగా మరిచే పోయినాడు. దారొకటి కనబడ్డది అనుకొన్నాడు ఇప్పుడు. బ్యాగ్ విప్పి చూచాడు, అందులో ఉన్నవి ఆ ఉంగరాలూ, వాచీ, గొలుసూ, గుండీలూ మాత్రమే కావు; పట్టెడా, జిగినీ, కొప్పుగొలుసూలూ, ముత్యాలహార-మూ, బంగారముగాజులూ, మొదలైన ఇంకాచాలాఖరీదుగల ఆభరణాలన్నీ ఉన్నవి. ఖరీదు మూడువేలరూపాయిలకంటె చాలా ఎక్కువఉంటుంది, గాని ఇదీ చోరీయే! ఇది వేణు చోరీకింద రాదు, ఆ బ్యాగ్ తన గదిలో ఉన్నంతసేపు తాను చేసిన చోరీ అవుతుంది.

మరి ఆలస్యము చేయకుండా వేణు అధర్‌బాబుకు వ్రాసిన ఉత్తరమూ, ఆ బ్యాగూ పట్టుకొని గదిలోనుంచి బయటికి వచ్చాడు.

"ఎక్కడికి వెళుతున్నావురా బాబూ?" అని తల్లి అడిగింది.

"అధర్ బాబుగారి ఇంటికి."

తల్లి గుండెమీద కూర్చొని ఉన్న ఆ పేరులేని భూతము, ఆ భయము, హఠాత్తుగా మాయమయిపోయింది, 'నిన్న రాత్రి,

విన్నాడు వేణు తండ్రి తిరిగి పెళ్లిచేసుకొంటాడు అని, అప్పటి నుంచీ బిడ్డడిమనస్సును దుఃఖముపట్టుకొన్నది. ఆహా, వేణు-అంటే వీడికి ఎంత ప్రేమ!' అని తనలో తాను అనుకొన్నది తల్లి.

"ఈవాళ, అయితే మరి, ఊరికివెళ్లవ్రూ?" అని అడిగింది తల్లి.

"వెళ్లను!" అని అంటూ అతి తొందరగా బయటికి వచ్చాడు.

హరలాల్ ఇంకా అధర్ బాబు గారి ఇంటిదాకా రాలేదు, దూరమునుంచి టకోరా మేళము వినబడుతున్నది—'ఆలెయా,' రాగమువిూద సనాయితో పాడుతూఉన్న ఆలాపన వచ్చి చెవినిపడి మనస్సును కరిగిస్తూఉన్నది. మెల్లి మెల్లిగా హరలాల్ అధర్ బాబుగారిఇంటికి వచ్చాడు. లోపలికి వెళ్లేసరికి పెళ్లి సరదాలతో కలిసి ఏదో అశాంతిలక్షణముకూడా కనబడుతూ-ఉన్నది. అతి కఠినముగా ఫారా జరుగుతూఉన్నది; నౌకర్లనూ చాకర్లనూ పైకి వదలడములేదు; భయమూ విచారమూ ప్రతివాని ముఖాన కనబడుతూఉన్నది. హరలాల్ నౌకర్లను అడిగి సమాచారము తెలుసుకొన్నాడు: రాత్రి చాలా ఖరీదు-గల నగలు చోరీపోయినవట, ముఖ్యముగా అనుమానిస్తూ-ఉన్న ఇద్దరు ముగ్గురు నౌకర్లను పోలీసువాళ్లకు—అప్ప చెపుదామని ఆలోచిస్తూఉన్నారట.

హరలాల్ మేడమీదికి వెళ్లాడు. అధర్ బాబు వరండాలో కూర్చొని ఉన్నాడు, కోపముతో మండిపడిపోతూ-

న్నాడు. రతిబాబు పక్కను కూర్చొని గుడుగుడు పీలుస్తూ-న్నాడు. అధర్ బాబును చూచి, "మీతో రహస్యముగా కొంచెము మాట్లాడవలసి ఉన్నది," అని హారలాల్ అన్నాడు.

అధర్ బాబు అగ్నిహోత్రుడయిపోయి అన్నాడు, నీతో రహస్యాలు మాట్లాడడానికి నాకు ఇప్పుడు వేళలేదు, చెప్పవలసినదేదైనా ఉంటే ఇక్కడే చెప్పు."

హారలాల్ ఏదైనా సాయము కావాలెననో లేక అప్పు ఇవ్వమని అడగడానికో ఈలాంటప్పుడు వచ్చాడు అని అధర్ బాబు అనుకొన్నాడు. రతికాంత అన్నాడు, "నాఎదుట బాబుగారితో ఏమైనా చెప్పడానికి మీకు సంకోచముగా ఉంటే నేను అవతలికి వెళిపోతాను."

చికాకుపడుతూ అధర్ బాబు, "అహా! నువ్వు కూచో!" అని అన్నాడు.

"నిన్న రాత్రి వేణు ఈ బ్యాగ్ మాఇంట్లో ఉంచి వెళి-పోయినాడు," అని హారలాల్ అన్నాడు.

"బ్యాగ్ లో ఏమి ఉన్నది?"

హారలాల్ బ్యాగ్ విప్పి అధర్ బాబుచేతికి ఇచ్చాడు.

"మాష్టరూ శిష్యుడూ కలిసి మంచి వ్యాపారము మొదలు పెట్టారే !" అన్నాడు అధర్ బాబు. "చోరీమాల్

అమ్మబోతే పట్టుకొంటారు అని తెలుసును, అందుచేత తెచ్చి ఇచ్చేశావు! నీ మంచితనము చూచి కట్నముకూడా ఇస్తా ననుకొంటున్నావు కదూ?"

అప్పుడు వేణు వ్రాసిన ఉత్తరము తండ్రి చేతులో పెట్టాడు హారలాల్. చదివి అతను మరింత మండిపడిపోయి-నాడు, "పోలీసువాళ్లకు రిపోర్టు ఇస్తాను," అన్నాడు. "మా వాడు ఇంకా మేజరు కాలేదు. దొంగతనముచేసి అతనిని సీమ పంపించావు. అయిదు వందలరూపాయిలు వాడిచేతిలో-పెట్టి ఉంటావు, మూడువేలు అని వ్రాయించావు, ఈ అప్పు నేను తీర్చాలేమి?"

"నేను అప్పు ఇవ్వలేదు," అని అన్నాడు హారలాల్

"అయితే వాడికి రూపాయిలు ఎక్కడివి? నీపెట్టె విరగకొట్టి తీసుకొన్నాడు గాబోలు!"

హారలాల్ ఆ ప్రశ్నకు జబాబు ఇవ్వలేదు. రతి కళ్లు మిటకరిస్తూ అన్నాడు, "అతనిని అడగి చూడండి, అయిదు వందల రూపాయిలైనా కళ్లతో ఎప్పుడైనా చూచాడేమో?"

ఏది ఏలాగైనా, అధర్ బాబు ఆ చోరీ వ్యవహారము ఈవిధముగా తేలినదాకా వేణుమాట ఆలోచించలేదు. తరు-వాత కొంచెముసేపు వేణు పారిపోవడముగురించి సందడి చేశాడు. హారలాల్ ఆ అపరాధమంతా తన నెత్తిమీదనే వేసుకొని బయటికి వచ్చేశాడు.

పైకి వచ్చి రోడ్డుమీద పడ్డాడు ఒంటిమీద మరి తెలివి లేదు, ఆలోచించడానికి గాని భయపడడానికిగాని శక్తి మరి లేదు. దీని పర్యవసానము ఏమి కాగలదు అనైనా ఆలో-చించ లేదు.

హారలాల్ ఇంటికి వస్తూఉన్నాడు, సందు తిరిగే సరికి తన ఇంటి ఎదుట గుర్రపుబండి ఒకటి కనబడ్డది, చూచి ఉలికి పడ్డాడు. వేణు తిరిగి వచ్చేసిఉంటాడు, వేణే అయిఉంటాడు తప్పదు అనుకొన్నాడు. ఆ ఆపద ఆలాగు కదలకుండా కూర్చొని చివరకు పీక పట్టుకోవచ్చును అని అతను ఊహించ-నైనా లేకపోయినాడు.

త్వరత్వరగా బండిదగ్గిరికి వచ్చిచూచాడు. అందులో తనఆఫీసుదొరలలో ఒకదొర కూర్చొని ఉన్నాడు. హారలాల్‌ని చూస్తూనే దొర బండిలోనుంచి దిగి హారలాల్‌ని చెయ్యిపట్టు కొని ఇంట్లోకి తీసుకొని వెళ్లి, ఈవాళ ఊరికి వెళ్లలేదేమని అడిగాడు.

దర్వాన్‌కు ఏదో సందేహము కలిగి ఆఫీసుకు వెళ్లి పెద్ద దొరిగారితో చెప్పాడు, ఆయన ఇతనిని పంపించాడు.

"మూడు వేలరూపాయిల నోట్లు కనబడకుండా ఉన్నవి, అని హారలాల్ అన్నాడు.

"ఏ మయినవి?" అని దొర అడిగాడు.

"నాకు తెలియదు," అన్నైనా బజాబు ఇవ్వలేకపోయినాడు హారలాల్, మాట్లాడకుండా నిలుచున్నాడు.

"రూపాయిలు ఎక్కడున్నవి, చూదాము పదండి," అన్నాడు దొర.

హారలాల్ అతనిని మీదిగదిలోకి తీసుకు వెళ్లాడు. దొర ఆరూపాయలు లెక్కపెట్టి చూచాడు. నాలుగు మూలలలా వెతికాడు, తిరగాబోర్లావేశాడు, ఇంట్లోనున్న ప్రతిగదిలోకీ వెళ్లి, మూల మూలల తనిఖీచేశాడు. ఈ వ్యాపారమంతా చూచి తల్లి మరి ఊరుకోలేకపోయింది. దొరగారిముందర పైకికనబడిపోయి గాభరాపడుతూ, "ఏమిటి అయిందిరా బాబూ, హారలాల్," అని అడిగింది.

"రూపాయిలు చోరీపోయినవి," అన్నాడు హారలాల్.

"చోరీ ఏలాగు పోతుందిరా బాబూ? ఎవరు-ఈలాగు మన కొంపముంచారు రా, హారలాల్!"

"ఊరుకో అమ్మా నువ్వు!" అన్నాడు హారలాల్. వెతకడము పూర్తిఅయినతరువాత, "రాత్రి ఈ గదిలో ఎవరు ఉన్నారు?" అని దొర అడిగాడు.

"తలుపు గడియవేసుకొని నేను ఒక్కడినే లోపున పడుకున్నాను."

దొర రూపాయలు బండిలో పెట్టించి, "పెద్దదొరగారిదగ్గిరికి వెళదాము రండి," అని అన్నాడు.

దొర హరలాల్‌ను తనతో కూడా తీసుకువెళ్లడము తల్లి చూచి దారికి అడ్డముగా వచ్చి అన్నది, "నా కొడుకును ఎక్కడికి తీసుకువెళుతున్నారు బాబూ? నేను తినడముమాని వాణ్ని పెద్దవాడినిచేసాను; వాడు పైవాళ్ల సొమ్ము ఎన్నడూ ముట్టుకోడు."

దొరకు ఇంగ్లీషుతప్ప వేరేభాష రాదు, తల్లిమాట బోధపరుచుకోకుండా, "అచ్ఛా, అచ్ఛా," అన్నాడు.

హరలాల్, "అమ్మా నువ్వు ఎందుకు గాభరాపడుతున్నావు, పెద్దదొరగారితో మాట్లాడి ఇప్పుడే వస్తాను!" అని అన్నాడు.

"నువ్వు ప్రొద్దున్ననుంచి నోట్లో నీళ్లైనా పోసుకోలేదు రా బాబూ!" అని ఏడుస్తూ అన్నది తల్లి.

హరలాల్ దానికి ఏమీ జబాబుఇవ్వలేదు. బండిఎక్కి వెళిపోయినాడు, తల్లి మొరపెడుతూ నేల మీద పడిపోయింది.

"జరిగిన దంతా సరిగా నాతో చెప్పేయి, హరలాల్," అని పెద్దదొరగారు అన్నారు.

"రూపాయిలు నేను అపహరించ లేదు." అన్నాడు హరలాల్.

"ఆ మాట నాకు తెలుసును, గాని ఆ రూపాయిలు ఎవరు తీశారో నువ్వు ఎరుగుదువు!"

దానికి హరలాల్ ఏమీ జబాబు చెప్పకుండా ముఖము వాల్చుకొని కూర్చున్నాడు.

"నీవెరికలో ఎవరైనా ఆ రూపాయిలు తీశారా?"

"నాలో ప్రాణము ఉంటూఉండగా నాకు తెలిసి నేను ఎవరినీ ఆ రూపాయిలు ముట్టుకోనివ్వను."

దొరగారు అన్నారు—"చూడు హరలాల్, నిన్ను నమ్మి ఈ పూచీఅయిన పని జామీను లేకుండా నీకు ఇచ్చాను. అందువల్ల నేను ఆఫీసులో అందరి విరోధానికి పాత్రుడైనాను. మూడు వేలరూపాయలు ఒక గొప్పసంగతి కాదు. కాని నాకు మట్టుకు చాలా సిగ్గుతెప్పిస్తావు. ఒక రోజు వ్యవధి ఇచ్చాను ఏలాగు తెస్తావో తెచ్చి ఆ రూపాయిలు పూర్తిచేసేయి. ఆలాగయితే మరి దానిమాట ఎత్తను, నీవు ఎప్పటిలాగు పనిచేసు కుందువుగాని."

ఆ మాటలు అంటూ దొరగారు లేచిపోయినారు. అప్పటికి పదకొండు ఘంటలయింది. హరలాల్ తలవంచుకొని బయటికి వచ్చాడు. గుమాస్తాలు ఆఫీసుకు అప్పుడే వస్తూన్నారు. హరలాల్‌కు జరగబోయే శాస్తినిగురించి అతి ఉత్సాహముతో వాదిస్తూఉన్నారు.

హరలాల్‌కు ఇంకొకరోజు వ్యవధి దొరికింది. హరలాల్ నిరాశలో మునిగి, అట్టడుగున బురద కెలుకుతూఉండవలసిన సమయము ఒక అనంతమయిన రోజుగా పెరిగింది.

'ఏమిటి ఉపాయము? ఏమిటి ఉపాయము? ఏమిటి ఉపాయము?—అని ఆలోచిస్తూ రోడ్డుమీద ఎండలో తిరగడము మొదలుపెట్టాడు. కొంతసేపటికి ఉపాయము ఉన్నదో లేదో ఆ ఆలోచన ఆగిపోయింది, గాని తిరగడము మాత్రము ఆగలేదు. వేలకొలది మనుష్యులకు ఆశ్రయస్థానమైన కలకత్తా ఆనాడు హారలాల్ కంటికి విశ్వవ్యాప్తమైన ఒక ఉరియంత్రము వలె కనబడ్డది. అందులోనుంచి పైకివెళ్లడానికి దారి ఎక్కడా కనబడలేదు. ఆ ప్రపంచములో ఉన్న జనసమూహము హారలాల్‌ను ఎటూ వెళ్ళనియ్యకుండా నాలుగువైపులా అడ్డుగా నిలుచొని ఉన్నది. ఎవరూ అతనిని ఎరగరు, ఎవరికీ అతనిమీద ద్వేషములేదు, గాని ప్రపంచములో ఉండే ప్రతివాడూ అతని శత్రువే! దారిపోయేవాళ్లు అతనిని రాసుకొని పక్కనుంచి వెళిపోతూఉన్నారు. ఆఫీసులలోనుంచి గుమాస్తాలు బయటికి వచ్చి మిఠాయిదుకాణాలలో ఫలహారముచేస్తూన్నారు. కాని ఎవరూ ఇతనివైపు చూడనైనా చూడలేదు. మైదానముపక్కను చెట్లకింద, అలసిపోయిన బాటసార్లు తలకిందచేతులుపెట్టుకొని కాలుమీదకాలు వేసుకొని పడిఉన్నారు. అద్దెజట్కానిండా కూర్చొని హిందూస్తానీ స్త్రీలు కాళీగుడికి వెళుతూన్నారు. చప్రాసీ ఒకడు హారలాల్ దగ్గిరికి ఉత్తరముఒకటి తీసుకువచ్చి, అతనికీ తక్కిన బాటసారులకూ ఎటువంటి వ్యత్యాసమూ లేదు అన్నట్టుగా, పైవిలాసము చదవమని చూపించాడు—హారలాల్ అది చదివి ఆ ఇల్లుఎక్కడో అతనికిబోధ పరిచాడు. మరికాస్త-

సేపుఅయినతరువాత ఆఫీసులు మూసేవేళ అయింది. ఆఫీసుల నుంచి బళ్లు నాలుగువైపులా ఇళ్లకు వెళుతూఉన్నవి. ఆఫీసులలో నుంచి వచ్చి ట్రాముఎక్కి నాటకమునోటీసులు చదువుకొంటూ అంతాఇళ్ళకు వెళుతూఉన్నారు. ఈవాళనుంచి హారలాల్‌కు ఆఫీసులేదు, సెలవులేదు, ఇంటికి వెళ్లడానికి ట్రాము ఎక్కడామని తొందరలేదు. కలకత్తాలో తనచుట్టూ జరుగుతూఉన్న పనిపాటులూ, రాకపోకలూ, కనబడుతూఉన్న ఇళ్లూవాకళ్లూ, బళ్లూబగ్గీలూ—వీటన్నిటిలో భయంకరమైన నిజమొకటి ఉన్నది అన్నట్టు అనిపించేది, ఒకమాటు; మరిఒకమాటు ఇవన్నీసారహీనములైన వట్టికలలు అనిపించేది. ఆహారము లేకుండా, విశ్రామము లేకుండా, ఉండడానికి జాగా లేకుండా ఆ రోజంతా హారలాల్ ఏలాగు గడిపాడో అతనికే తెలియలేదు. వీథివీథినీ గ్యాసులైట్లు వెలుగుతూఉన్నవి. మెలకువగొన్న అంధకారము క్రూరమైన తన సహస్రనేత్రాలను తెరిచి రక్తపానము చేయగోరుతున్న దానవునివలె నాలుగువైపులూ చూస్తున్నదా అనిపించింది. ఎంతరాత్రిఅయి ఉంటుంది అని అయినా హారలాల్ ఆలోచించలేదు. ముఖముమీద రెండు పక్కలాఉన్న రక్తశిరాలు ధగ్ ధగ్‌మని కొడుతూఉన్నవి, తల పగిలిపోతుందా అనిపిస్తూన్నది. ఒంట్లోమంటలు పుడుతూఉన్నవి. కాళ్లలో మరి నిలబడడానికైనా శక్తిలేదు. వేదనవల్ల ఒకవిధమైన ఉద్రేకము పుడుతూఉన్నది, దుఃఖము భరించలేనంతది కావడమువల్ల బాధపడే శక్తికూడా పోతూఉన్నది—ఈనాడు ఉదయమునుంచీ

దానితరువాతఇదీ దీనితరువాత అదీ జరుగుతూనే ఉన్నది, కాని వాటి అన్నిటిమధ్యనుంచిమాత్రము తల్లిమాట ఒక్క క్షణ-మైనా వదలకుండా వస్తూఉన్నది. కలకత్తాలోఉండే లెక్కలేని మనుష్యులమధ్యను అతని శుష్కకంఠమును భేదించుకొని అమ్మా, అమ్మా, అమ్మా, అనేమాటలు పైకి వస్తూఉన్నవి. హారలాల్ మరి దేనినీ కోరలేదు, మరి ఎవరినీ కోరలేదు— 'బాగా రాత్రిపడుతుంది, అప్పుడు ఈ దీనుని, ఈ ఊరూ పేరూ-లేని హారలాల్‌ను, అకారణముగా అవమానపరచడానికి ఎవ-రూ మేలుకొని కూర్చోరు, అటువంటప్పుడు అమ్మదగ్గిరికి మెల్లి-గా వెళ్లి మాట్లాడకుండా అమ్మఒళ్లో తలపెట్టుకొని నిద్రపో-దాము—మరి ఆనిద్రనుంచి ఎన్నటికీ లేవవద్దు,' అనుకొంటాడు. కాని పోలీసు వాళ్లుగాని మరెవరుగాని తనను తన తల్లి ఎదుట అవమాన పరుస్తారేమో అనే భయముచేత తల్లిదగ్గిరికి వెళ్ల-లేకపోయినాడు. హారలాల్‌కు మరి నిలబడడానికైనా కాళ్ళ-లో బలములేదు, అప్పుడు అద్దెగాడీ ఒకటి కనబడ్డది. ఆ బండిని పిలిచాడు. గడ్‌వాన్ ఎక్కడికి వెళతారని అడిగాడు.

"ఎక్కడికీ వెళ్లను, కొంచెముసేపు ఈ మైదానము మీద గాలికోసము తిరుగుతాను,'' అని అన్నాడు హార-లాల్.

బండివాడు ఆ మాట నమ్మలేకపోయినాడు, వెళిపో-బోతూఉంటే, హారలాల్ వాడిని పిలిచి అద్దెలో ఒకరూపాయి

ముందుగానే వాడిచేతిలో పెట్టాడు. హారలాల్‌ను బండి ఎక్కించి ఆ మైదానము చుట్టూ తిప్పడము మొదలుపెట్టాడు.

హారలాల్‌కు కొంచెము శాంతి కలిగింది, కిటికీతలుపు దించి వేడెక్కిఉన్న తనతలను కిటికీమీద వాల్చి కళ్లు మూసు-కొన్నాడు. అతని బాధంతా కొంచెము కొంచెముగా దూరము కాసాగింది. ఒళ్లు చల్లబడుతున్నది. మనస్సుకు ఒకవిధమైన ఆనందమును కలుగజేస్తూ శాంతి అతని మనస్సును మూల-మూలలనుంచి నింపుకొని వస్తూఉన్నది. పరిత్రాణము నాలుగు వైపులా ఆక్రమించుకువచ్చి తనను కాగలించుకొంటున్నదా అనిపించింది. తనకు ఎటువెళ్లడానికీ దారి లేదు, ఎటువంటి సహాయమూ లేదు, మోక్షము లేదు, తనకు జరుగుతూఉన్న అవమానానికి అంతము లేదు, అని ఆనాటిఉదయమునుంచీ అనుకొంటున్నాడు—ఒక్కక్షణములో అదంతా కేవలము మిథ్యఅయిపోయింది. అదంతా ఉత్త భయము, నిజముకాదు, అని ఇప్పుడు తెలుస్తూఉన్నది. తమ ఉక్కుపిడికిళ్లలో పట్టుకొని హారలాల్‌జీవనాన్ని ముద్దచేసేయాలని ప్రయత్నముచేస్తూ-ఉన్నవాళ్లకు అతను మరి జడవడు. ఇప్పుడు పృథ్వీఅంతటా వ్యాపించిఉన్నది ముక్తి, స్వేచ్ఛ, అనంతమైన శాంతి. అన్యా-యమూ, అవమానమూ, దుఃఖమూ — వీటిమధ్యను హార-లాల్‌ను కట్టిపెట్టి ఉంచగలిగిన రాజులుగాని మహారాజులుగాని పృథ్వీమీద లేరు. అతనిని చుట్టుకొనిఉన్న భయము

ఆతనిని వదలివేసింది. దారిద్ర్యావస్థలో ఉన్న తల్లి, చూస్తూ ఉండగానే మెల్లిమెల్లిగా పెద్దదయి ఆఖరికి ఒక విరాట్టు రూపము ధరించి ఆకాశానఉన్న అంధకారాన్ని నింపి ఆతని భయవిముక్తమయిన హృదయాన్ని కౌగలించుకొంటూ-ఉన్నదని హారలాల్‌కు అనిపించింది. ఆ తల్లి ఎందులోనూ ఇమడకుండా ఉన్నది, అన్నిటినీ నింపివేస్తూఉన్నది. కల-కత్తాలోఉన్న రోడ్లూ, ఇళ్లూ వాకళ్లూ, దూకాణాలూ, అన్నీ ఒక్కొక్కటి ఆమెలో అదృశ్యమయి పోతూఉన్నవి. గాలి ఆమెతో నిండి పోతూఉన్నది, ఆకాశము నిండిపోతూఉన్నది నక్షత్రాలన్నీ ఒక్కొక్కటి ఆమెలో కలిసిపోతూఉన్నవి హారలాల్ ఒంట్లో ఉండే బాధా, మనస్సులో ఉండే దుఃఖమూ కొంచెముకొంచెముగా ఆ తల్లిలో మాయమయిపోతూఉన్నవి. ఇదుగో, చివరకు ఆ వేడిఆవిరితో నిండిఉన్న బుడగకూడా బద్దలయిపోయింది. ఇక మరిఏమీ లేదు — అంధకారము లేదు, వెలుతురు లేదు; ఉన్నదంతా ఒక గాఢమైన పరిపూర్ణత మాత్రమే!

ఘాదిరీగుడిఘడియారము ఒంటి ఘంటకొడుతూఉన్నది. చీకటిలో ఆ మైదానముచుట్టూ బండి తిప్పితిప్పి చివరకు చికాకుపడుతూ బండివాడు, "బాబూ, గుర్రము మరి నడవదు, ఎక్కడికి దిగబెట్టుమంటారో చెప్పండి," అని అన్నాడు.

లోపునుంచి జబాబు లేదు. గడ్వాన్ కోచ్ బాక్సు మీదనుంచి దిగి హారలాల్ని కదిపి తిరిగీ అడిగాడు, జబాబు లేదు. గడ్వాన్కు భయము వేసింది, తలుపుతీసి చూచాడు, హారలాల్ ఒళ్లు కర్రకట్టిపోయింది, ఊపిరి నిలిచిపోయింది.

ఎక్కడికి దిగబెట్టమంటారు అనే ప్రశ్నకు జబాబు మరి హారలాల్ దగ్గిరనుంచి రాలేదు.

౧౯౦౭

బండతోలేవాడు కూర్చోడానికి ఎత్తుగా ముందునఉండేభాగము.

# భార్యవ్రాసిన ఉత్తరము

పెళ్లిఅయి ఇప్పటికి పదిహేనుసంవత్సరాలు అయింది గాని ఇంతవరకు మీాకు నేను ఒక్క ఉత్తరమైనా వ్రాయలేదు. ఎప్పుడూ ఒక్కచోటనే ఉండడముచేత నోటిమాటలే అవుతూ ఉన్నవి—మీారు లెక్కలేనన్ని అన్నారు, నేనూ అన్నాను, ఒక్క ఉత్తరము వ్రాసేపాటైనా ఖాళీ దొరకలేదు.

ఇప్పుడు నేను యాత్రకని శ్రీజగన్నాథం వచ్చాను మీారు మీా ఆఫీసు పనిలో ఉన్నారు. నత్తకు గుల్ల ఏలాగో మీాకు కలకత్తా ఆలాగు — అది మీా మనస్సుకూ ఒంటికీ అంటుకొని మీాతో ఏకమయిపోయింది. అందుచేతనే మీారు సెలవుకు దరఖాస్తు చేయలేదు. నాకు సెలవు దొరకవలెనని ఈశ్వరేచ్ఛ గనుక నామనవిపైని సెలవు దొరికింది.

నేను మీాఇంటికి రెండవకోడలిని. 'ఇదికాక జగత్తు-తోనూ, జగదీశ్వరునితోనూ నాకు సంబంధము ఉన్నదని ఈ సముద్రముఒడ్డున నిలువోని పదిహేనుసంవత్సరా లైన తరువాత ఇప్పుడు పోల్చుకున్నాను. అందుచేతనే సాహసించి ఈఉత్తరము వ్రాస్తున్నాను; ఇది మీా రెండోకోడలు వ్రాసిన ఉత్తరముకాదు.

ముందుకు మీతో నాకు కలుగబోయే సంబంధము గురించి నానొసటివ్రాతవ్రాసిన ఈశ్వరునికి తప్ప ఇంకెవరికీ తెలిసి ఉండదు, అంతచిన్నవయస్సప్పుడు నాకూ మాచిన్నతమ్ముడికీ, ఇద్దరికీ ఒక్కమారే టైఫాయిడుజ్వరము వచ్చింది. మాతమ్ముడు చచ్చిపోయినాడు, నేనుమాత్రము బ్రతికిఉండిపోయినాను. 'మృనాళి ఆడపిల్ల గనుక బ్రతికింది, మొగవాడైతే బ్రతుకునా?' అని మా ఊళ్లో ఆడవాళ్లంతా అన్నారు. యముడు చోరీ విద్యలో బాగాపండిపోయినవాడు, ఎప్పుడూ అతనికి కావలసి-నది విలువగలవస్తువులు మాత్రమే!

నాకు చావులేదు. ఆమాట బాగా బోధపరచి చెప్ప-వలెనని నిశ్చయించుకొని ఈ ఉత్తరము వ్రాస్తున్నాను.

వరసకు మీకు మామ అవుతాడట ఎవరో, ఆయన మీ స్నేహితుడు 'నిరద్'ను తీసుకొని పెళ్లికూతురిని చూడ-డానికి మా ఇంటికి వచ్చేసరికి నాకు పన్నెండేళ్లు—మా ఇల్లు ఒక అడవిప్రదేశము మధ్యనున్నది, అక్కడికి రావడము అతి కష్టము. పట్టపగలు నక్కలు అరుస్తూ ఉంటవి. మా ఇంటికి రావలెనంటే స్టేషన్‌నుంచి ఏడుక్రోసులు ఎడ్లబండిమీద వచ్చి తతిమ్మా మూడుమైళ్లూ *నాటుదారిని పల్లకీమీద రావలెను. వచ్చిననాడు మీరు ఎంత ఆయాసపడ్డారు! దానిమీద మన బంగాలీవంట—ఆవాళనాటి ప్రహసనము ఇప్పటికీ మామామ మరవలేదు.

* పక్కారోడ్డు లేనిచోటఉండే దారి.

పెద్దకోడలికి రూపు లేదన్న లోటు పూర్తి చేదామని మీ అమ్మ నిశ్చయించుకొని కూర్చున్నారు. లేకపోతే అంతకష్టపడి ప్రపంచముతో సంబంధము లేకుండా లోపున ఎక్కడో ఉన్న మా పల్లెకు మీ రెందుకు వస్తారు! బంగాళా దేశములో కడుపులో బల్లా, శూలనొప్పీ ఎంతఅరుదో పెళ్లికూతుళ్లుకూడా అంతే అరుదు, మనము వెదకనక్కర లేకుండా వారంతట వారే వచ్చి మనకాళ్లమీదపడతారు, తరువాత మనను వదలమన్నా వదలరు.

నాన్న గుండె ధగ్ ధగ్ మని కొట్టుకోవడ మారంభించింది. అమ్మ దుర్గనామస్మరణ చేయడము ప్రారంభించింది, ఊళ్లో ఉండే దేవుళ్లను ఎట్లా సంతోషపరచడము అని ఆలోచిస్తూఉన్నది. ఆడవాళ్లకుఉండే దన్ను అంతా తమ అందమే, గాని ఆ అందమనేది తమచేతిలోనిది కాదు—అనగా పిల్లను చూడడానికి వచ్చినవారు ఇచ్చినవిలువే ఆ అందముయొక్కవిలువ. అందుచేతనే ఆడపిల్లలకుండే భయమూ, సంకోచమూ ఏవిధానా పోదు.

ఇంట్లోఉండే అందరిభయమూ—ఇంట్లోవాళ్లదే కాదు, ఊళ్లోవాళ్లందరి భయముకూడనూ— ఒక పెద్ద రాయిఅయి నాగుండెమీద కూర్చున్నది. అంతరిక్షానఉన్న దేవతలూ, పృథ్వీమీద వ్యాపించిఉన్న శక్తీ, ఈ రెండూ కలిసి ఒక పన్నెండేళ్ల పల్లెటూరిపిల్లను పట్టుకొని చూడడానికివచ్చినవారి

కళ్లఎదుట నిలబెట్టి ఉంచినవి. వాటిని తప్పించుకొని ఎక్కడికి పారిపోగలను?

ఏలాగైతే నేమి మీ ఇంటికి వచ్చి చేరాను. ఆడక్క-లంతా కలిసి నా లోపాలన్నీ జాగ్రత్తగా చూచి, లెక్కచేసి, చిట్టచివరకు ఒప్పుకున్నారు, నేను మొత్తముమీద అందమైన దానను అని. ఆ మాట వినగానే పెద్దకోడలు ముఖము వాడి-పోయింది. కాని నాకు రూపుతో అవసరము ఏమిఉండెను అని ఆలోచిస్తూఉన్నాను. రూపుఅనేది చాదస్తపు పండితుడెవడో గంగానది మట్టితో చేసిన వస్తువేదైనా అయితే దానికి కావలసినంత ఆదరము ఉండును. కాని అది ఈశ్వరుడు కేవలము తన ఆనందము కోసము పుట్టించినది, దానికి మతముతోనూ నీతితోనూ నిండిఉన్న మీఇంట ఏమి విలువ ఉన్నది?

నా రూపు మరిచిపోడానికి మీకు అట్టేరోజులు పట్ట-లేదు. కాని నా స్వభావము మాత్రము మీకు ఎన్నటికీ మరపుకురాదు. నాలోఉన్నగుణము మహాగట్టిది, మీఇంటి వంటిఇంట్లో ఇన్నాళ్లో ఉన్నా అది ఇంకా బ్రతికే ఉన్నది. నా స్వభావము చూచి మాఅమ్మ చాలా భయపడుతూ ఉండేది, ఆడవాళ్ళకు అటువంటిబుద్ధి ఉంటే చాలా చిక్కు కదా! నిబంధనానుసారము నడుచుకొంటూ ఉండవలసినవాళ్లో స్వబుద్ధిని వినియోగించి నడుచుకోవడమువల్ల కలిగినలాభము

తోకర్లు తినితిని చివరకు నెత్తిపగలగొట్టుకోవడమే. దానికి నే నేమి చేయగలను చెప్పండి? మీ ఇంటి కోడలికి ఉండవలసిన బుద్ధికంటె అనేకరెట్లు హెచ్చు బుద్ధి భగవంతుడు, ఆలోచన లేకుండా, నామీద పారేశాడు. అది నేను ఇప్పుడు ఎవరికి ఇచ్చేగలను? మీవాళ్లు నన్ను రెండుపూటలూ గయ్యాళిగంప అని తిడుతూఉండేవారు, గాని చేతకానివాళ్లు తిట్లతోనే మనస్సు సంతోషపెట్టుకుంటూరు గనుక మీతిట్లన్నిటినీ నేను క్షమించాను.

మీయింటితో ఏమీసంబంధములేనిది ఒకటి నాదగ్గర ఉండేది, అది మీకెవరికీ తెలియదు—నేను దొంగతనముగా పద్యాలు వ్రాస్తూఉండేదానను, అది బుగ్గితోసమానమైనది కావచ్చును, బూడిదతో సమానమైనది కావచ్చును, గాని దానిచుట్టూమాత్రము మీ ప్రహారీలు లేవలేదు. అక్కడ నాకుఉన్నది ముక్తి, అక్కడ నేను నిజముగా నేనే, అక్కడ ఉన్నది మీ రెండవ కోడలుకాదు, మీకోడలుమినహా నాలో ఏకాస్తపిసరు ఉన్నదో అది,—అనగా, నాలో మీకు నచ్చనిది నాలో మీరు కనిపెట్టనిది. నేను చేస్తూఉండేపని ఈ పదిహే. నేళ్లూ మీకంట పడకుండానే చేశాను.

మీఇంటికి రావడముతోనే నాకు సంబంధముకలిగిన-వాటిమాట అనుకొన్నప్పుడు మొట్టమొదట జ్ఞాపకమువచ్చేది మీ ఆవులసాల. వెనకఇంటి మెట్లపక్కనే ఆవులు ఉండేవి. ఆ

ముందరనున్న చిన్నదొడ్డితప్ప వాటికి కదలడానికైనా స్థలము లేదు, ఆ జాగాలోనే ఒక మూలను వాటికి తవుడుపెట్టే కర్ర తొట్టెలు. ప్రొద్దున్న లేచేసరికి నౌకర్లందరికీ నానారకాల పనులుండేవి. అవన్నీ అయేవరకూ ఆవులు ఆ తొట్టెలలో అడుగున మిగిలిఉన్న తవుడు నాకుతూ ఉండవలసినదే. అది చూచి నా ప్రాణము ఉసూరు మనేది. నేను పల్లెటూరి పిల్లను, మీ ఇంటికి క్రొత్తగా వచ్చినప్పుడు ఆ పెద్ద పట్నమంతటికీ మీ రెండు ఆవులూ మూడుదూడలే నాకంటికి బంధువులలాగు కనిపించినవి. ఇంటికి నేను క్రొత్తకోడలనై ఉన్నాళ్లు నేను తినకుండా రహస్యముగా ఆ భోజనము వాటికి పెట్టేదానను. పెద్దయిన తరువాత ఆపనే రహస్యము విడిచిపెట్టి చేసేదానను. దీనిని సూచిస్తూ ఇంట్లో దగ్గరబంధువులంతా నా గోత్రాన్ని గురించీ నాజాతినిగురించీ ఎగతాళిచేసి నీచముగా మాట్లాడుతూండేవారు.

నాకూతురు పుడుతూనే చచ్చిపోయింది. ఆపిల్లే బ్రతికి ఉంటే జీవనములో గొప్పది అనదగినపిసరు, అనగా విలువైనది అనదగిన పిసరు, నాకు లభించి ఉండును—అప్పుడు కోడలి పదవినిదాటి తల్లిపదవిని సంపాదించిఉందును. తల్లి ఈఇంటికీ ఆఇంటికీ చెందినదికాదు, తల్లి విశ్వకుటుంబానికి చెందినది. తల్లిపొందవలసిన దుఃఖము మాత్రము నాకు దొరికింది, ముక్తి దొరకలేదు.

డాక్టరు మన ఇంట్లోకి వచ్చి లోపలికథచూచి ఆశ్చర్య-పడిపోయినాడు, పురిటిగది చూచి గాభరాపడ్డాడు. మన ఇంటికి ముందున చిన్న పూలతోట ఉన్నది; ముందుగదిలో ముస్తాబుకు లోటులేదు, కుర్చీలకూ సోఫాలకూ లోటులేదు. కాని మన లోపలిఇల్లుమాత్రము పూలు అల్లికతో చేసినదాని వెనుకపక్కే! వెనుకపక్కనుండేదానికి ఏర్పాటు లేదు, అందము లేదు, సిగ్గులేదు. వెనుకఇంటిదీపము మిణుకుమిణుకు మంటూ ఉంటుంది. గాలి దొంగలాగు కొంచెముకొంచెము లోపలికి దూరి మెల్లగా వస్తూఉంటుంది. చెత్తాచెదారము అక్కడ ఉండేచోటనుంచి కదలనంటుంది; గోడలమీదనూ, నేలమీ-దనూ ఉండే డాగులు అక్షయముగా విరాజిల్లుతుంటవి. కాని అటువంటిఇంట్లో ఉండడమువల్ల మనము రాత్రింబగళ్లు ఎంతో బాధపడుతూఉన్నామని డాక్టరు అనుకోవడము మాత్రము చాలాపొరపాటు. నిజము కేవలము దానికి విరుద్ధము. అనా-దరము అనేది రొయ్యి మోస్తరు—లోపునఉండే నిప్పును లోలోపున మరింత తీవ్రమయినదిగా చేస్తూఉండవచ్చును,గాని పైకిమాత్రము తాపాన్ని తెలియనివ్వదు. స్వాభిమానము తక్కువ అయిపోయినయెడల ఇతరులుచేసిన అగౌరవము అన్యాయము అనిపించదు, దానివల్ల బాధకలుగదు. కనుక బాధకలిగితేనే ఆడవాళ్లు సిగ్గుపడతారు. ఆడవాళ్లకు దుఃఖము తప్పదు అని మీమతము అయినప్పుడు, మీచేతిలో ఉన్నంత-

వరకు వాళ్లయెడల అనాదరము కనపరుస్తూఉండడమే మంచిది అని నే ననేది; ఆదరము దుఃఖమువల్ల కలిగినబాధను కేవలము మరింత విస్తారము చేస్తుంది.

మీరు నన్ను ఏలాగు చూస్తూఉండేవారో గాని దుఃఖముఅంటూ ఒకటి ఉన్న దనైనా ఒకనాడూ నా మనస్సుకు తట్టలేదు. పురిటింట్లో చావు నాతలదగ్గిరికి వచ్చి నిలుచున్న-ప్పటికీ నా కేమీ భయమే వేయలేదు—మా బ్రతుకు ఎంతది గనుక, చావుఅంటే భయపడడానికి? ఆదరణవల్లా సుఖమువల్లా, ప్రాణబంధనము బాగా గట్టిచేయబడ్డ వాళ్లకు కదా చావుఅంటే భయము! యమధర్మరాజు గాని, ఆవాళ నన్ను పట్టి లాగిఉంటే మెత్తనిమట్టిలోనుంచి గడ్డి ఏలాగు వేళ్లతోసహా అతిసుల-భంగా వచ్చేస్తుందో ఆలాగు వచ్చేసి ఉందును. మనదేశములో స్త్రీలు అక్కడక్కడ ఆత్మహత్యచేసుకొని చావడము కద్దు, గాని ఆలాంటి చావులో గొప్పేమీలేదు, దానివల్ల పైగా సిగ్గుకూడా వేస్తుంది, చావుఅంటే! అంతసులభము మా ఆడ్డవాళ్ళకు

నా కూతురు సంధ్యకాలపు చుక్కలాగు క్షణకాలము మాత్రము ఉండి అప్పుడే అస్తమించిపోయింది. తిరిగీ నా మామూలు చాకిరీలోనూ, దూడలసేవలోనూ పడ్డాను. చివరవరకు ఈలాగునే కాలక్షేపము చేసేసి ఉందును, మీకు ఈఉత్తరము వ్రాసే అవసరము ఉండకపోను. కాని మన జీవిత-

ములో మధ్యమధ్య ఏమి టవుతుందంటే సున్నముతోనూ, ఇటికలతోనూ కట్టిన పక్కా భవంతులలో ఎక్కడో ఒకచోట ఒక చిన్న విత్తు వచ్చి పడుతుంది; ఆ విత్తులోనుంచి పెద్ద రావిచెట్టు పుడుతుంది, చివరకు దానివల్ల ఇంత గొప్ప పక్కా ఇటికలభవంతీ పగిలిపోతుంది. మనఇంటి పక్కానిబంధనల-మధ్య ఎక్కడనుంచో వచ్చి ఒక చిన్న జీవనకణము పడ్డది. అప్పటినుంచి పగులు ఆరంభమయింది.

తల్లి కూడా చచ్చి పోయినతరువాత పినతండ్రిబిడ్డలు పెట్టిన బాధ మరి సహించలేక మా తోటికోడలి చెల్లెలు, బిందు, మనయింటికి తనఅక్కదగ్గిరికి వచ్చిననాడు మీ రందరూ, "ఇ దేమిటి మళ్లా ఈ ఆపద ఎక్కడనుంచి వచ్చి పడ్డది?" అని అనుకొన్నారు. చూచాను, మీరంతా లోలోపున అతి-చికాకుపడుతూ'న్నారు. అందుచేత ఆ దిక్కుమాలిన పిల్లను చూచి నామనస్సు కరిగిపోయింది, నడుము బిగించుకొని ఆమె పక్కను నిలుచున్నాను—నా పాడుబుద్ధి అటువంటిది నే నేమి చేయగలను చెప్పండి? పై వారి ఇంటికి వచ్చి వాళ్లకు అయిష్టముగా ఉన్నప్పటికీ అక్కడే ఉండడము ఎంత సిగ్గులేని-తనము చూడండి! అయినా వే రేదీ గతిలేక దానికైనా ఒప్పుకొని మనదగ్గిరికి వాళ్లను ఏలాగు తోలివేయగలము?

తరువాత చూడాలి మా తోటికోడలి అవస్థ! దుఃఖము భరించలేక ఇంటికి చెల్లెలిని తీసుకొని వచ్చింది, కాని

భర్త ఇష్టపడకపోవడము చూచి, 'అన్నా ఆపదలో పడ్డానే,' అనుకొన్నది; 'ఏలాగైనా తప్పించుకోగలిగితే బ్రతుకుతాను,' అనుకొన్నది. దిక్కుమాలిన చెల్లెలియెడల తనమనస్సులో ఉండే ప్రేమ పైకి కనపరిచే సాహసము మా తోటికోడలిది కాదు. ఆమె పతివ్రత.

ఆమెఅవస్థ చూచి నాకు మరింత బాధ కలిగింది. అందరి విషయమై మునుపటికంటే విస్తారము శ్రద్ధతీసుకొని, బిందుకు మాత్రము అడుగూ మెడుగూ ఇచ్చేది, ఒక ముతకబట్ట కట్టు-కోడానికి ఇచ్చి గడుపుతూండేది, ఇంట్లో కూలిపనిఅంతా ఆమెచేత చేయించేది. ఇది చూచి నాకు దుఃఖమే కాదు సిగ్గు కూడా వేసింది. మనసౌఖ్యముకోసము బిందును మోసపుచ్చి మనయింటికి అతిచవకగా తీసుకువచ్చినట్టు నలుగురికీ తెలియ-జేయవలెనని చాలా అవస్థపడేది. బిందు కావలసినంత చాకిరీ చేస్తుంది, అయినా ఆమెవల్లఅయే ఖర్చు అతిస్వల్పము!

గొప్పకులముతప్ప మరేమీ లేదు మా తోటికోడలికి. అందము లేదు, డబ్బు లేదు. మామగారి కాళ్లూచేతులూ పట్టుకొని ఏలాగో మీఇంట్లో ఇచ్చి పెళ్లిచేశారు, ఆమాట అందరూ ఎరిగినదే! ఆ పెళ్ళివల్ల మీఇంటికి గొప్పఅపరాధము కలిగిందని చాలాకాలమువరకు లోలోపున ఆమెనమ్మకము. అందుచేత మీ ఇంట్లో సాధ్యమైనంత తక్కువజాగాలో ముడిచిపెట్టుకొని కూర్చుండేది.

కాని ఈ సాధ్వీమణిదృష్టాంతము నన్ను గొప్పచిక్కులో పెట్టింది. అన్నివైపులా అంత ముడుచుకొని కూర్చోవడము నాకు సాధ్యముకాని పని. మంచి అని నేను నమ్మేదానిని ఒకరికి జడిసి చెడ్డ అనుకోవడము నాకు చేతకాని పని. దానికి నిదర్శనముగా మీరూ చాలా చూచిఉన్నారు.

బిందును నాగదిలోకి తీసుకొనివచ్చి ఉంచుకొన్నాను. బీదఇంటి పిల్లను ముద్దుచేసి పాడుచేదామని నిశ్చయించుకొన్నది మా తోటికోడలు అని అక్కయ్య అనేది. నేను ఏదో పెద్దవిపత్తును తీసుకువచ్చి ఇంటిమీద పెట్టాను అన్నట్టుగా అందరితో ఫిర్యాదుచేస్తూ ఉండేది. కాని ప్రాణాలు తిరిగి వచ్చినవని లోలోపున అనుకొనేది, నాకు బాగా తెలుసును. కనుక ఆ దోష మంతా నానెత్తిమీదనే పడ్డది. తనంతటతాను కనపరచలేనిప్రేమను నాద్వారా పైకి వదులుతుండడమువల్ల ఆమెమనస్సు కొంచెము చులక నయింది. బిందుఈడు రెండు మూడుసంవత్సరాలు తక్కువచేసి అక్కయ్య చెప్పేది. ఆమె వయస్సు పధ్నాలుగుకు ఏమీ తక్కువ ఉండదు, కాని ఈలా చెప్పడముమాత్రము ఒక అసత్యముకింద లెక్కపెట్టకూడదు. బిందు చూడడానికి ఎంతవికారముగా ఉండేది అంటే ఆమె గచ్చుమీదగాని కాలుజారి పడి తల పగలగొట్టుకుంటే మీరంతా గచ్చుకు ఎంతనష్టము కలిగిందో అని విచారించి ఉందురు. సంగ తేమి టంటే, ఆమెకు తల్లి తండ్రీ లేకపోవడమువల్ల పెళ్లిఏర్పాటు చేసేవారు ఎవరూ లేరు; అటువంటి

పిల్లను పెళ్లిచేసుకొనేపాటి ఆత్మశక్తిగలవాడూ లేడు మన హిందూ మహా ప్రపంచములో!

తన గాలి తగిలినంతమాత్రాన నాకు ఎంత ముప్పు కలుగుతుందో అన్నట్టుగా అతిభయముతో బిందు మెల్లిమెల్లిగా నాదగ్గిరికి వచ్చేది. ఈప్రపంచములో పుట్టడానికి తనకు అధికారము లేదన్నట్టుగా ఈమూలా ఆమూలా దాగొని ఎవరికంటా పడకుండా తప్పించుకొని తిరుగుతూండేది. ఇంట్లో పనికిరానివస్తువులు పారేసే మూలనైనా బిందును ఉండనివ్వడానికి ఒప్పుకోలేదు పినతండ్రికొడుకులు—ఇంతకూ పినతండ్రికొడుకులఇల్లు బిందుతండ్రిఇల్లే! అనవసరమైన వస్తువులకు మన ఇళ్లల్లో కావలసినంత జాగాదొరుకుతుంది, ఎందుచేతనంటే వాటిని ఒకమూల పారేశి హాటిమాట మరచిపోగలము. కాని అనావశ్యమైన ఆడది అనగానే అనావశ్యకత ఒకగుణము ఉంటూఉండగా, రెండవ దుర్గుణమేమిటంటే తనమాట మనకు మరుపుకు రానియ్యకపోవడము. అందుచేత అటువంటి వస్తువుకు ఇంటిచెత్తతోపాటైనా స్థలము దొరకదు. పోనీ పినతండ్రికొడుకులు మహా ఆవశ్యకమైన పదార్థాలా అంటే, అదీకాదు. కాని వాళ్లకుమాత్రము కావలసినంత స్థలము ఉండేది.

బిందును నాగదిలోకి తీసుకొని రాగానే ఆమెగుండెలో వణుకు పుట్టింది, ఆ భయము చూచి నాకు మహా దుఃఖము

వచ్చింది. నా గదిలో రవంతమేర నీదే అమ్మా అని ఎంతో ముద్దుతో నచ్చచెప్పాను.

కాని నా గది కేవలము నాదే కాదు. అందుచేత నా పని అంతసులువుగా సాధించలేకపోయినాను. మూడు నాలుగు రోజులైనతరువాత ఎర్రెర్రగా ఏమిటో ఆమె ఒంటినిండా లేచినవి, బహుశా చెమటపొక్కులో అటు-వంటివి మరేవో అయి ఉంటవి. మీరంతా పొంగుచూపింది అన్నారు. పొంగు ఎందుచేతా? ఆమె బిందు గనుక. వైద్యము ఇంకా చేతకాని మీపేటడాక్టరును పిలిపించి చూపిస్తే "రెండుమూడు రోజులు పోతేనేగాని చెప్పడము కష్టము," అన్నాడు, కాని ఆ రెండుమూడురోజులూ మీరు ఓర్చి ఉండలేదు. దానివల్ల కలిగిన సిగ్గుచేతనే బిందూ చావడానికి సిద్ధమయింది. పొంగు అయితే కానియ్యండి, నా పురిటిగదిలో ఉంచి చేయవలసినదంతా నేనే చేస్తాను, మీరెవ్వరూ ఏమీ చేయనక్కరలేదు అని నేను అన్నాను. అది చూచి మీరు రౌద్రముతో సాక్షాత్తు దుర్గాదేవి అయిపోయినారు. బిందుఅక్కకూడా అతి చికాకుపడుతూఉన్నట్టు నటించి ఆ అభాగ్యురాలను ఆసుపత్రికి పంపించేస్తే తీరిపోతుంది అన్నది. ఈ కాండ ఇంకా జరుగుతూనే ఉన్నది, ఆ ఎర్రని వేమిటో ఇట్టే మాయమైపోయినవి. అది చూచి మీకు మరీ కోపము వచ్చింది, నిజముగా అది పొంగే ఇప్పుడు మాడి పోయింది అన్నారు. ఏమీ, ఎందుచేత? ఆమె బిందుగనుక.

ఎవరిఆదరణా లేకుండా పెరగడము గొప్పగుణమే. దానివల్ల మనకు కలిగే లాభము మనదగ్గిరికి ముసలితనమూ చావూ ఎన్నటికీ రాకుండాఉండడమే; రోగానికికూడా మనము అవసరములేనివస్తువులు అయిపోతాము, చావువచ్చే పెద్దపెద్దరోడ్లన్నీ పూర్తిగా మూసుకుపోతవి. అందుచేత రోగమువచ్చి బిందును వెక్కిరించి చక్కాపోయింది గాని, బిందును ముట్టుకోనైనా లేకపోయింది. ఒకటి నాకు బాగా బోధపడ్డది, ఎవరికీ అవసరములేని పిల్లకు ఆశ్రయము కావడముకంటె కష్టమైనదని ఈలోకములో వేరొకటి లేదు. అటువంటివాళ్లకు ఆశ్రయము ఇవ్వడము ఎంతఆవశ్యకమో అంతకష్టము.

బిందుకు నావిషయమై మొట్టమొదటఉండే బితుకు కొంచెము తగ్గగానే ఆమెకు ఒక కొత్తవెర్రి పట్టుకొన్నది. నా మీద ఆమెకు పుడుతూఉన్న ప్రేమా అభిమానమూ చూచి నాకే భయమువేసింది. అంతప్రేమ నాజీవితములో నేను ఎన్నడూ చూడలేదు; పుస్తకాలలో చదివాను అనుకోండి, గాని పుస్తకాలలోనైనాఇటువంటిది స్త్రీలయెడల పురుషులకూ పురుషులయెడల స్త్రీలకూ మాత్రమే ఉంటుంది. నా అందము మాట నాకు జ్ఞప్తికి తీసుకువస్తూఉండేలాంటి సంగతులు ఏవీ మా ఇంట్లో అట్టే రోజులు తటస్థించలేదు. అటువంటి నా అందముమీద పడ్డది ఈ అభాగ్యురాలు. నా ముఖము చూస్తే బిందుకు కలిగినసంతోషానికి మరి మితిలేదు. "అక్కయ్యా,

నీ అందము చూడదగిన కళ్లు నాకుతప్ప మరి ఎవరికీ లేవు,"
అనేది బిందు. నా తల నేను దువ్వుకుంటే ఆవాళ బిందుకు వచ్చిన
కోపము ఇంతా అంతా కాదు. బిందు నా పెద్దజుట్టుఅంతా
తన రెండు చేతులతో పట్టుకొని ఇటూ అటూ తిప్పుతూ దువ్వు
తూఉంటే చూడాలి ఆమెసంతోషము! ఎక్కడికైనా పేరం-
టానికి వెళ్ళడానికితప్ప ముస్తాబుకావడము నాకు అవసరము
లేక పోయేది. గాని బిందు నన్ను నానాఅవస్థా పెట్టి రోజూ
కొద్దోగొప్పో ముస్తాబు చేయనిదే వదిలేదికాదు. ఒకమోస్త
రన్నమా టేమిటి, అన్నివిధాలా పాప మాపిల్ల నేనంటే వెర్రి
అయిపోయేది.

మా ఇల్లు అంతాగచ్చు, మట్టిజాగా ఏమూలా ఒక
మూరెడుమేరైనా లేదు. గాని ఉత్తరనువె పునున్న ప్రహారీ
పక్కను కాలువబిడ్డున ఒకచిన్న రావిచెట్టు ఏలాగో మొలిచింది,
ఒకనాడు అకస్మాత్తుగా చూచాను, నిగనిగలాడుతూ పచ్చని
ఆకులు పుడుతూఉన్నవి. భూతలాన వసంతఋతువు ఆరంభ-
మయిందని తటాలున అప్పుడు జ్ఞప్తికివచ్చింది. మనచీకటింటి
మూలను ఎవరూ ఆదరించని ఈ పిల్లమనస్సు అడుగునుంచి
శిఖరమువరకు ప్రేమతో పచ్చగా కావడము చూచి హృదయ
లోకానికికూడా వసంతఋతువుఅంటూ ఒకటి ఉన్నది అని
అప్పుడు అనుకొన్నాను. వసంతగాలి సందులలోనుంచీ
గొందెలలోనుంచీ రాదు, అంతరిక్షమునుంచి వస్తుంది.

బిందుప్రేమయొక్క దుస్సహావేగమువల్ల అప్పుడప్పుడు నాలో గాభరాపుట్టేది, ఆమాట నేను ఒప్పుకోక తీరదు. కాని ఆ ప్రేమద్వారా కనబడ్డ నాకొత్తస్వరూపము ఇంతకు-ముందు ఎన్నడూ నాలో నేను చూడలేదు, ఇది నా ముక్త స్వరూపము. బిందువంటి పిల్లను తీసుకువచ్చి అభిమానముతో చూడడము నే నేదో గొప్పకో, అల్లరికో చేస్తూఉన్నానని మీ అందరికీ అనిపించేది—మీరు తిట్టినతిట్లకూ, మీ సణుగులకూ అంతములేదు. నా గదిలో బాజిబందు చోరీపోయిననాడు బిందుకు దానితో ఏదో సంబంధము ఉన్నదని సూచిస్తూ మాట్లాడడానికి మీకు సిగ్గు లేకపోయింది. ఆ స్వదేశీ గడి-బిడలలో ఇళ్లసోదా జరుగుతూఉన్న రోజులలో మీరు అతి-సునాయాసముగా బిందును అనుమానించడము ఆరంభిం-చారు, ఆమె పోలీసువాళ్ల గుప్తచారిణి అని అన్నారు. దానికి మీకు ఎటువంటి నిదర్శనమూ లేదు; అయితే ఎందు చేత అన్నారు? ఆమె బిందు గనుక.

మీ ఇంట్లో దాసీలు బిందుకోసమని ఏవిధమైనపని అన్నా అభ్యంతరము చెప్పేవారు. ఒకవేళ ఆమెపని ఏదైనా చేయమని నే నెవరితోనైనా చెపితే బిందు భయముచేత కర్ర కట్టిపోయేది. అందుచేత బిందుకోసమని నాకుఅయేఖర్చు విస్తారము అయిపోయేది. నేను ప్రత్యేకముగా ఒకదాసీను పెట్టుకోవలసివచ్చింది. అది మీకెవ్వరికీ ఇష్టములేదు.

బిందుకు కావలసిన బట్టలన్నీ నేను కొనిఇస్తూ ఉండే-దానను. అదిచూచి మీకు కోపమువచ్చేది. నాచిల్లర ఖర్చుల-కని ప్రతినెలా మామూలుగా ఇస్తూఉన్న రూపాయిలు ఇవ్వ-డము ఆపుచేసేశారు. ఆ మర్నాటినుండి చాపు రూపాయి పావలామోస్తరు ముతక సీమనూలుబట్టలు కట్టుకోవడము ప్రారంభించాను. 'మాలతి' తల్లి ఎంగిలికంచము తీసుకువెళ్ల-డానికి వస్తే దానిని పొమ్మని నేనే వెళ్లి ఆ మిగిలిన అన్నము దూడకువేసి కంచము కొళాయిదగ్గిరకు తీసుకొనివెళ్లి నా చేతులతో నేనే తోముతూ ఉండేదానను. ఒకనాడు ఆ పని చేస్తూఉండగా అకస్మాత్తుగా మీకంట పడ్డాను. అది మీకు అట్టే రుచించలేదు—కాని నాకు దుఃఖముకలిగినా మీ ఆనం-దానికిమాత్రము భంగము కలుగనివ్వకూడదు అన్న సద్బుద్ధి ఈనాటివరకూ నాలో పుట్టలేదు ఏమి కర్మమో గాని!

ఇవతల మీ కోపము ఏలాగు పెరుగుతూ వచ్చిందో బిందుఈడుకూడా ఆలాగే అధికమైపోతూవచ్చింది. ఈడు-పెరగడము స్వాభావికమైనప్పటికీ అది చూచి మీకు ఎందుకు అంత అస్వాభావికమైన కోపము పుట్టాలో నాకు ఇప్పటికీ బోధపడడము లేదు. మీరు బిందును ఇంట్లోనుంచి బలవం-తాన ఎందుకు పంపేయలేదో అని అనుకొంటే నాకు ఆశ్చ-ర్యము వేస్తుంది. నాకు తెలుసును, లోలోపున నేనంటే మీఅందరికీ భయము. దేవుడు నాకిచ్చిన బుద్ధిని చూచి, పైకి

కాకపోయినా లోపునైనా, మీఅందరూ నన్ను మన్నించాలి తీరిందికాదు.

మీబలము ఉపయోగించి మీరు బిందును ఎంతకూ బైటకు పంపించలేకపోతే చివరకు భగవంతుడు మీకు సహాయము వచ్చాడు. బిందుకు వరుడు కుదిరాడు. తోటికోడలు, "బ్రతికాను రా బాబూ," అనుకొన్నది. "తల్లి, జగద్ధాత్రి, మా వంశముయొక్క పరువుమర్యాదలు నిలబెట్టింది"అన్నది.

పెళ్లికొడుకు ఏలాంటివాడో నాకు తెలియదు, ఏ విషయములో చూచినా చాలా తగినవాడు అని మీరు చెప్పగా విన్నాను. బిందు నా కాళ్లు పట్టుకొన్నది; "అక్కా నాకు ఇప్పుడు పెళ్లి ఎందుకు చేస్తారు" అంటూ ఏడవడము ఆరంభించింది.

"భయపడకమ్మా బిందూ, నీవరుడు చాలామంచివాడని వింటున్నాను." అని అనేకవిధాల బోధపరిచి చెప్పాను. "నాలో ఏమున్నదని అంత మంచివాడైతే నన్ను పెళ్లాడడానికి?" అని అన్నది బిందు.

మొగపెళ్లివాళ్ళు పిల్లను చూస్తామని మాటవరసకైనా అనలేదట. అది విని అక్కయ్య తనలోతాను చాలా సంతోషించింది.

కాని బిందుఏడుపుకు రాత్రిగాని పగలుగాని విరామము లేదు. బిందుకు ఎంతదుఃఖమో ఎంతకష్టమో నాకు

తెలుసును. బిందుకోసమని చాలామందితో చాలా రకాలగా పోట్లాడాను, కాని పెళ్లి మానేయమని చెప్పగలిగినంత సాహసముమాత్రము నాకు లేకపోయింది—దేనినిచూచి పెళ్లి మానేయమని అనగలను? నేను చచ్చిపోతే బిందుగతి ఏ-మౌతుంది?

ఆడది, అందులో నలుపు; ఎవరింటికి వెళ్లుతుందో అక్కడ ఆమెకు ఏదశ పడుతుందో, ఆమాటలన్నీ ఆలోచించకుండా ఉండడమే మంచిది అనుకొన్నాను—ఆలోచించబోతే లోపున వణుకుపుట్టేది. "అక్కా పెళ్లి ఇక వారమురోజులు ఉన్నది. ఈలోపున నాకు చావు వస్తుందీ?" అని ఒకనాడు బిందు అన్నది.

కోపపడుతూ మాటలు జోరుగా అన్నాను. కాని అభగ-వంతుడికి తెలుసును—నా మనస్సులోమాత్రము, బిందుకు ఈలోగా సహజమైనచావు ఏలాగైనా వస్తే అన్నిచిక్కులూ వదిలిపోతవి అని ఉండేది. పెళ్లి రేపుఅనగా బిందు వాళ్లఅక్క-దగ్గిరికివెళ్లి, "అక్కా, నేను మీ ఆవులసాలలో పడిఉంటాను; నన్ను ఏపని చేయమన్నా చేస్తాను, గాని నీకాళ్లు పట్టు-కుంటాను, నన్నుమాత్రము ఈలాగు ధారపోసేయకు," అని అన్నది.

ఇప్పటికప్పుడే కొన్నాళ్లుఅయింది, అక్కయ్య వెనకవెనక రోజూ ఏడుస్తూఉన్నది, ఈవాళకూడా కళ్ల వెంట నీళ్ల ధారలు

కావలసినన్ని. కాని ఉన్నదంతా ఒక్కహృదయమేనా, శాస్త్రము కూడ ఉన్నది కదా! తెలియదూ బిందూ, ఆడదానికి మొగుడే దైవము, మొగుడే ముక్తి. దుఃఖము నొసట వ్రాసిఉంటే ఎవరూ తప్పించలేరు. నిజము ఏమిఅంటే ఇంకొక దారి లేదు, పెళ్లి అయే తీరాలి—దానివల్ల ఏది రావలసిఉంటే అది రానీ తరువాత.

పోనీ పెళ్లైనా మనఇంట్లో కానీయమని కోరాను. మీరు కానిచ్చారుకారు. మొగపెళ్లివాళ్ల కులాచారము అది, పెళ్లి వాళ్లఇంటే కావాలి అని మీరు పట్టుపట్టారు. బిందు-కోసము మీ సొమ్ము ఏమైనా ఖర్చుఅయితే మీ గృహదేవత సహించదు, అని నేను అప్పుడుఅనుకొన్నాను. కాని మీ కెవరికీ తెలియకుండా ఒకటిమాత్రము చేశాను, అక్కయ్యతో చెప్పవలెనని బుద్ధిపుట్టింది గాని ఆమె భయముతో చచ్చి-పోతుందని చెప్పలేదు—నావస్తువులు కొన్ని బిందుకు పెట్టాను అది అక్కయ్యకంట పడి ఉంటుందనుకొంటాను కాని అది ఆమె చూచికూడా చూచిఉండదు. ఆ ధర్మదేవతకు ఒక నమస్కారము! మీరు అక్కయ్యను ఈ విషయములో మాత్రము క్షమించండి.

వెళ్లేటప్పుడు బిందు నన్ను కౌగలించుకొని, "అక్కా అయితే నన్ను కేవలము విడిచిపెట్టేశావు!" అని అన్నది.

"లే తమ్మా బిందూ, నువ్వు ఏదశలో ఉన్నా నేను మాత్రము నిన్ను ఎన్నడూ విడవను, చివరవరకూ నువ్వు నాదానవే అన్నాను.

మూడురోజులు గడచినవి. మీగ్రామస్థులు విందుకని మనకిచ్చిన మేకను మీ జఠరాగ్ని జ్వాలనుంచి తప్పించి మనఇంట్లో కర్రలుఉంచే డాబాగదిలో ఒకమూలను దాచి ఉంచాను. ప్రొద్దున్న లేస్తూనే దానికి మేతపెడుతూ ఉండే దానను;—మీ నౌకర్లమీద ఆ భారము రెండురోజులు విడిచిపెట్టి చూచాను, దానికి మేతపెట్టడముకంటే దానినే మేతగా చేయడానికి వాళ్లకు విస్తారము అభిలాష ఉన్నట్టు కనబడ్డది.

ఆనాడు ఉదయము ఆ గదిలోకి వెళ్లేసరికి బిందు ప్రాణములేని కర్రబొమ్మలాగు ఒక మూల నక్కుకొని నిలబడి ఉన్నది. నన్ను చూడగానే నా కాళ్లు రెండూ గట్టిగా పట్టుకొని నేలమీద పడిపోయింది. పైకి ఏమీ ఏడుపు వినబడలేదు గాని కన్నీటితో నాపాదాలు నింపేసింది.

బిందుమొగుడు పిచ్చివాడు!

నిజముగానే బిందూ?"

"నీదగ్గర అటువంటిఅబద్ధము చెప్పడమే, అక్కా! ఆయనను పిచ్చి. మామగారికి ఈపెళ్లి ఇష్టములేదట, గాని

మామగారికి అత్తగారిని చూస్తే యమధర్మరాజును చూచి-నట్టుగా భయమట. పెళ్లి కాకముందే అతను కాశీ వెళిపోయి-నారు. పట్టుపట్టి అత్తగారు పెళ్లిచేయించింది. నేను మూలనున్న బొగ్గులకుప్పమీద చలికిలపడిపోయినాను. ఆడవాళ్లను చూస్తే ఆడవాళ్లకు దయలేదు—అంతా విని ఆఖరుకు, "అయితే నేమి ఆడదే కదా!" అంటారు; "అబ్బాయి పిచ్చివాడైతే నేమి—మొగవాడే కదా!" అంటారు.

బిందు మొగుణ్ణి పిచ్చివాడని ఒక్కమాటు పోల్చుకో-లేము గాని ఒకొక్కనాడు అతని ఉద్రేకము చెప్పడానికి వీలులేనంత—తాళమువేసి గదిలో ఉంచాలి. పెళ్లినాటిరాత్రి బాగానే ఉండెను. ఆమర్నాటినుంచీ రాత్రి నిద్రన్నమాట-లేకుండా వెర్రివికారాలు ఆరంభించాడు. మధ్యాహ్నము బిందు భోజనానికి కూర్చున్నది. మొగుడువచ్చి కంచమునిండా అన్నముఉంటే అది తీసుకొనివెళ్లి పెరటిలో విసిరేశాడు. ఆ తలలో ఏమి పుట్టిందో తెలియదు—అలాగు కూర్చొని కూర్చొని చటాలున లేచి పెళ్లాన్ని 'రాసమణి'రాణి అనడము ఆరంభించాడు. రాణిబంగారముకంచము దాసీది దొంగలించి తన కంచుకంచములో రాణికి అన్నము పెట్టిందట. అందుకని కోపముతో మండిపడ్డాడు. బిందు భయముతో చచ్చిపోతు-న్నది, మూడవరాత్రి అత్తగారు బిందును మొగుడిగదిలోకి వెళ్లమనేసరికి ఆమె ఒంట్లో మరి ప్రాణాలు లేవు. అత్తగారు అది చూచి అగ్నిహోత్రము అయిపోయింది, ఆవిడికి కోపము

వస్తే మరి జ్ఞానము ఉండదు—ఆ మొఱకూడా పిచ్చే గాని పూర్తిగా కొలకపోవడము వల్ల మరీ ఘోరము! బిందు మొగుడు ఆ రాత్రి మాత్రము కొంచము నెమ్మదిగానే ఉండెను. కాని బిందు భయమువల్ల కర్రకట్టిపోయింది. మొగుడు పడుకొని ఉంటూఉండగా అర్ధరాత్రప్పుడు ఎంతో ఉపాయముమీద పారిపోవచ్చింది. సరే ఇది ఈలా ఉండనివ్వండి—ఇంతకంటె వివరముగా చెప్పడము ఇప్పుడు అనవసరము.

కోపముతోనూ అసహ్యాముతోనూ నాకుఒళ్లు మండుకుపోయింది. ఇటువంటి దగాపెళ్లి పెళ్లే కాదని అన్నాను. "మునుపు ఎలాగు ఉండేదానవో ఆలాగే నాదగ్గిర ఉండు, నిన్నెవరు తీసుకు వెళ్లగలరో చూస్తాను," అని బిందుతో అన్నాను.

బిందుచెప్పినదంతా అబద్ధము అని మీరంతా అన్నారు. బిందు ఎప్పుడూ అబద్ధము చెప్పదని నేను అన్నాను. నాకేలాగు తెలుసునని మీరు అడిగారు. నాకు నిశ్చయముగా తెలుసును అని నేను అన్నాను.

అత్తవారు పోలీసు కేసు చేస్తే చాలా చిక్కులో పడిపోతామని నన్ను జడిపించారు.

"దగాచేసి పిచ్చివాడి కిచ్చి పెళ్లిచేశారనిచెపితే కోర్టులో వినరా!" అని నేను అడిగాను.

"దీన్ని కేసుదాకా తీసుకువెళతావా ఏమిటి, మన కెందుకు ఆ పూచీఅంతా?" అని మీరు అన్నారు.

"నా వస్తువులన్నీ అమ్మేసి చేయవలసినదంతా చేసి-తీరుతాను" అని నేను అన్నాను.

ఇక ప్లీడర్ల వెంట పడతావు గాబోలు?" అని మీరు అన్నారు.

దానికి నేను జబాబు ఇవ్వలేదు. చేతులతో నెత్తి బాదుకొన్నాను__అంతకంటె మరేమి చేయగలను నేను?

అవతల బిందు బావగారు వచ్చి బయట ఏక గోల పెట్టడము ప్రారంభించాడు, పోలీసు స్టేషన్‌లో చెప్పేస్తా-నన్నాడు.

నాలో ఏమి బలమున్నదో తెలియదుగాని ప్రాణ భయమువల్ల కసాయివాడి చేతులలోనుంచి తప్పించుకొని నాశరణుచొచ్చిన మేకపిల్లను పోలీసువాళ్ల భయమువల్ల తిరిగీ కసాయివాడిచేతికే అప్పచెప్పడానికి ఎంత ఆలోచించినా ఏవిధముగానూ నామనస్సు ఒప్పుకొన్నది కాదు. "కావలెనంటే వాళ్లను పోలీసుస్టేషనులో ఫిర్యాదు చేసుకోనివ్వండి," అని అతి నిర్లక్ష్యముగా అన్నాను.

ఆలా అంటూ బిందును నా పడకగదిలో పెట్టి తాళము వేసి తాళము దగ్గర పెట్టుకుకూర్చుందామని నామనస్సులో

వేసు నిర్ణయించుకొన్నాను. కొంచెము సేపయినతరువాత చూదును—బిందు లేదు! మీరూ నేనూ వాదనచేస్తూ ఉన్నసమయములో బిందు వెళ్లి బావగారి చేతికి తనను తానే అప్పచెప్పేసుకొన్నది. ఇంట్లోఉంటే నన్ను గొప్పఆపదలో పెట్టేస్తుందని ఆమెకు బోధపడిపోయింది.

మధ్యను ఈవిధముగా వచ్చేయడమువల్ల బిందు తన కష్టాన్ని మరింత అధికముచేసుకొన్నది. అత్తగారితర్కము ఏమిటంటే: 'తనకొడుకు పెళ్లాన్ని తినేయబోలేదు, మొగుడికి ఏదోఒక లోపము ఉండడము ప్రపంచములో అసామాన్యము కాదు, అటువంటివాళ్లు కొంతమందితో సరిపోల్చిచూస్తే తన కొడుకు వరహాలమూట' అని.

"అది అభాగ్యురాలు, దాని దుఃఖానికి మనము ఏమి చేయగలము, వెర్రిఅయితేనేమి మొర్రిఅయితేనేమి మొగు-డయినాడు కాదా!" అని తోటికోడలు అన్నది.

కుష్ఠురోగిఅయిన భర్తను తానే ఎత్తుకొని తీసుకువెళ్లి భోగముదానిఇంట్లో దిగబెట్టి వచ్చిన సతి సాధ్వీమణి దృష్టాంతము మీఅందరికీ జ్ఞాపకమువచ్చింది. ప్రపంచములో అందరికంటె అధముడైన పురుషుని మాలిన్యాన్ని తెలియ-జేసే ఇటువంటి కథలను ప్రచారణచేస్తూఉండడానికి మీ పురుషులకు ఎటువంటి సిగ్గూ సంకోచమూ లేదు. మీావి అటువంటి మనస్సులుగనుకనే మానవ జన్మమెత్తికూడా బిందు

అవస్థ చూచి తలలువాల్చుకోడానికి మారుగా కాపపడగలు
గుతున్నారు. బిందును చూచి నాగుండె బద్దలయిపోయింది.
గాని మీమాట అనుకొంటే నాలో పుట్టిన సిగ్గు ఇంతాఅంతా
కాదు. నేను పల్లెటూరిపిల్లను, పైగా మీ ఇంట్లో వచ్చి
పడ్డాను, ఈశ్వరుడు నాలో ఇటువంటిబుద్ధి ఏపొరపాటువల్ల
పెట్టాడోనాకు తెలియదు! మీ ధర్మవాక్యాలూ మీ నీతి
వచనాలూ నేనేమీ సహించలేకపోయినాను.

చచ్చి పోతుంది గాని బిందు తిరిగీ మనఇంటికి రాదు
అని నాకు నిశ్చయము అయిపోయింది. కాని పెళ్లికిముందు-
రోజున చివరవరకూ నేను నిన్ను వదిలిపెట్టను అని ఆమెకు
ధైర్యము ఇచ్చాను.

మా తమ్ముడు శరత్ కలకత్తాలో ఎఫ్. ఏ. చదువు
తూండేవాడు. వాడిసంగతి మీకు తెలుసును, నానా రకాల
ఉద్యమాలలో వలెంటియరుగా ఉండేవాడు. ప్లేగు పుట్టిన
ఇళ్లల్లో ఎలకలను చంపడమూ; దామోదర్ వరదలలో తిరిగి
ప్రాణాలకు అపాయము రాకుండా మనుష్యులను కాపాడు
తూఉండడమూ—మొదలైన లోకోపకారసంబంధమైన పను-
లంటే వాడికి చాలా ఉత్సాహము—ఈపనులలో తిరుగుతూ
ఉండడమువల్ల వాడి పరీక్ష రెండుసార్లు పోయినా వాడికి
ఏమీవిచారము లేకపోయింది. వాడికి కబురుపంపించి పిలిపించి,
"ఏమి చేయవలసిఉన్నా చేసి, బిందు ఏమయిందో ఆ కబురు

నాతో చెప్పవలెనమ్మా శరత్,—బిందు నాకు ఉత్తరము వ్రాయడానికి సాహసించలేదు, సాహసించి వ్రాసినా ఆ ఉత్త-రము నాకు అందదు," అని చెప్పాను.

బందిపోటు చేసి బిందును తీసుకు వచ్చేయమన్నా, లేదా ఆ వెర్రి మొగుడుతల పగలగొట్టుకు రమ్మన్నా అంతకంటె చాలా సంతోషించి ఉందును, శరత్

శరత్‌తో కలిసి నేను ఆలోచిస్తూ ఉన్నప్పుడు మీరు గదిలోకి వచ్చారు, "మళ్లా ఏదో చిక్కు తెచ్చిపెట్టి నట్టు-న్నారే!" అని మీరు అన్నారు.

నేను పెట్టగలిగిన చిక్కులన్నిటికంటె పెద్దచిక్కు మొట్టమొదట పెట్టిన చిక్కే, అనగా నేను మీ ఇంటికి రావడము—కాని అది మీరు చేసుకొన్నదే!

"బిందును తరిగీ తీసుకొనివచ్చి ఎక్కడైనా దాచేశారా ఏమిటి?" అని మీరు అడిగారు.

"బిందు తిరిగీ వస్తేమాత్రము తప్పకుండా దాచేసి ఉందును, గాని మీకు అటువంటిభయము అక్కరలేదు. బిందు మరి ఇక్కడికి రాదు," అని అన్నాను.

శరత్‌ను నాదగ్గిర చూడగానే మీకు సందేహము మరింత విస్తారమయింది. శరత్ మీ ఇంటికి రావడముపోవ-

డము మీకు ఎంతమాత్రము ఇష్టములేదు. వాడిమీద, పోలీసువాళ్లు కన్నువేసే ఉంచారు, ఏ సెడిషన్ కేసులోనో పడతాడు, అప్పుడు మీరంతా అందులో చిక్కుకొంటారని అని మీ భయము. అందుచేతనే, "భాయిపోటా"కైనా వాడిని మీ ఇంటికి తీసుకొని రాకుండా, పంపదలచుకొన్నది మనిషిద్వారా పంపించేశాను.

బిందు తిరిగీ పారిపోయిందని మీరే నాతో చెప్పారు —బావగారు వెతకడానికని వచ్చి మీకు కనబడ్డాడు. ఆ మాట బాణమయి నాగుండెకు తగిలింది, పాపము ఆ అభాగ్యురాలు ఎంత బాధపడుతూ ఉన్నదో నాకు బోధపడ్డది, కాని దారేదీ కనబడలేదు.

శరత్ సమాచారము కనుక్కొని వస్తానని బయలుదేరాడు. సాయంకాలనును అయేసరికి తిరిగివచ్చి కబురు చెప్పాడు. బిందు మీఇంటినుంచి తన పినతండ్రిబిడ్డలదగ్గిరికి వెళ్లింది వాళ్లు ఆమెమీద అగ్నిహోత్రులైపోయి, తిరిగీ ఆమెను అత్తవారింటికి తీసుకువెళ్లి అప్పచెప్పేశారు. దీనికి అయిన బండిఅద్దె వాళ్లచేతికి తగులుకొన్నదని వాళ్లకు వచ్చినకోపము ఇంకా చల్లారలేదు.

మీ పినతండ్రిభార్య శ్రీజగన్నాథము వెళ్లడానికని మీఇంటికి వచ్చింది. నేను కూడా ఆమెతో వెళతానని మీతో చెప్పాను.

ఒక్కమాటు నాకు ఇంతభక్తి పుట్టిందని కాబోలు, మీరు ఎటువంటి అభ్యంతరమూ పెట్టకుండాఅతి సంతోష-ముగా నాప్రార్థన అంగీకరించారు.

కలకత్తాలో నేను బసచేసుకొని కూర్చుంటే బిందు ఏలాగైనా కనబడుతుంది, తరువాత ఏదైనా గొడవచేయ-వచ్చును అని నాలో నేను నిశ్చయించుకొన్నాను—నాతో ఎవరికైనా నానాబాధ కాదూ.

బుధవారము ప్రయాణము—ఆదివారము అంతా స్థిర మయిపోయింది. బిందును ఏలాగైనా బుధవారమునాటి పూరీ బండిలో ఎక్కించేయాలని శరతును పిలిచి చెప్పాను.

సంతోషముతో శరత్ ముఖము ఇంతపెద్దది అయింది. "నీ కేమీ సంశయము వద్దు అక్కా. చూస్తూఉండు ఏలాగై తే నేమి, బిందును తీసుకు వచ్చి బుధవారము బండిలో ఎక్కిస్తాను, నేనుకూడా పూరీదాకా వస్తాను—ఈవంకనైనా జగన్నాథస్వామివారిదర్శనము అయిపోనీ!" అన్నాడు.

శరత్ ఆవేళసాయంకాలమే తిరిగివచ్చాడు. వాడి ముఖ ము చూస్తూనే నాగుండెలో రాయిపడ్డది. "ఏమి శరత్ ప్రయత్నము సఫలమయేటట్టు లేదు కదూ?" అన్నాను.

"సఫలము కాదు." అన్నాడు.

"ఒప్పుకోలేదన్న దా?"

"మరి ఒప్పుకోవడము అవసరమే లేదు. రాత్రి బట్టలకు నిప్పుముట్టించుకొని చచ్చిపోయింది. నేను స్నేహముచేసిన బిందు బావగారి కొడుకుద్వారా తెలిసింది, నీ పేర ఒక ఉత్తరము వ్రాసి ఉంచిందట. కాని ఆ ఉత్తరము వాళ్లు చింపేశారు."

"పోనీ ఇక బాధ లేదు."

దేశమంతటా కోపజ్వాలలు పుట్టినవి. "బట్టలకు నిప్పు అంటించుకొని చావడము ఫ్యాషన్ అయిపోయింది," అని అంతా అన్నారు.

"ఇదంతా ఒక నాటకము," అని మీరు అన్నారు. నాటకమే, దానికేమీ సందేహము లేదు. కాని ఈ నాటకములో ఆడపిల్లలచీరలకే నిప్పు అంటుకొంటున్నది గాని శూరులైన మన హిందూయువకుల పంచలకు నిప్పు అంటుకోదెందుకో అని కొంచము యోచించదగిన సంగతి.

బిందు నిజముగా అభాగ్యురాలే—బ్రతికిఉన్నన్నాళ్లూ రూపువల్ల గాని, గుణాలవల్ల గాని మెప్పు పొందలేదు. చివరకు చచ్చిపోయినప్పుడైనా తనచావును చూచి అందరూ మెచ్చుకుంటూ, చప్పట్లుకొట్టేటట్టుగా కొత్త మోస్తరుచావు చద్దామన్న ఊహైనా ఆమెలో పుట్టలేదు. చావువల్ల కూడా అందరికీ కోపమే తెప్పించింది.

అక్కయ్య ఇంట్లో ఏమూలనో దాగొని ఏడుస్తూ కూర్చున్నది. కాని ఆ ఏడుపులో బాధనివారణసూచన కూడా కొంత లేకపోలేదు. ఏమైతే నేమి ఇక మరేభయమూ లేదు. ఇంతకూ అయిన దేమిటి, చావడమేకదా? బ్రతికిఉంటే ఏమి-జరిగినా జరిగిఉండవచ్చును.

నేను తీర్థయాత్రకువచ్చాను. బిందుకు మరితీర్థయాత్ర అవసరము లేకపోయింది గాని నాకుమాత్రము ఉండెను.

అందరూ కష్టము అని అంటూఉండేటటువంటిది ఏదీ నేను అనుభవించవలసిన అవసరము లేకపోయింది మీ ఇంట్లో. మీ ఇంట్లో బట్టకూ భోజనానికీ ఏవిధమైన లోటూ ఉండేదికాదు. మీ అన్నగారి సంగతి ఏలాగున్నా, నాకు భర్తను కుదిర్చి పెళ్లిచేసిన దేవుని తిట్టవలసినంత వ్యసన మేది మీలో లేదు. మీస్వభావము మీ అన్నగారి స్వభావము వంటిదైఉన్నా మొత్తముమీద రోజులు ఏలాగో గడిపి పరమపతివ్రతఅయిన నా తోటికోడలులాగు భర్తను నిందించ-కుండా సృష్టికర్తనే నిందించప్రయత్నముచేసిఉందును. అందు చేతనే మీమీద నిందమోపను—ఈ ఉత్తరము ఆ ఉద్దేశ-ముతో వ్రాస్తూఉన్నది కాదు.

కాని మీ ఇరవై ఏడవనంబరు మదన్ బరల్ వీధిఇంటికి నేను మరి రాను. బిందును చూచాను. ఆడదాని బ్రతుకనగా ఏమిటో తెలుసుకున్నాను. నాకు మరే మీ అక్కరలేదు.

తరువాత ఇంకొక సంగతికూడా చూచాను,—ఆడ-దానినైనా భగవంతుడుమాత్రము విడిచిపెట్టి పొమ్మనుడు. ఆమెమీద మీ కెంత కోపముఉన్నా, దానికి అంతమున్నది. ఆమె మీ దౌర్భాగ్యపు మానవజీవితముకంటె చాలా విలువ-గలది. పద్ధతీ, లోకాచారమూ అనిచెప్పి మీ ఇష్టమువచ్చినట్టు శాశ్వతకాలమూ ఆమెను పాదాలకింద పెట్టి నొక్కిఉంచ-గలిగినంత పెద్దపాదాలు కావు మీవి. మృత్యువు మీకంటె చాలా పెద్దది. మృత్యువులో ఆమెది చాలా గొప్పపదవి. అక్కడ బిందుకేవలము ఒకహిందువుల యింటి ఆడపిల్ల-మాత్రమేకాదు, కేవలము పినతండ్రికొడుకుల చెల్లెలు కాదు, ఎవడో తెలియని పిచ్చిమొగుడికి దగామూలముగా కట్టిపెట్ట-బడ్డ పెళ్లాముకాదు. అక్కడ ఆమె ఒక అనంతమైన పదార్థము.

మృత్యువుయొక్క వేణుగానము జీవనప్రవాహపు అవతలిఒడ్డునుంచి ఆ పసిబాలికయొక్క భగ్నహృదయము-ద్వారా వచ్చి మొట్టమొదట నాచెవిని పడ్డనాడే నా గుండెకు బాణము తగిలింది. అన్నిటికంటె స్వల్పమైనది, అన్ని-టికంటె అంత గట్టిఅయినదెందుకో అని విధాతను అడిగాను. నాలుగువైపులా పెద్దప్రహారీలతో చుట్టబడి, ఈ చిన్న సందులో నున్న అతిసామాన్యమైన బుడగకు ఇంతగట్టి ఎందుచేతనో? సృష్టి తన షడ్ఋతువుల సుధాపాత్రను చేతపట్టుకొని ఎంతపిలిచినా ఒక నిమిషముపాటైనా మీ అంతఃపురములో-నుంచి బయటికి రాలేకపోయినాను, గడపఇవతల ఒక్కఅడుగు

వేయలేక పోయినాను. ఇటువంటి పృథ్విలో నాజీవనమువంటి జీవనము వహిస్తూ ఆ అతితుచ్ఛమైన ఇటికెలపంజరములో మెల్లిమెల్లిగా ముక్కలౌతూ ఎందుకు ఇంత ఘోరమైన చావు చావాలి! నా దైనిక జీవనయాత్ర ఎంతతుచ్ఛమైనది! ఎంత-తుచ్ఛమైనది, ఆ జీవనముయొక్క స్వేచ్ఛా వివర్జితములైన సమస్తనియమాలు, స్వేచ్ఛావిరహితములైన ఆచారాలు, స్వేచ్ఛావిరహితములైన మాటలు! ఎంత తుచ్ఛమైనవి ఆ స్వేచ్ఛావిరహితములైన తిట్లూ, కొట్లూ!

కాని చిట్టచివరకు ఎవరిది జయము? జీవనాన్ని బంధించే ఆ నాగపాశాలదే! ఓడిపోయేది నీ సృష్టి, నీ ఆనంద-లోకము! కాని మృత్యువుయొక్క పిలుపు, ఆ వేణుగానము ఆరంభ మయింది—తరువాత మరేవీ మీ రాజమేస్త్రులు కట్టిన అంతఃపురపు గోడలు! ఏవీ మీ శాస్త్రాలుతోనూ, నియమాలతోనూ చుట్టూ పెట్టిన ముళ్లకంచలు? ఎంత దిట్టమైన-వైనా మనుష్యులను అంతదుఃఖములో, అంతఅవమానములో కట్టిపెట్టి, శాశ్వతకాలమూ ఉంచగలవూ? అదుగో మృత్యువు-యొక్క జయపతాకము ఎగురుతూఉన్నది! ఓయి, చిన్నకోడ-లమ్మా, మరి నీ కేవిధమైన భయమూ లేదు. కోడలుఅనే పైపొర ముక్కలుముక్కలై పడిపోవడానికి ఇంకొక నిమిషమైనా పట్టదు.

మీసందులంటే నేను మరి భయపడను. ఇప్పుడు నా ఎదుటనున్నది నీలసముద్రము, మీదను ఆషాఢ మేఘ

పుంజాలు. కులాచారాలూ, లోకమర్యాదలూ అనే మీ అంధకారముమధ్యను నన్ను దాచి ఉంచారు. ఒక్క నిమిషము పాటు, ఆ ఆవరణలోనున్న చిన్న పగులు ద్వారా బిందు నన్ను చూచి వెళ్లింది. ఆ పిల్ల తన మృత్యువుద్వారా నా ఆవరణను అడుగునుండి చివరవరకు తునకతునకలుగా చేసే-సింది. పైకి వచ్చి చూదును, నా మర్యాద దాచుకోవడానికి మరి జాగా ఏదీ కనబడలేదు. అనాదృతమైన ఈ నా రూపును ఇప్పటికీ ఆదరిస్తూఉన్న ఆ శక్తి సౌందర్యమురూపముగా ఆకాశమంతా వ్యాపించి నావైపు చూస్తూఉన్నది. మీ ఇంటి చిన్నకోడలు అంతరించిపోయింది.

నేను చచ్చిపోతానని మీ రనుకొంటున్నారేమో! భయపడకండి. మీ దగ్గిర అటువంటి పాతహాస్యము చెయ్యను. మీరాబాయికూడా నాలాగే ఆడది. ఆమెసంకెళ్లుకూడా నావాటికంటె తక్కువైనవి కావు. అయినా చావే ఆమెకు బ్రతుకుకు మార్గము కాలేదు.

తల్లీ, తండ్రీ విడిచిపెట్టసీ
తన వారందరు విడిచిపెట్టసీ

ఎన్ని వచ్చినను రానిమ్మన్నది
నిన్నే మీరా పట్టుకొనున్నది.

"ఈ పట్టుకొని ఉండడమే" బ్రతికి ఉండడమంటే.

నేను కూడా బ్రతికే ఉంటాను. నేను బ్రతికి పోయినాను.

౧౯౧౮

ఇట్లు,
మీ పాదసేవ తప్పించుకొని వచ్చిన,
మృణాలి.

# ఒకటవ నంబరు

నాకు, ఆఖరుకు, ఒక చుట్టఅయినా అభ్యాసములేదు. క్కాని అన్నిటినీమించిన భయంకరమైన నిషా ఒకటి నన్ను పట్టు-కొన్నది. దీనిపాడ మిక్కిలి దట్టమైనది కావడముచేత ఈనీడను మరి ఏ దురభ్యాసమూ పెరిగిందికాదు, అన్నీ వేళ్లతోకూడా చచ్చినవి. నా జీవనమంత్రము ఇది:

యావజ్జీవేత్ నైవ జీవేత్
ఋణం కృత్వా సదా పఠేత్!

ప్రపంచమంతా తిరిగి నాలుగు దేశాలూ చూడామని అతిసరదా పడుతూఉన్నా డబ్బులేక పోవడమువల్ల ఇంటిదగ్గిరే కూర్చొని రేల్వే టైమ్టేబిల్లు తిరగవేస్తూఉన్నట్టుగా ఒక-దమ్మిడి అయినా నాది అని చెప్పలేని అవస్థలో నేను ఉన్న-రోజులలో పుస్తకాల క్యాటలాగులు తిరగవేస్తూ సంతోషించే వాడను.మా అన్నయ్యపినమామగారు ఒకఆయన ఉండేవాడు, ఆయన బంగాళీపుస్తకము కొత్తది అచ్చుపడీపడకముందే వెళ్లి కొనేసేవాడు—ఆ పుస్తకము కొనదగినది అవునా కాదా అని ఆలోచించడము అతని పని కాదు. 'నేనుకొన్న పుస్తకము ఒకటీ ఈనాటివరకూ పోగొట్టుకోలేదు' అని అతని గర్వము-మనదేశములో అతనిఅంత అదృష్టవంతుడూ మరిఒకడు

ఉండడనుకుంటాను—మనచేతులలోనుంచి తప్పించుకుపారి-
పోయే వస్తువులు—అనగా, ధనమూ, ఆయువూ, పరాకుగా
ఉన్నవాళ్ల గొడుగులూ—మొదలైన వస్తువులన్నిటిలోకీ
అగ్రస్థానము పుస్తకాలది కదా! దీనినిపట్టి మీరు ఊహించ-
వచ్చును, అన్నయ్యా పినమామగారి బీరువాతాళము పిన
అత్తగారికికూడా దొరకనిచోట ఉండేది అని. చిన్నప్పుడు నేను
మా అన్నయ్యతో కలిసి మామగారి ఇంటికి వెళుతూఉండే
వాడను. వెళ్లి మహారాజుగారి ఎదుట యాచనచేస్తూ నిలుచున్న
ముష్టివాడిలాగు, ఆ తాళాలు వేసిన పుస్తకాలబీరువాలఎదుట
కూర్చుండేవాడను. ఆరోజులలో నా కళ్ళ-నోరూరుకు మితి
ఉండేదికాదు. ఇంత ఎందుకు, ఒకలాగు అంటే అందరికీ బాగా
బోధపడుతుందేమో—నా చదువు ఎంతఅద్భుతముగా ఉండే-
దంటే ఒకపరీక్షా ప్యాసుకా లేకపోయినాను, క్లాసుపుస్తకాలు
ఏ పావుఘంటో చదవవలెను కదా పరీక్ష ప్యాసుకావాలంటే,
అవి చదవడానికి ఆపాటైనా అవకాశము నాకుఉండేదికాదు.

ఫేలుఅయిపోతూఉండడమువల్ల నాకు ఒక విధముగా
మేలే కలిగింది అని అనవచ్చును—విశ్వవిద్యాలయములో
ప్రవేశించి అక్కడ విద్యాదిగువను నిలిచిపోయిఉన్న నీళ్లల్లో-
నుంచి కుండెడేసి నీళ్లుతెచ్చుకొని స్నానముచేసి తృప్తిపొందే
దురవస్థ నాకు తప్పింది. ఇప్పుడు పైనున్న నిండుప్రవాహము-
లోనే నా స్నానము. ఈ రోజులలో ఎంతోమంది బి. ఏ.లూ
ఎం. ఏ.లూ నాదగ్గిరికి వస్తున్నారు. వాళ్లల్లో ఎంతో ఆధునిక

విద్యావంతులూ, నవనాగరీకులూ అయిన వాళ్లుకూడా విశ్వోరి-యాయుగాన్ని తప్పించుకొని రాలేకుండాఉన్నారు. వాళ్ల-ప్రపంచము 'టోలెమీ'నాటి పృథ్వీలాగు పద్ధెనిమిది పంధొమ్మిదో శతాబ్దాలకు స్కూలు తిప్పి తాచిఉన్నది. మనదేశపు విద్యార్థులు పుత్రపౌత్రాది క్రమముగా ఎప్పటికీ ఆభూమినే ప్రదక్షిణచేస్తూఉంటారా అనిపిస్తూఉన్నది. వాళ్ల-మనస్సులు రథయాత్రలోని రథాలవలె అతికష్టముతో 'మిల్' 'బెన్‌థమ్'లనుదాటివచ్చి 'రస్కిన్' 'కార్‌లైల్'—ఆ ప్రాంతాలదగ్గిరికి వచ్చి చతికిల పడిపోతున్నవి. బడిపంతుల మాటల ఆవరణను దాటివచ్చి పైనున్న తాజాగాలిని పీల్చే సాహసము లేదు వాళ్లకు.

కాని మనము ఏదేశాలయొక్క సాహిత్యాన్ని కర్ర-దిమ్మలుగాచేసి మన మనస్సులలో దూర్చి జీర్ణముచేసుకొందా-మని రాత్రింబగళ్లు ప్రయత్నిస్తున్నామో ఆ దేశాలలో సాహిత్యము స్థాణువై కూర్చోలేదు—అక్కడ అది ఆ దేశస్థుల జీవితముతోపాటు ఎప్పుడూ ముందుకు నడుస్తూఉన్నది. ఆ జీవితము నాది కాకపోవచ్చును,ఆ నడకైనా అవలంబించుదా-మని ప్రయత్నిస్తూన్నాను. కేవలము స్వప్రయత్నమువల్లనే ఫ్రెంచ్,జర్మన్, ఇటాలియన్ భాషలు నేర్చుకొన్నాను;కొద్దిరో-జులుఅయినది రష్యన్‌కూడా నేర్చుకోవడము ప్రారంభిం-చాను. ఘంటకు అరవైమైళ్లకు పైగా పరుగెత్తే మాడర్-నిజమ్, ఆధునికత, అనే ఎక్స్‌ప్రెస్‌బండి టిక్కెట్టు కొనుక్కు-

న్నాను. అందుచేత నాకు హక్స్లీ, డార్విన్ అంటే లక్ష్యము లేదు; టెనిసన్ను ఖండిస్తూ మాట్లాడగలను; ఏ మేతర్-లింకునో, ఏ ఇబ్సెన్నో పట్టుకొని మాసపత్రికలద్వారా చవకగా కీర్తిసంపాదించడానికి సంకోచించవలసిన వాడను.

శాస్త్ర జ్ఞానమున్న ఏ నలుగురో నన్ను చూచి నా విలువ పోల్చుకుంటారనే ఆశ చాలాకాలముకిందటనే వదులుకొన్నాను. కాని చూడగా చూడగా ఒకటిమాత్రము కనబడ్డది. కాలేజీ చదువు మానకపోయినా బయట జరుగుతూఉన్న సరస్వతియొక్క వీణాగానము వినగానే దానిలోనున్న ఆవాహనమువల్ల మనస్సులలో కదలికపుట్టే కుర్రవాళ్లు మనదేశములో ముగ్గురు నలుగురు దొరకకపోరు నాకు అనుకొన్నట్టుగానే అటువంటివాళ్లు ఒక్కొక్కడుగానూ ఇద్దరిద్దరుగానూ మెల్లి మెల్లిగా నాదగ్గిరికి వచ్చి చేరుకున్నారు.

నాకు ఉండే రెండో నిషా ఏమిటిఅంటే, బాతాఖాని. సాధుభాష ఉపయోగించి అనవలెనంటే దానికే 'వాదన' అని అనవచ్చును. అనేక సంగతులు ఉపన్యాసాలమూలముగానూ సమయోచితమైనా అసమయోచితమైనా సాహిత్యము మూలముగానూ మనదేశములో నాలుగువైపులా బయటికి వస్తూఉన్నవి. అందులో కొంతభాగము అనుభవముచాలని విషయాలు, అతి పచ్చివి; మిగిలిన చాలాభాగము పాతపురాణము. ఊపిరితిరగకుండా చేసే ఈ పొగలోనుంచివాటిని ఉదారచింత, ఫ్రీథాట్, అనే బయటికి, గాలిలోకి, తీసుకొని-

వచ్చి సజీవులుగా చేదామని మధ్యమధ్య నాకు బుద్ధి పుడు తూంటుంది, కాని వ్రాయడమంటే అతిబద్ధకము నాకు అందుచేత భక్తితో వినేవాళ్లు ఏ నలుగురోదొరికితే బ్రతుకుతాను అనుకొనేవాడను.

నా సంఘము క్రమముగా అభివృద్ధిచెందింది. మా సందులో రెండవనెంబరు ఇంట్లో నా నివాసము. నాపేరు అద్వైతచరణ్. అందుచేత మా సంఘానికి ద్వైతాద్వైత పరిషత్తు అని పేరు ఎర్పడ్డది. మా పరిషత్తుసభ్యులకు సమయాసమయజ్ఞానము ఉండేది కాదు. కొత్తగా అచ్చుపడ్డ పుస్తకమొకటి చేతపుచ్చుకొని ట్రామ్‌టిక్కట్టు బుక్కుమార్కుగా పెట్టి ప్రొద్దున్నే తయారు అయేవాడు ఒకడు—వాదిస్తూ కూర్చోనే ఉండేవాళ్ళము, ఒంటిఘంట అయిపోయేది ఇంకా వాదన పూర్తి అయేదికాదు. ఇంకొకడు చంకను నోటుబుక్కు పెట్టుకొని సాయంకాలము కాలేజినుంచి తిన్నగా వచ్చేసేవాడు. రాత్రి రెండు అయిపోయేది, లేవడముమాసు ఎత్తేవాడు కాడు. సాహిత్యచర్చ చేసేవారికి జ్ఞానరసము కేవలము తలలోనే కాకుండా నాలుకలోకూడా ప్రబలముగా ఉంటుంది అని నాకు బాగా తెలియబట్టి నాస్నేహితులను భోజనానికి ఉండిపొమ్మని తరుచుగా అంటూఉండేవాడను. ఎవరిమీద భారమంతా మోపి ఈలా, నా స్నేహితులను విందుకు పిలుస్తూఉండేవాడనో ఆమెపని ఏమవుతున్నది అనే ఆలోచన చాలాతుచ్ఛమైన ఆలోచన గనుక ఆ ఆలోచనను నా దగ్గిరికి

రానిచ్చేవాడను కాను. జగత్తులో జ్ఞానమనే మహావిష్ణు చక్రము తిరుగుతూ ఉన్నది, మానవజ్ఞానము అందులో నిప్పునకాలి కొంత గట్టిపడుతున్నది, మరికొంత గట్టిపడక ముందే ముక్కలు ముక్కలయి రాలిపోతూ ఉన్నది—అటువంటిపని జరుగుతూఉన్నప్పుడు ఈపాడు సంసారముయొక్క లాగులాటలమీదా, పీకులాటలమీదా, ఈ వంటఇంటి పొయ్యిమీద ఎవరికి దృష్టిఉంటుంది?

"భవానీ కళ్లచిట్లింపు భవునికే తెలియాలి," అంటారు గాని శివునికి ఉండేవి మూడుకళ్లు, నాకుండేవి రెండే! పోనీ, ఆ రెండిటి దృష్టి బాగా ఉన్నదా అంటే అదీ లేదు, పుస్తకాలు చదివిచదివి కళ్లు రెండూ పూర్తిగా పాడుచేసుకొన్నాను. అందుచేత, వేళకాని వేళప్పుడు విందుకు ఏర్పాటుచేయమని అడుగుతూఉంటే నా భార్య, నా భవానీ కళ్లల్లోపుట్టే కోపము నాకంట పడేమార్గము లేకపోయింది. మనఇంట్లో అసమయమే సమయము, అనియమమే నియమము అని క్రమముగా ఆమెకు బోధపడిపోయింది. లయజ్ఞానములేని గడియారము మా ఇల్లు, ఏమూల ఏదిచూచినా తలక్రిందుగా ఉండేది. నాకుఉండే ధనసంపత్తికి ఒకటే ఓపెన్‌డ్రెన్*ఉండేది—ఆ అడ్డులేనికాలువ ఎడతెరిపిలేకుండా పుస్తకాలుకొనడము వైపుకే పరుగెత్తుతూఉండేది. నా స్నేహితులకోసము నా డబ్బులో ముఖ్యభాగము ఖర్చుఅయిపోతూఉండేది. సీమకుక్కలుతినగామిగిలిన అన్నము

* Open drain = కప్పులేని కాలువ.

నాకుతూ వాసనచూస్తూ, కాలక్షేపముచేసే దేశీకుక్కల బ్రతుకులాగు అనేక తాపత్రయాలతో కూడిఉన్న సంసారము ఏలాగు గడుస్తూఉన్నదో నాభార్యకు నాకంటే బాగా తెలియవలెను.

నానావిధాల జ్ఞానమువిషయమయి మాట్లాడుతూ ఉండడము నాలాంటివాళ్లకు అత్యంత అవసరము—పాండిత్యము కనపరచడముకాదు దాని ఉద్దేశము, ఇతరులకు ఉప_కారముచేదామనీ కాదు. వాదిస్తూఉండడము ఆలోచిస్తూ_ఉండడము, ఆలోచిస్తూఉండడము వాదిస్తూఉండడము—ఈ లాగు చేస్తూ ఉంటేనే మనము చదివేది బాగా జీర్ణముఅవు-తుంది, ఇదే జీర్ణానికి మార్గము. నేను ఒకలేఖకుడను అయి_ఉంటే ఇటువంటి ఏర్పాటు అనవసరమే—ఏదోపని ఉండి అది తిన్నగా చేస్తూఉండేవాడు తిన్నతిండి ఏలాగు అరిగించుకోవ_డము అని ఆలోచిస్తూఉండనక్కరలేదు. ఏపనీలేకుండా ఇంట్లో కూర్చుండేవానికే డాబామీద పచారీఅవసరము అన్నముజీర్ణము కావలెనంటే—నా అవస్థా అటువంటిదే.

ఇప్పటి ద్వైతాద్వైతదశము ఇంకా ఏర్పడకముందు, నాదశములో ఉన్నదంతా ఒక్కరే—అది నా భార్య. జ్ఞానము జీర్ణముచేసుకుందామని నేనుచేస్తూఉండే సశబ్దప్రయత్నాలన్నీ అతినిశ్శబ్దముగా రోజూ భరించేది. నాభార్య కట్టుకొనేవి మోటా సీమనూలుబట్టలు, పెట్టుకొనేనగలు మంచిబంగారము

కాదు, నిద్దవస్తువులు కావు, కాని భర్త నోటవెంట వింటూ ఉన్న జ్ఞానములోనూ, ఉపన్యాసాలలోనూ—మానవజాత్యుద్ధరణశాస్త్రము (యూజెనిక్స్) అనండి, మెండెల్ తత్వము-అనండి, నక్షత్రశాస్త్రము అనండి, గణిత శాస్త్రముఅనండి,—దేనిలోనూకూడా ఏవిధమైన కలితీ లేదు, ఇవి గుల్లపదార్థాలు-కావు. నా సంఘము పెద్దది అయినప్పటినుండీ ఆమెకు నా ఉప-న్యాసాలు వినడము ప్రాప్తిలేకపోయింది, అయినా ఎన్నడూ ఆమెనోటవెంట ఎటువంటిఫిర్యాదూ నేను వినలేదు.

నాభార్యపేరు 'అనిల' ఆ పదముయొక్క అర్థము నాకు తెలియదు, మా మామగారికి తెలుసునేమో అంటే అదీ లేదను కుంటాను. మాటమాత్రము వినడానికి అతిమధురము—చటా-లున వినగానే ఆ మాటకు ఏదో అర్థముఉన్నది అని ఎవరి-కైనా అనిపిస్తుంది. శబ్దరత్నాకరములో ఆ శబ్దముయొక్క అర్థము ఏమయి ఉన్నా దాని నిజమైన అర్థముమాత్రము—"నాభార్య ఆమెనాన్నగారి ముద్దుకూతురు" అని. పద్దెనిమిది మాసాల పిల్లడిని విడిచిపెట్టి మాఅత్తగారు కాలముచేస్తే పిల్లడికి దక్షత లేదని మనస్సును సమాధానపరచుకొని మా మామగారు తత్క్షణమే రెండవ పెళ్లి చేసుకున్నారు. ఆయన ఉద్దేశము ఎంతవరకు నెరవేరిందో ఈదిగువ చెప్పుతూఉన్న సంగతివల్ల బోధపడుతుంది: ఒక రెండురోజులలో చచ్చిపోతా రనగా మామగారు అనిలను పిలిచి ఆమె చెయ్యి తన రెండు-చేతులలో పెట్టుకొని అన్నారు, "అమ్మా, నేను పోతున్నాను,

ఇక 'సరోజ్'ని చూసేవాళ్లు నువ్వుతప్ప మరెవ్వరూ లేరు."
రెండవ పెళ్లి పిల్లలకోసము ఆయన ఏమిఏర్పాటు చేశారో
నాకు సరీగా తెలియదు గాని అనిల చేతిలో మాత్రము రహస్య-
ముగా ఏడు వేల అయిదువందలరూపాయిలు పెట్టారు.
"ఈరూపాయిలు వడ్డీకివేసి ఆ వడ్డీతోనే కాలక్షేపము చేదా-
మనుకోకుండా, ఈరూపాయిలలోనుంచే ఖర్చుచేసి సరోజ్
చదువుసంధ్యలకు ఏర్పాటుచేసి వాడిని పెద్దవాడిని చేయి,
తల్లీ," అని అన్నారు మామగారు.

ఇది చూచి నాకు కొంచెము ఆశ్చర్యమువేసింది. మామ
గారు చాలా బుద్ధిశాలి అని కాదు నేనుఅనేది, గాని కొంచము
ప్రపంచజ్ఞానము కలవాడు లాభనష్టాలు బాగా ఆలోచించి
ఏపనినైనా చేయవలసినవాడు, కనుక తన కొడుకుకు చదువు-
చెప్పించి అతనిని పెద్దవాడినిచేసే పూచీ ఎవరికైనా అప్పచెప్ప-
వలసేవస్తే అది నా చేతికే అప్పచెప్పిఉండవలసినది-అదే అన్నిటి-
కంటె ఉత్తమమైనపని, ఈ విషయములో నాకు ఎటువంటి-
సందేహమూ లేదు. అల్లుడికంటె తనకూతురే యోగ్యురా-
లన్న అభిప్రాయము మామామగారి తలలోకి ఎప్పుడు
దూరిందో నేను చెప్పలేను. అయినా డబ్బావగాణీ విషయ-
ములో నేను ధర్మరాజునని మాత్రము మామగారు నమ్మారు,
లేకపోతే అంతసొమ్ము కూతురుచేతికి అప్పచెప్పకపోదురు. దాని
నిజము ఏమిటి అంటే ఆయన విక్టోరియాయుగానికి చెందిన

వాడు, ఫిలిస్ స్టైన్—చిట్టచివరవరకూ నన్ను పోల్చుకోలేక పోయినాడు.

నాకు కోపమువచ్చింది—ఈ విషయమయి ఒక్కమాట అయినా అనవద్దు అని నిశ్చయించుకొన్నాను—అలాగే ఒక్క-మాటయినా అనలేదు కూడానూ. అనిల దానివిషయమయి మొట్టమొదట కదపాలిగాని నాఅంతట నేనేమాత్రము ఏమీ అడగకూడదు అని అనుకొన్నాను. నా సహాయముతప్ప వేరే-సాధనము లేదు అనిలకు అని నా నమ్మకము. కాని అనిల నా సలహా ఎంతకూ కోరకుండా ఉండడము చూచి, పాపము, సాహసము చాలకుండా ఉన్నదని ఊహించి చివరకు ఒకనాడు మాటలసందర్భములో నేనే అడిగాను, "సరోజ్ చదువుమాట ఏమిటిచేశావు?" అని. "మాస్టరును పెట్టాను, రోజూ స్కూలుకు వెళుతూఉన్నాడు," అన్నది అనిల. సరోజ్ చదువుభారము నేనే వహించగలను అని అప్పుడు నేను సూచావాచా తెలియ-జేశాను. శిక్షాసంబంధమైన కొత్తమార్గాలనుగురించి కొంచెము ఉపన్యసించి చూచాను— అనిల ఊఁ అనలేదు, ఆఁ అన-లేదు. నేను కాలేజీఃరీతి లేపీ ప్యాసుకాలేదు గనుక చదువువిషయములో సలహాఇచ్చే సామర్థ్యముగాని అధి-కారముగాని నాకు లేదు అని కాబోలు అనిల అభిప్రాయము. నేను ఇన్నాళ్లబట్టీ ప్రసంగిస్తూఉన్న ఇవల్యూషన్ (పరిణామ-వాదము), రేడియో, యూజెనిక్స్, మొదలైనవాటివిలువ అని-లకు ఏమీ తెలియలేదు అన్నమాట. ఫిఫ్తుక్లాసు కుర్ర-

వాడికి అంతకంటె బాగా తెలుస్తుంది అని అనుకొనిఉంటుంది బహుశా. మాస్టరుగారు స్కూలులో కుర్రవాళ్ల చెవులు మరలు తిప్పినట్టుగా నులుపుతూఉంటే చదువు కుర్రవాళ్ల మనస్సులకు తాచుకుపోతుంది. నాకు బాగా కోపమువచ్చింది—జ్ఞానమే అన్నిసంపదలకంటె గొప్పసంపద అని నమ్మేవాళ్లు ఆవాళ్లఎదుట తమవిలువను కనపరచి తమయెడల నమ్మకము పుట్టిద్దామని ఎన్నడూ ఆశపడకూడదు, అని నాలో నేను అనుకొన్నాను.

ప్రపంచములో మనము చూస్తూఉండే పెద్దపెద్ద జీవన నాటకాలలో చాలా భాగము తెరవెనకనే జరుగుతుంది, పంచమాంకములో చివరభాగము వచ్చేసరికి తెర అకస్మాత్తుగా లేస్తుంది. నేనూ నా ద్వైతసోదరులూ బెర్గ్‌సన్‌గారి ఫిలాసఫీ, ఇబ్‌సెన్‌నాటకాలలోని సైకాలజీవిషయమయి వాదిస్తూ కూర్చున్నరోజులలో, అనిలయొక్క జీవనయజ్ఞవేదిమీద అగ్నిహోత్రాలు ప్రారంభించలేదు అని అనుకొనేవాడను. ఇప్పుడు వెనుకకు తిరిగి ఆ రోజులమాట ఆలోచించుకుంటే స్పష్టముగా కనబడుతూఉన్నది—నిప్పున కాల్చి సమ్మెట్టుదెబ్బలు కొట్టికొట్టి జీవనప్రతిమను తయారుచేస్తూఉన్న సృష్టికర్త ఆనాడు కూడా పనిచేయకుండా కూర్చోలేదు, అనిల హృదయశాలలో తనపని తాను చేస్తూనేఉండెను. అక్కడ తమ్ముడికీ అక్కకూ సవితితల్లితో జరుగుతూన్న ఘాతప్రతిఘాతాలలీల ఇప్పుడు నాకు స్పష్టమవుతూఉన్నది. పురాణాలలోఉన్న వాసుకి

మోస్తూఉన్న పురాణపృథ్వికి చలనములేదు, సంసారములో ఆడది మోస్తూఉన్న దుఃఖభరితమైన పృథ్వికి నిశ్చలత్వము లేదు—ప్రతినిమిషమూ క్రొత్తగా దెబ్బతింటూ తయారవుతూంటుంది ఈ పృథ్వి. ప్రతిక్షణమూ క్రొత్తదవుతూఉన్న ఆ బాధను వహిస్తూ లెక్కలేని ఇంటిపనుల మధ్యనుండి ప్రతిదిన యాత్ర చేస్తూఉండడము ఇల్లాలికి ఎంతకష్టమో ఆ అంతర్యామి పోల్చుకుంటాడేమోగాని మరి ఎవరికీ తెలియదు—ఇతరుల మాట ఏలాగున్నా నేను మాత్రము పోల్చుకోలేకపోయినాను. నాపక్కనే ఇంత ఆతురతా, ఇంత నిష్ఫలప్రయాసా, ప్రేమా, దుఃఖమూ, అతినిశ్శబ్దముగా లోలోపున మథించుకొనిపోతూ ఉన్నవని నే నెన్నడూ ఊహించనైనా ఊహించలేదే!

నా ద్వైతదళమువిందురోజు వచ్చింది. ఆ రోజునాటి ఉద్యోగపర్వమే అనిలజీవనముయొక్క ప్రధాన పర్వమయినదని ఇప్పుడు తెలుస్తూఉన్నది. ఆ అక్కమనస్సును అన్నిటికంటే బలమైనప్రేమతో కట్టిఉంచినది ఆ చిట్టితమ్ముడే, దానికి సందేహము లేదు. సరోజను పెద్దవాడినిచేయడమువిషయములో నా సలహా, నా సాయమూ, అనవసరమని అక్క అనుకోవడమువల్ల నేను అటువైపు చూడడము మానుకొన్నాను, కుర్రవాడు ఏలాగున్నాడని అడగనైనా అడగలేదు.

ఆలా ఉంటూఉండగా ఎవరో వచ్చి మా సందు ఒకటవ నంబరు ఇంట్లో దిగారు. ఈ ఇల్లు పేరుపడ్డవర్తకుడు

లక్షాధికారి ఒకడు కట్టించినది. రెండుమూడుతరాలలో వాళ్ల డబ్బుఅంతా మాయమయిపోయింది, మనుష్యులుకూడా అదృశ్యమయిపోయినారు—ఇప్పుడు మిగిలిఉన్న వాళ్లు ఇద్దరు వితంతువులు మాత్రమే. వీళ్లుఇద్దరయినా ఎప్పుడూ ఇక్కడే ఉండకపోవడము చేత ఆ ఇల్లు ఒక పాడుఇల్లులాగు తయారు అయింది. అద్దె విస్తారము కావడము చేత ఇల్లు ఎప్పుడూ ఖాలీవే, మధ్యమధ్య పెళ్లిళ్లకుమాత్రము వీళ్లూ వాళ్లూ దిగుతూఉండే-వారు. కాని ఇన్నాళ్లకు ఒకరు కుదిరారు ఆఇంట్లో దిగేవారు. 'సితాంశుమౌళి' అందాము ఆయనపేరు, ఆయన ఒక గొప్ప జమీందారు, ఆయనతాలూకాపేరు 'నరోత్తమపురము' అను-కోవచ్చును.

ఇంతగొప్పవాడు వచ్చి నా పొరుగున కూర్చున్నా నాకేమీ తెలియనేలేదు. పృథ్వీమీద పడ్డప్పటినుంచీ కర్ణునికి కవచము ఉన్నట్టుగా, నాకూ విధిదత్తమైన కవచము ఒకటి ఉన్నది, అది స్వాభావికముగా నాకున్న పరధ్యానమే, ఇదే కారణము పొరుగుఇంటిసంగతి నాకు తెలియకపోవడానికి. నాకవచము బహు దిట్టమైనది, అతి దళమైనది—లోకములో చరాచరవస్తువులు తమలోతాము నాచుట్టూ చేసుకొంటూ-ఉన్నఅల్లరా, తోపుడురాపుడూ, నానా దుర్భాషలూ, నా వరకూ రాకుండా ఆపే ఉపకరణము నాదగ్గర ఉన్నది.

కాని ఈ నవనాగరికపు రోజులలో పెద్దమనుష్యులమని పేరుపెట్టుకొని తిరుగుతూన్నవాళ్ళు చేసే అల్లరా, గడిబిడా

మనుష్యుడు స్వాభావికముగా చేసేదానికంటె అనేకరెట్లు అధికము, అది కేవలము అస్వాభావికము. రెండుచేతులూ రెండు కాళ్లూ ఒక తలా గలవాడు మానవుడు. హఠాత్తుగా కాళ్లుగాని చేతులుగాని అనేకమయినా, లేక ఒకతలకు మారుగా అనేకముతలలు పుట్టినా వాడిని దైత్యుడు అంటాము. దైత్యుడు ఎప్పుడూ ధూంధాం అని శబ్దము-చేస్తూ తన హద్దులను మీరనిదే ఉండలేడు. తనకుఉన్న బలబాహుళ్యముతో స్వర్గమర్త్యలోకాలను కెలుకుతూ ఉం-టాడు. అటువంటివాని గురించి తలపెట్టకుండా ఉందామన్నా వీలులేదు. ఎంత అనవసరమైనా ఎవడిగురించి అనుకోక వీలులేదో వాడే జగత్తుయొక్క అస్వస్థతకు కారణము, అటువంటి వాడికి స్వర్గములో ఉండే దేవేంద్రుడుకూడా జడుస్తాడు.

సీతాంశుమౌళి ఆ దళానికి చెందినవాడు. ఒక్కమనిషికి ఇంత అనవసరమైన బలము ఉండవచ్చును అని నాకు ఎన్నడూ తట్టనైనాతట్టలేదు. గుర్రపుబండీ, గుర్రాలూ, లాష్కర్లూ మొదలైన ఉపకరణాలతో కలిసి, పదితలలూ, ఇరవై చేతులూ గల, దానవమూర్తి అన్నట్టు వచ్చి మాఇంటిపక్కకు తయా-రయినాడు. దీనివల్ల మాసారస్వత స్వర్గముయొక్క ప్రహరీ రోజుకురోజూ విరిగిపడిపోతూన్నది. మా పొరుగాయనతో నాకు మొదటి పరిచయము కలగడము మాసందుచివరను. మాసందుకుఉండే గొప్పసుగుణము ఏమిటిఅంటే నాలాంటి

పరధ్యానము మనుష్యులు ముందుకు చూడకుండా, వెనక-మాట ఆలోచించకుండా, కుడివైపుకుగాని ఎడమవైపుకుగాని ముఖమైనా తిప్పకుండా అందులో నడుస్తూఉండవచ్చును, ఎటువంటి అపాయమూ కలుగదు. మెరిడిత్ కవి గురించిగాని బ్రౌనింగు కవిత్వము గురించిగాని, మనదేశములో క్రొత్తగా వెలువడుతున్న కవిత్వాల గురించిగాని నా మనస్సులో నేను విమర్శిస్తూ ఆ సందులో పచారిచేస్తూఉన్నా ఆకస్మిక మరణము వస్తుందని భయపడనవసరము ఉండేదికాదు. కాని ఆవాళ మాత్రము ఏమీ లేనట్టేఉండి 'హో ఓ' అని ఒకభయంకరమైన శబ్దము వినబడ్డది. వెనకకు తిరిగి చూడునూ—టాప్ తెరిచిన బ్రూహామూ దాని ఎర్రని రెండు పెద్దగుర్రాలూ నా మీద పడడానికి సిద్ధము! బండియజమానే స్వయముగా తోలు-తూన్నాడు, కళ్లెము రెండు చేతులతో గట్టిగా లాగుతూన్నాడు, పక్కను కోచ్‌మాన్ కూర్చొని ఉన్నాడు. ఆ ఇరుకు సందులో, పక్కను, ఒక చిన్న చుట్టలదుకాణము ఉంటే, దానిని అంటి-పెట్టుకొని రెండుకాళ్లూ దగ్గిరికి నొక్కుకొని ప్రాణాలు ఏలాగో దక్కించుకొన్నాను. నన్ను చూచి జమీందారుగారు రౌద్ర-మూర్తి అయిపోయినారు. అజాగ్రత్తగా తోలేవాడు అజాగ్రత్తగా నడిచేవానిని చూచి ఎన్నడూ క్షమించడు. దీనికి కారణము మీాద ఉదహరించినదే—కాలినడక నడిచేవానికి రెండే కాళ్లు, అతను మానవుడు; జోడుగుర్రాలు తోలుకొం-టూ వెళ్లేవానికి ఎనిమిదికాళ్లు, ఇతను దానవుడు. వీనికిఉండే

అస్వాభావికబలమే జగత్తులో ఉన్న ఉపద్రవానికి కారణము. రెండు కాళ్ల మనుష్యుని పుట్టించిన దేవుడు, ఆకస్మికముగా పుట్టిన ఈ ఎనిమిది కాళ్ల జంతువనే వైపరీత్యానికి సంసిద్ధుడై ఉండలేదు.

నాస్వభావాన్నే కాపాడుకొంటూ సకాలములో ఆ అశ్వరథాన్నీ, ఆ సారథినీ మరచిపోయిఉందును—ఈ విచిత్రప్రపంచములో ఇటువంటివి జ్ఞాపకముఉంచుకోదగిన వస్తువులు కావు. కాని మనుష్యుడు చేయగలిగేదానికంటె అనేకరెట్లు అల్లరి చేసే శక్తి వీళ్ల చేతులలో ఉన్నది. అందుచేత మూడవనంబరు పొరుగువిషయము అనుకొన్నంత మాత్రాన రోజులకొలది, మాసాలకొలది తలపెట్టకుండా ఉండగలిగే-వాడను, కాని ఈ ఒకటవ నంబరు పొరుగుమాత్రము ఎంత ప్రయత్నించినా మరుపుకు రాకుండా ఉన్నది. పదిపన్నెండు-గుర్రాలు ప్రతిరాత్రీ గుర్రపుసాలబల్ల నేలమీద సంగీతములేని తాళము వేస్తూ ఆడుతూ ఉండేవి, నా నిద్ర ఎగిరిపోయేది. తెల్లవారుతూనే గుర్రానికి ఒకడుచొప్పున పదిపన్నెండుగురు గుర్రపువాళ్లు వచ్చి ఘోరమైనశబ్దము చేసుకొంటూ మాలీస్-మొదలుపెట్టేవారు. ఆశబ్దము విని చికాకుపుట్టకుండా మనస్సును కాపాడుకోవడము ఎవరితరము? ఇంతే కాదు. ఆయనకు ఒక ఒడియా నౌకరూ, ఒక భోజ్‌పూర్ దర్వానూ, ఒక ఖన్‌సమా, ఒక బిహారీ బెహారా, ఉండేవారు. వీళ్లుగాని, ఆదళములో ఉన్న మరి ఎవరుగాని, గొంతుకలను వశములో ఉంచుకోవలసినవారు

కారు—మితభాషాపక్షపాతి అందులో ఒకడూ లేడు. అందు-చేతనే నేను అన్నాను, 'ఉన్నమనిషి ఒక్కడేగాని, అల్లరిచేసే ఉపకరణాలు మాత్రము అనేకము'అని. ఇదే దైత్యులుచేసే పని, దీనివల్ల తమశాంతికి భంగముకలుగదేమో బహుశా. రావ-ణుడు తన పదిముక్కులతో గుర్రుపెడుతూఉంటే తన నిద్ర-కేమో భంగముకలుగదు, నిజమే; గాని పొరుగువారిఅవస్థ కొంచెము ఆలోచించి చూడదగినదే కదా! స్వర్గముయొక్క ప్రధానలక్షణము హద్దులను దాటకుండా ఉండడము. పూర్వము ఆ నందనవనములో ప్రవేశించి దానిశోభను నాశ-నముచేసిన దైత్యబృందముయొక్క ప్రధానగుణము మితి మీరడము. హద్దులను మన్నించని దానవుడే ఇప్పుడు రూపా-యిలసంచి చేతపుచ్చుకొని మానవుని లోకాలయాన్ని ఆక్ర-మించుకొని కూర్చున్నాడు. పక్కకు తప్పుకొని అతనికంట పడకుండా కాలక్షేపము చేసుకుందామంటే నాలుగు గుర్రా-లతోవచ్చి మీదపడతాడు, పైగా కళ్లు ఎర్రచేస్తాడు.

ఒకనాడు సాయంకాలము ఒక్కణ్ణే కూర్చొని సముద్రపు పోటూపాటూ గురించి పుస్తకముఒకటి చదువుతున్నాను, మాద్వైతదళమువాళ్లు ఇంకా ఎవరూ రాలేదు. ఝుయిమని శబ్దముచేసుకొంటూ పొరుగుఇంటినుండి జ్ఞాపకముచేయడానికి అన్నట్టుగా వచ్చి ఏదో మా అద్దముతలుపుకు ఢబ్‌మని తగిలింది. అదేమిటని చూదును—ఒక టెన్నిస్ బంతి. చంద్ర బింబముయొక్క ఆకర్షణో, పృథ్వియొక్క జలరాసులలో పుట్టే

పోటూపాటూ, అన్నీ వెనకకు వెళ్లినవి, నాకు పొరుగువాడు ఒకడుఉన్నాడు అని జ్ఞప్తికి వచ్చింది—అతని విషయమై ఉత్త 'ఉన్నాడు' అంటే సరిపడదు, 'ఉండడము'లో అతిజోరుగా ఉన్నాడు నలుగురికీ నచ్చేటట్టుగా. నాకు అతను కేవలము అనవసరము, అయినా అత్యంత ఆవశ్యకము అయినాడు. పరతీక్షణము చూదును, నా ముసలినౌకరు, అయోధ్య పరుగె-త్తుకువస్తూఉన్నాడు, ఊపిరి అందనంత జోరుగా పరుగెత్తుతూ-న్నాడు. నాకుఉన్న నౌకర్లుఅల్లా వీడుఒక్కడే; ఎప్పుడు పిలిచినా, ఎంతపిలిచినా, జబాబైనా వచ్చేదికాదు. "ఏమిరా అబ్బాయి, ఎక్కడికి పోయినావురా, నీ దర్శనమే లేదు," అని ఎప్పుడైనా అంటే, "ఉన్నది ఒక్కణ్ణి, పని చూస్తే జాస్తీ," అనేవాడు. మరి ఎందుచేతనో తెలియదుగాని ఈవాళమాత్రము ఎటువంటి నోటీసూ, తాఖీదూ లేకుండా బంతి పట్టుకొని పొరుగింటివైపు పరుగెత్తుతున్నాడు. సంగతి తరువాత తెలిసింది—ఒకమాటు బంతి అందిస్తే నాలుగు కానులు బక్‌షీస్ దొరుకేదట ఒకటో నంబరులో.

చూచాను—ఒకటవ నంబరు చేస్తూఉన్నది నా అద్దము తలుపులు పగలగొట్టడము, నాశాంతి భంగముచేయడమే కాదు, నా నౌకర్లమనస్సులూ, నా స్నేహితులమనస్సులూ-కూడా తెంచేస్తూఉన్నాడు. నేను ఎందుకూ పనికిరానివాడనని నా నౌకరు అయోధ్యగాడి నిర్లక్ష్యము రోజుకురోజు అధికము కావడములో ఆశ్చర్యము ఏమీ లేదు, కాని నా బృందానికి

నాయకుడైన కనైలాల్ మనస్సుకూడా ఒకటవ నంబరువైపు తిరగడము మొదలుపెట్టింది. ఇతనికి నాయెడల కల భక్తి ప్రయో-జనమూలకమైనది కాదు, కేవలము ప్రేమమూలకమైనది, కనుక ఇతని విషయమయి నాకు ఎటువంటిసందేహము ఉండేది కాదు. అటువంటప్పుడు ఒకనాడు బంతివెంట అయోధ్య పరుగెత్తు-తూంటే, వాడికంటె జోరుగా పరుగెత్తి బంతిని పట్టుకొన్నాడు కనైలాల్; పట్టుకొని పొరుగింటివైపు తిరిగాడు. పొరుగాయనతో స్నేహముకలపడానికి ఇది ఒకసందు, దాని-కేమీసందేహము లేదు—బ్రహ్మవాదినిఅయిన మైత్రేయికోరిక కాదు కనైలాల్ కోరిక, ఉత్త అమృతమువల్లనిండే కడుపు కాదు ఇతనిది.

ఒకటవనంబరుయొక్క బాబూగిరిని తీవ్రముగా ఖండించి ఉందును. ఆకాశాన్ని రంగుమేఘాలతో కప్పితే చిన్నగాలి వేయగానే మేఘాలు నాలుగువైపులా చెదిరిపోయి వెనకనున్న ఆకాశము కనబడిపోతుంది—మనలోఉండే శూన్యతను పై ఆడంబరముతో కప్పయత్నిస్తే ఆలాంటి పరాభవమే, జరగ-గలదు అని చెప్పబోతున్నాను. అంతలో కనైలాల్ వచ్చి, "మనిషి కేవలము సరుకులేనివాడు కాదు, బి. ఏ. ప్యాసు అయినాడు సుమీ," అని అన్నాడు సితాంశుమాళినిగురించి. కనైలాల్ కూడా బి. ఏ. కావడముచేత ఆ డిగ్రీ విషయమై నా మనస్సులో ఉండేది పైకి అనడానికి వీలులేకపోయింది.

ఒకటవనంబరు ప్రధానలక్షణాలలో ముఖ్యమైన అంగము శబ్దము చేయడము. ఆయన మూడు యంత్రాలు వాయించ-గలడు, కార్నెట్, ఎస్ రాజ్, సెతార్. వీటిపరిచయము నాకు అప్పుడప్పుడు కలుగుతూఉండేది. నేను సంగీతవిద్వాంసుడను అని నాకు అభిమానము లేదు గాని నా అభిప్రాయముమాత్రము సంగీతము ఉన్నతకళలలోనిది కాదు అని. పృథ్వీమీద ఇంకా భాష పుట్టకుండా మనుష్యుడు మూగవాడై ఉన్న కాలములో పుట్టింది సంగీతము. అప్పటికి మనిషికి ఆలోచనశక్తి లేదు, మనుష్యుడు కేకలుమాత్రము వేయగలిగేవాడు. ఆ ఆది-మావస్థలోనున్న మనుష్యులకు ఈ కాలములోకూడా శబ్దము చేయడమే సరదా. నా ద్వైతపరిషత్తులో అధమము నలుగు-రైనా ఉంటారు—ఒకటవనంబరులో సెతార్ పాట ప్రారంభము అయిందాఅంటే వీళ్లకు మరి దేని మీాదా మనస్సు నిలిచేది కాదు--అటువంటప్పుడు గణితతత్త్వములో క్రొత్తఅధ్యాయము మొదలుపెడితే ఒకపేజీ అయినా ఏలా' నడుస్తుంది?

మా దళమువారు అనేకమంది ఒకటవనంబరువైపు ఒరగడము చూచికాబోలు అనిల నాతో ఒకనాడు, పక్కఇంటి అల్లరి జాస్తీగా ఉన్నది మనము ఇంకొక ఇల్లు చూచుకొని పోతే బాగా ఉంటుంది అని అన్నది.

నాకు చాలా సరదావేసింది. మా పరిషత్తుతో అన్నాను "ఒక్క సంగతి చూశారా, స్త్రీలకు ఒక విధమైన సహజ-

జ్ఞానముఉన్నది; ప్రమాణాలవల్లగాని నిర్ధారణచేయలేని సంగ-
తులు ఎంతబోధపరిచినా బోధపరుచుకోలేరు ఆడవాళ్లు.
ప్రమాణము లేనిసంగతులు అతిసులభముగా గ్రహిస్తారు."

కన్నైలాల్ నవ్వుతూ అన్నాడు, "ఔను, పిశాచాలూ, దయ్యాలూ, బ్రాహ్మణపాదధూళిమహత్వమూ, పతిదేవుని పూజాఫలమూ— మొదలైన నానారకాల విషయాలగురించీ ఒక్క నిమిషములో గ్రహిస్తారు."

"కాదయ్యా, హాస్యము కాదు; ఒకటో నంబరు సందడి చూసి నేను స్తంభితుడను అయిపోయినాను గాని ఆ వేష భూషణాలువల్ల అనిలమాత్రము భ్రమపడలేదు అని నేను అంటూఉన్నది," అని నేను అన్నాను.

ఇల్లుమార్చడముగురించి అనిల నాతో రెండుమూడు సారులు అన్నది. నాకూ మారుద్దామనే ఉండెను,కాని కలకత్తా నగరములో సందుసందూ తిరగడానికి కావలసిన పట్టుదల నాకు లేకపోయింది. ఈలా ఉంటూఉండగా కన్నైలాలున్నూ సతీశున్నూ ఒకటవనంబరులో టెన్నిస్ ఆడుతూండగా ఒకనాడు సాయంకాలము చూచాను. జోతీనున్నూ హరేనున్నూ అక్క-డసంగీతముజట్టులో చేరారు అనికూడా వీళ్లూవాళ్లూ అను కొంటూఉండగా విన్నాను— ఒకడు స్టాండు హార్మోనియమ్ వాయిస్తాడట ఇంకొకడు తబలా వాయిస్తాడట. అరుణ్ అక్కడ హాస్యముపాటలు పాడుతూంటాడనీ, వాటికని

చాలాకీర్తి సంపాదించాడనీ కూడా విన్నాను. అయిదారుసంవత్సరాలబట్టి వీళ్లనందరినీ ఎరుగుదునుగాని ఇందులో ఎవరికీ ఇటువంటి ప్రవీణత ఉన్నదని మాత్రము ఎన్నడూ నేను అనుమానించనైనా లేదు.మతాల భేదాభేదాలు కనుక్కొంటూ అన్నీ మతాలనూ పరీక్షచేయడమందు ఆసక్తిగలవాడు అరుణ్ అని నాకు పూర్తిఅయిన నమ్మకము ఉండేది. అటువంటి అరుణ్ హాస్యముపాటలలో పండిఉన్నవాడు అని నేను ఏలాగు అనుకోగలను?

కాని నిజముచెపుతాను వినండి; బకటవ నంబరంటే పైకి నాకు ఎంతతృణీకారముగాఉండేదో లోపున అంతఈర్ష్య పుడుతూఉండేది. నాకు ఆలోచనచేయగల శక్తి ఉన్నది, వాదన చేయగల శక్తి ఉన్నది. ఎటువంటి విషయము పట్టుకొన్నా ఒక్క నిమిషములో సారము గ్రహించగలను, గొప్పగొప్ప సమస్యలు పరిష్కారనుచేయగలను. మానసిక సంపదలో సితాంశుతో నన్ను సరిపోల్చడానికి ప్రయత్నించడను ఎవరితరమూ కాదు. అయినప్పటికీ అతనిని చూచేసరికి నాకు ఈర్ష్యపుట్టింది. కారణము వింటే అందరూ నవ్వుతారేమో.

సితాంశు రోజూ ప్రొద్దున్నే లేచి ఆ పెద్ద గుర్రము ఎక్కి షికారుకు బయలుదేరేవాడు. అప్పుడు అతను ఆ లగాములు పట్టి లాగి ఆ పెంకిగుర్రాన్ని లొంగదీస్తూండగా చూడాలి—ఏమి అద్భుతము అతని శక్తి, అతని నేర్పు! అది రోజూ

చూస్తూఉంటే' 'ఆహా,' నేనూ అతనిలాగు తోలగలిగితేనా!' అని నాకు అనిపించేది! నేర్పు అన్న వస్తువు ఏవిషయములోనూ నాకు లేదు, అందుచేతనే నేర్పుఅంటే అంతభయంకరమైన ఆకర్షణ నాకు. రాగాలు నేను పోల్చుకోలేను గాని చాలారోజులబట్టి దొంగతనముగా కిటికీదగ్గిర నిలుచొని సితాంశు ఎస్రాజ్ వాయిస్తూంటే వినేవాడను. ఆ యంత్రముమీద అతనికి గల ఆధికారానికి ఏవిధమైన అడ్డూ మితీ కనబడేదికాదు. ఈ మాట అనుకొన్నప్పుడల్లా నామనస్సు ఆనందముతో నిండిపోయేద. ఆ యంత్రము అతనిప్రేయసి, ప్రేయసివలెనే అతనినిప్రేమిస్తూన్నది అనిపించేది. తనంతటతానే వచ్చి తననుతాను పూర్తిగా ఆయనకు అమ్ముకొన్నది అనిపించేది. ఇంట్లోఉండే వస్తువులూ, ఇల్లూవాకిలీ, చుట్టూఉండే జనులూ, జంతువులూ—అన్నిటిమీదా సహజముగా అతనికి అధికారము ఉండేది, అన్నిటిమీదా ఒకవిధమైన కాంతిని వెదచల్లుతూఉండేవాడు. అతనిలో ఉండే శక్తి వివరించడానికి వీలులేనిది. అది నాకుమాత్రము దుర్లభమైన వస్తువు. ప్రపంచములోఉండే ఎటువంటివస్తువు కొరకైనా ఆయన ప్రార్థించడము అవసరము లేనిపని, అన్నీ తమంతటతామే వచ్చి అతనిచేతిలో పడేవి. బుద్ధిపుట్టి అతను ఎక్కడికి వెళితే, అక్కడే అతనికి ఒక ఆసనము వేసిఉండేది.

మా ద్వైతబృందమువాళ్లు ఒకడు టెన్నిస్కోసమని, ఒకడు కార్నెట్కనీ, మరిఒకడు సంగీతానికనీ, ఒక్కొక్కడు ఒకటవనంబరువైపు ఎప్పుడు వెళ్లడముప్రారంభించారో

అప్పుడే నాకు తట్టింది, వాళ్ల వాంఛను పోగొట్టి వాళ్లను ఉద్ధ-
రించవలెనంటే ఇల్లుమార్చడముతప్ప వేరేమార్గము లేదు అని.
ఆలాంటప్పుడు ఇళ్లఏజంటు వచ్చి నేను కోరేమోస్తరుఇల్లు బారా
నగర్, ఖాసీపూర్, ఆప్రాంతాలలో కొన్ని ఉన్నవి కావలెనా
అని అడిగాడు. నేను ఇష్టపడ్డాను. అప్పుడు ఉదయము తొమ్మిది,
తొమ్మిదిన్నర అయిఉంటుంది. ఇంటిమాట అనిలతో చెప్పి కొత్త-
ఇంటికి వెళ్లడానికి సిద్ధపరుద్దామని లోపలికి వెళ్లాను. అనిల
వంటఇంటిలో కనబడలేదు, కొట్టుగదిలో లేదు, చివరకు పడక-
గదిలో కనబడ్డది —కిటికీలో గజాలమీద చేరబడి పర
ధ్యానముగా కూర్చున్నది. నన్ను చూడగానే లేచి నిలుచున్నది.

"ఎల్లుండే మనము కొత్తఇంటికి వెళుతాము," అని
నేను అన్నాను.

"మరి పదిహేనురోజులు పోనివ్వండి," అన్నది.

"ఏమీ? ఆలస్యము ఎందుకూ?"

"సరోజ్ పరీక్ష నాలుగురోజులలో తెలుస్తుంది, నా
మనస్సు ఏమీ బాగు లేదు. ఇవన్నీ చక్క-బెట్టుకోవడమంటే
చికాకుగా ఉంటుంది."

అనిలతో నేను ప్రసంగించని లెక్క-లేనన్ని విషయా-
లలో సరోజ్ చదువు ఒకటి. అందుచేత మా ఇల్లుమార్చడము
వెనకపడ్డది. అంతలో సితాంశు దేశాటనచేయడానికి దక్షిణాది

వెళుతూన్నాడని విన్నాను. అది సఫలముఅయితే మాత్రము ఒకటవనంబరుమీద పడిఉన్నఛాయ జరిగిపోతుంది అనుకొన్నాను.

తెరలవెనకనే జరుగుతూండే నాటకముయొక్క పంచమాంకఅంత్యభాగము అకస్మాత్తుగా మనకు దృష్టిగోచరము అవుతుంది. నా పెళ్లాము నిన్నను పుట్టింటికి వెళ్లి ఈవాళ తిరిగివచ్చేసింది. వచ్చి, తలుపులు బిగించుకొని గదిలో కూర్చున్నది. ఈవాళ పౌర్ణమి; మా పరిషత్తు మాసవిందుదినము.— ఆసంగతి ఆమెకు తెలుసును. దానివిషయమై ఆమెతో మాటలాడుదామని తలుపు కొట్టాను. ఏమీ జబాబులేదు. 'అనూ' అని పిలిచాను, 'అనిలా' అన్నాను. కొంతసేపటికి తలుపు విడ్డది.

"ఈ రాత్రి విందుకు కావలసిన వన్నీ సిద్ధముగా ఉన్నవి కదూ?" అని అడిగాను. అనిల నోటితో జబాబు చెప్పలేదు గాని ఉన్నవని తల ఆడించింది.

"నీచేతితో చేసిన ఉసిరికపచ్చడి మన సభవారికి చాలా ఇష్టము, అదిమాత్రము మరిచిపోకూడదు సుమా!" అని అంటూ పైకి వచ్చేశాను. ఎదురుగుండా కన్నైలాల్ తయారు అతనిని చూచి, "కన్నై, మీరు ఈవాళ కొంచెము పెందలాడే రావాలి సుమండీ," అన్నాను.

"అ దేమిటి, ఈ వాళకూడా మీటింగే!" ని అత్యాశ్చ-ర్యపడుతూ అన్నాడు కన్నై

"సందేహాము ఎందుకు?" అన్నాను నేను. "మీటింగు ఎందుకు జరగదు? మ్యాక్సిమ్ గోర్కీ—క్రొత్త నవలా, బెర్గ్సన్ మీద రసెల్ వ్రాసినవిమర్శనా, *కచోడీ, ఉసిరికపచ్చడీ—అన్నీ సిద్ధముగా ఉన్నవి కదా, మీటింగు ఎందుకు జరగ దను-కొంటున్నావు?"

కన్నై నిర్ఘాంతపోయి నా ముఖమువైపు చూస్తూ నిల-బడిపోయినాడు. ఒక్క క్షణము ఊరుకొని, "ఈవాళ మనసభ జరగకపోతే ఏమి అద్వైతబాబూ?" అన్నాడు.

కారణము అడిగాను కన్నైను. తెలిసింది—మా బావ-మరిది సరోజ్ నిన్న మధ్యాహ్నము ఆత్మహత్య చేసుకొన్నాడు. పరీక్ష పాసుకాలేదని సవితితల్లి జోరుగా తిట్టింది, అది భరించ-లేక కండువాతో పీక బిగించుకొని చచ్చిపోయినాడు.

"నీకు ఏలాగు తెలిసింది?" అని అడిగాను.

"ఒకటో నంబరులో విన్నాను."

"ఒకటో నంబరా!" అవును ఒకటవ నంబరే—నిన్న సాయంకాలము కబురు వినగానే అనిల పుట్టింటికి వెళ్లింది; బండికోసము కబురు పంపించి తెప్పించుకుంటే ఆలస్యము

---

* గోధుమ పిండీ పప్పూ మసాలాతో తయారుచేసిన నేతిలో వేయించిన రొట్టెలు.

అవుతుందని తక్షణమే బయలుదేరి దారిలో అద్దెబండి దొరికితే అది ఎక్కి వెళ్లింది. అయోధ్యద్వారా సంగతి విని సితాంశు అక్కడికి వెళ్లాడు, పోలీసువాళ్లను ఓదార్చి రాత్రికిరాత్రీ శవాన్ని దహనము చేయించి చేయవలసినదంతా చేసి వచ్చాడు."

గాభరాగాభరాగా లోనికి వెళ్లాను, అనిల తిరిగీ గదిలోకి వెళిపోయి తలుపు గడియవేసుకొని కూర్చుంటుంది అని అనుకొన్నాను. కాని అటువంటి దేదీ జరగలేదు; కొట్టుగది వరండాలో కూర్చొని కూర తరుగుతూన్నది. ఆమె ముఖము వైపుచూచాను, బోధపరుచుకున్నాను—ఒక్కరాత్రిలో ఆమె జీవితమంతా తారుమారయిపోయింది!

"నాకేమీ చెప్పావే కావు!" అని అన్నాను నిష్ఠూరముగా.

ఆ పెద్దపెద్ద కళ్లు రెండూ నావైపు ఎత్తింది, ఒక్కమాట అనలేదు. నేను సిగ్గుచేత అతి చిన్నపుచ్చుకున్నాను. "మీతో చెప్పి ఏమి లాభము?" అని గాని అనిల అనిఉంటే నేను అనవలసినది ఏమీ ఉండకపోను—సుఖదుఃఖాలన్నీ తాను ఒక్కర్తే భరిస్తూ ఈ సంసారము ఏలాగు గడుపుకువస్తూన్నదో నాకు ఏమైనా తెలుసును గనుకనా! "అనిల్, ఈవాళ మా విందు జరగదు ఇదంతా నిలిపేయి! అని అన్నాను అయినా.

"ఎందుకు జరగదు? మహాబాగా జరుగుతుంది. నేను ఇంత కష్టపడిచేసిన ప్రయత్నమంతా వృథాచేస్తానంటే ఒప్పు-

కోను సుమండీ," అని తరుగుతూన్న కూరలవైపు చూస్తూ-ముఖము ఎత్తకుండానే, అన్నది.

"ఈవాళమాత్రము సభ జరగదు, ఏమయినా సరే," అని అన్నాను నేను.

"సరే, మీసభ కాకపోతే కాకపోనివ్వండి, నేను మీ అందరికీ విందుచేస్తాను వచ్చి తీరాలి."

నాకు మహాసంతోషము వేసింది. అనిల అంతగా దుఃఖించడము లేదు అని అనుకొన్నాను. ఒకప్పుడు ఆమెకు అనేకమైన గొప్పగొప్ప సంగతులు బోధపరిచాను, దానివల్ల కొంత నిష్కాంత కుదిరిఉంటుంది. నేను చెప్పినదంతా పూర్తిగా బోధపడిఉండక పోవచ్చును, నిజమే; కాని *పర్సనల్ మ్యాగ్నెటిజమ్ అంటూ ఒకటి ఉన్నది కదా!

నలుగురైదుగురుతప్ప మా ద్వైత పరిషత్తు సభ్యులంతా వాచ్చారు విందుకు. కనై రాలేదు. ఒకటవనంబరు టెన్నిస్ జట్టువాళ్లు రాలేదు. మర్నాటి ఉదయము రైలులో సితాంశు వెళిపోతాడట, ఆఖరువిందుకు అందరూ అక్కడికి వెళ్లారు. ఇవతల మావిందు అతి దర్జాగా జరగింది, అనిల ఆనాడుచేసిన ఏర్పాటులూ పిండివంటలూ నేను ఎన్నడూ చూడలేదు. లాభనష్టాలమాట ఎన్నడూ యోచించని నాలాంటి బేఇసాబీ మనిషికికూడా, 'ఇంత ఖర్చా' అనిపించింది.

* Personal Magnetism.

ఆ రాత్రి విందు ముగిసేసరికి ఒంటిఘంటన్నరా రెండు ఘంటలు అయిఉంటుంది. బాగా ఆయాసపడి పడుకోడానికి వెళుతూ, "పడుకోడానికి రావూ?" అని అనిలను అడిగాను. "సామాను చక్కపెట్టి వస్తాను." అన్నది.

మర్నాడు లేచేసరికి సుమారు ఎనిమిది ఘంటలు అయింది. పడకగదిలో నా మంచముపక్కను టీపాయిమీద నా సులోచనాలు ఎత్తుపెట్టి ఒక చిన్న కాగితము ముక్క కనబడ్డది—దాని మీద అనిల దస్తూరితో ఈ మాటలు ఉన్నవి—"నేను వెళుతున్నాను. నాకోసము వెదకవద్దు, ప్రయత్నము వృథా అవుతుంది నేను మరి దొరకను."

నాకు ఏమీ బోధపడలేదు. టీపాయిమీద ఒక టిన్-డబ్బా కనబడ్డది. అందులో అనిలవస్తువులుఅన్నీ ఉన్నవి—చేతిగాజులుతప్ప అన్నీ అందులో ఉంచేసింది, మురుగులు-కూడా తీసిపడేసింది. కిటికీలలో ఒకదానిలో తాళముచేతుల-గుత్తి కనబడ్డది. తక్కినవాటిలో రూపాయిలూ, చిల్లరడబ్బులూ పొట్లాలుకట్టి పడిఉన్నవి. నెలఖర్చులు కాగా మిగిలినది దమ్మిడీఅయినా ఉంచుకోకుండా వెళిపోయిందన్న మాట. ఒక చిన్న నోటుబుక్కులో పాత్రసామానుల పట్టీ, అందులోనే మరిఒక పేజీలో చాకలిపద్దు, మరి ఒక పేజీలో గొల్లవాడిలెక్క, మరి ఒకచోట చిల్లరదుకాణము లెక్క. ఎక్కడికి వెళ్లిందో అదితప్ప అంతా తెలియజేసింది.

'అనిల వెళిపోయింది'—నాకు బోధపడ్డదంతా అది ఒక్కటే. ఇల్లంతా వెదికాను, మామగారి ఇంటికి కబురు పంపాను, అనిల జాడ లేదు. ఎప్పుడైనా ఎటువంటివిపరీతము జరిగినా నాకు మతిపోతుంది, ఎక్కడికి వెళ్లవలెనో, ఏమి చేయవలెనో ఏమీ తోచదు. ఆనాడూ అలాగే పిచ్చెత్తినలాగు అనిపించింది. గుండె గబగబ కొట్టుకొంటున్నది. అక్కడ కూర్చొని కూర్చొని ఛటీమని తల ఎత్తాను, ఒకటోనంబరు వైపు కళ్లు వెళ్లినవి. ఆ ఇంటితలుపులూ, కిటికీలూ అన్నీ మూసిఉన్నవి. దేవిడీదగ్గిర కూర్చొని దర్వాన్ గుడుగుడు పీలుస్తున్నాడు. జమీందారుగారు తెల్లవారుఝామున వెళిపోయినారు. గుండె గభేల్‌మన్నది. అంతా బోధపడిపోయింది. ఇవతల నేను తదేకధ్యానముగా నూతన న్యాయమార్గాలవిషయమై చర్చ-చేస్తూ కూర్చున్నాను, వెనకనుండి మానవసంఘములో దాగొనిఉన్న పురాతన అన్యాయము నాఇంట వలపన్నుతున్నది ఫ్లాబర్ట్, టాల్‌స్టాయ్, టూర్గనీఫ్—మొదలైన గొప్పగొప్ప కథాలేఖకులు వ్రాసిన నవలలలోనూ, కథలలోనూ ఇటు-వంటివి జరిగినప్పుడు, ఆ ఘటనలను మహాఆనందముతో సూక్ష్మాతిసూక్ష్మముగా విభజించి చూస్తూఉండేవాడను. కాని అటువంటిది నా ఇంట్లోనే జరగగలదని నేను ఎన్నడూ ఊహించనైనా ఊహించలేదు.

మొదటిదెబ్బ కొంచెము సరుదుకోగానే, ప్రవీణుడైన తత్త్వజ్ఞానివలె, దేనికి ఇవ్వవలసిన విలువ దానికి ఇచ్చి,

నిష్పక్షపాతముగా అంతా పరీక్ష చేసి చూదామని ప్రయత్నించాను. నా పెళ్లినాటిమాట జ్ఞప్తికి వచ్చింది, మొట్టమొదట ఒకవెర్రి నవ్వు నవ్వాను. ఆహా, మనుష్యుడు ఎంతప్రయత్నాన్ని వృథాగా వ్యయముచేస్తున్నాడు, ఎంత నిష్ఫలమైన ఆశతో కాలముగడుపుతున్నాడు, ఎంత ఆశక్తిని వ్యర్థపరుస్తూ ఉన్నాడు! ఎన్నో రాత్రుళ్లు, ఎన్నో పగళ్లు, ఎన్నో సంవత్సరాలు ఎటువంటి చింతా లేకుండా గడిపాను. 'నా పెళ్లాము ఉన్నది ఏమీ భయములేదు' అనే నమ్మకముతో కళ్లైనా తెరచిచూడలేదు. ఈవాళ హఠాత్తుగా కళ్లు తెరిచి చూచాను- బుద్బుదము పగిలిపోయింది.

అవును నిజమే పగిలిపోయింది, కాని పగిలిపోతే పగిలిపోనీ, ప్రపంచములో ఉన్నదంతా బుడగ కాదే! సమయాతీతమై జననమరణాలను అతిక్రమించి శాశ్వతముగా నిలిచే పదార్థము నాకు దొరకక పోతే కదూ!

ఈలాగు ఎన్నో అనుకొన్నాను కాని నా నూతన జ్ఞానము నిలిచి ఉండలేదు. హఠాత్తుగా దెబ్బతగలగానే ఎక్కడో అడుగుకు చేరిపోయింది. నా చిన్ననాటి జీవుడు తిరిగీ పైకి వచ్చింది, ఏడుస్తూ నాలుగువైపులా పరుగెత్తడము ఆరంభించింది. బయట వరండా మీద పచారీ చేసిచేసి చివరకు ఇంట్లోకి వెళ్లాను. ఇంట్లో అంతా శూన్యము. ఇంట్లో ప్రతిగదిలోనూ నాలుగేసిమారులు తిరిగాను. చివరకు నాభార్య రోజూ

పరధ్యానముగా కూర్చుండే కిటికీదగ్గిరికి వచ్చాను. ఆగదిలో-ఉన్న వస్తువులన్నీ తిరగాబోర్లా వేశాను. అనిల తలదువ్వు-కుండే స్టాండుఅద్దముదగ్గిరికి వచ్చాను, దానిసొరుగు లాగాను. సొరుగులో రిబ్బన్‌తోకట్టిన ఉత్తరాలకట్ట ఒకటి కనబడ్డది. ఆ ఉత్తరాలన్నీ ఒకటోనంబరు దగ్గిరనుండి. చూచేసరికి నా ఒంట్లో మంటపుట్టింది. ఉత్తరాలన్నీ తగలపెట్టేదామని బుద్ధిపుట్టింది మొట్టమొదట, కాని మనకు బాధ ఎక్కడ విస్తారమో అటువైపే కదా ఆకర్షణ—ఆ ఉత్తరాలు చదివితేనే గాని ఉండలేకపోయినాను. ఉత్తరాలన్నీ యాభైమార్లు చదివాను. మొదటి ఉత్తరము మూడునాలుగు ముక్కలకింద చించేసి ఉన్నది. ఉత్తరము చదవగానే చించేసి తిరిగీ బుద్ధిమార్చుకొని అతిజాగ్రత్తగా ఆ ముక్కలన్నీ చేర్చి జిగురుతో అంటించినట్టుగా ఉన్నది. ఇదిగో ఆ ఉత్తరము:

"నేను వ్రాసే ఈ ఉత్తరము మీరు చదవకుండా చించేసినా నాకు విచారములేదు, కాని నేను చెప్పదలచుకొ-న్న దేమో చెప్పితీరుతాను.

నేను మిమ్మును చూచాను. పుట్టినప్పటినుండీ కళ్లు విప్పు-కొని జగత్తంతా తిరిగాను. కాని చూడదగినది నా ముసై్ఫ రెండోఏట, ఈనాడు, చూడడము నాకు ప్రాప్తించింది. నా కళ్లమీాద నిద్రఅనే దళసరి మూత ఒకటి పడిఉండెను. అది మీారు మీామంత్రదండముతో ముట్టుకొన్నారు, మీా స్పర్శ

తగలగానే అది మాయమై పోయింది. నాకు ఇప్పుడు ఒక కొత్త జన్మ కలిగింది నా కొత్తకళ్లతో మిమ్మును చూస్తున్నాను. స్వయముగా మిమ్మును పుట్టించిన ఈశ్వరునికే విస్మయము పుట్టిస్తూఉండే మహాధనము మీరు, అటువంటి వర్ణనాతీతమైన మిమ్మును నేను చూచాను. దొరకవలసినదీ కోరదగినదీ నాకు దొరికింది, నాకు మరిఏమీ అక్కర లేదు. మీ స్తవము మీకు వినిపిద్దామని తప్ప వేరే కోరిక నాకు లేదు. నేనే ఒక కవిని అయిఉంటే ఈ మీ స్తవము ఉత్తరములో వ్రాసి మీకు పంపను, పాటరూపముగా ప్రతికంఠములోనుంచి వినబడేటట్టుచేసి దానిని ప్రపంచమంతటా వెదచల్లిఉందును. ఈ ఉత్తరానికి జబాబు రాదు అని నాకు తెలుసును, కాని నామాటలకు అపార్థము చేయకండి. నేను మీకు ఎటువంటి హానీచేయలేను మిమ్మును అవమాన పరచడము నాకు సాధ్యముకానిపని. ఎటువంటి సందేహమూ లేకుండా నాపూజ అందుకొండి. నా భక్తిని మీరు మన్నించండి, మీకు మేలవుతుంది. నేనెవరినో నేనుచెప్పనక్కరలేదు, ఆ సంగతి మీదగ్గిర దాగి ఉండదు."

ఇదే విధముగా ఒక పాతికఉత్తరాలు.విటిలో దేనికైనా అనిలవద్దనుండి జబాబు వెళ్లినట్టు ఆ ఉత్తరాలలో ఎటువంటి ప్రమాణమూ లేదు, జబాబు వెళ్లినట్టైనా అపస్వరము ప్రారంభమయిఉండును, బహుశా; ఆ మంత్రదండధారిణి మాయమయి పోయిఉండును, స్తవము చల్లారిపోయిఉండును.

కాని ఏమి టీ ఆశ్చర్యము. సితాంశు రెప్పపాటులో-పోల్చుకొన్న అనిలను, ఎనిమిది సంవత్సరాలు రాత్రింబంగళ్లు అంతదగ్గిర ఉండికూడా నేను పోల్చుకోలేకపోయినాను! చివరకు అప్పుడైనా మెలకువ తెప్పించినవి అతని ఉత్తరాలు నా కళ్ళ మీాదఉన్న కప్పు ఎంతదట్టమయినదో తెలియకుండాఉన్నది. అనిలను పురోహితుని చేతులలోనుంచి పుచ్చుకొన్నాను గాని, నా దానిగా చేసుకోడానికి తగినవెల ఈనాటివరకు విధాతకు నేను చెల్లించలేదు. నా ద్వైతదళాన్నీ, నా సైకాలజీనీ, నా న్యాయశాస్త్రాన్నీ అనిలకంటె గొప్పవాటిగా చేశాను. నేను ఆమెను ఎన్నడూ చూడలేదు, క్షణకాలముపాటు అయినా నా దానిగా చేసుకోలేదు. అటువంటి అనిలను, ఇంకొకరు తన యావజ్జీవమూ సమర్పించి తనదానిగా చేసుకొన్నప్పుడు నేను ఎవరితో ఫిర్యాదు చేసుకొనేది, నా దురవస్థ ఎవరికి తెలియజేసేది ?

ఆఖరు ఉత్తరము ఇది:

“పైనుండి చూడడమువల్ల మీా నిజము బోధపడదు. లోపునుండి చూస్తేనేగాని మీా దుఃఖమూ, మీా మనోవేదనా తెలియదు అక్కడ నా పరీక్ష అతి కఠినమైనది. నా పురుష హస్తాలు చచ్చినవాటివలె పడిఉండలేవు. స్వర్గమర్త్యలోకాల-లో ఉండే సమస్తశాసనాలనూ ఛేదించి మిమ్మును మీా జీవన-వ్యర్థతనుండి ఉద్ధరించవలెనని నాకు వెర్రికోరిక పుడుతున్నది.

కాని మీదుఃఖము మీ అంతర్యామియొక్క ఆసనము. అటు వంటి ఆసనముమీద చెయ్యివేయడానికి నాకు ఏమి అధికారమున్నది? అయినా రేపుఉదయమువరకు వ్యవధి ఉన్నది. ఆలోగా నాకు ఆకాశవాణి వినబడి నా ద్విధను పోగొట్టి నామనస్సును స్థిరముచేస్తే ఏదోఒక గొప్పసంగతి జరగబోతుంది. వాంఛానిలముయొక్క తీవ్రతవల్ల దారిచూపించేదీపము ఆరిపోవచ్చును, గనుక మనస్సును స్థిరపరచి ఉంచుకోవలెను. నిశ్చలమైన మనస్సుతో 'మీకు శుభమవు గాక,' అనే మంత్రము మాత్రమే ఉచ్చారణచేస్తున్నాను."

బోధపడ్డది. ద్విధ చల్లారింది, ఇద్దరిదారులూ ఒక్కటే అయిపోయినవి.

మొదటి ఏనాలుగుఉత్తరాలో అయినతరువాత సితాంశు వ్రాసిన ఉత్తరాలన్నీ నేను వ్రాసిన ఉత్తరాలా అని నాకు ఇప్పుడు అనిపిస్తూఉన్నది. సితాంశు చేసిన స్తవము నా స్తవమే!

చాలారోజులు గడిపాను, గాని పుస్తకాలమీదికి మనస్సును మరి తిప్పుకోలేకపోయినాను. ఏలాగైనా అనిలను ఒకమారు చూడవలెనని భయంకరమైన బాధ నామనస్సులో పెరుగుతూవచ్చింది. ఎంతప్రయత్నించినా మరిచిపోలేకుండా ఉన్నాను. సితాంశు హిమాలయ పర్వతముమీద 'మసోరీ'లో ఉన్నాడని విన్నాను.

అక్కడికి వెళ్లాను, షికారు తిరుగుతూఉండగా సితాంశును అనేకసార్లు చూచాను, కాని అనిలమాత్రము ఒకనాడూ అతనితో కలసి కనబడలేదు. అనిలను అవమాన-పరిచి పొమ్మన్నాడా అని నా మనస్సులో భీతి పుట్టింది. బాధ-భరించలేక చివరకు ఒకనాడు అతనిని కలుసుకొన్నాను. నాకూ ఆయనకూ జరిగినమాటలన్నీ సవిస్తరముగా వ్రాయ-డము అనవసరము. "ఈనాటివరకు నాకు ఆమెవద్దనుంచి వచ్చినది ఈ ఒక్కఉత్తరమే," అంటూ చివరకు సితాంశు జేబులో నుంచి ఎనామల్ పనిచేసిఉన్న చిన్నకార్డుకేసు పైకి తీశాడు. మడతలుపెట్టిన చిన్న కాగితముముక్క అందులోనుంచి తీసి నాచేతిలో పెట్టాడు. దానిలోఉన్నది ఇదిగో: "నేను వెళు-తున్నాను. నాకోసము వెదకవద్దు, ప్రయత్నము వృథాఅవు-తుంది, నేను మరివారకను."

నాకు వ్రాసిన నీలిరంగు లెటరుపేపరులో సగము నా ఉత్తరానికి పోగా మిగిలినసగము ఇది — అవే అక్షయలు, అదే దస్తూరి, అదే తారీకు.

౧౯౧౭

# విశ్వభారతి గ్రంథమాల

## రవీంద్రనాథుని "ఇంటా బయటా"

భారతి:

"... ... ... ... ... ... కథ యతి మనోహ-రమై, యింపుగా నున్నది. పాఠకులయందు మంచి భావదీప్తిని కలుజేగయగలదు. చక్కని ఉన్నతమైన భావములకు సముద్ర-ముగదా, రవీంద్రుని రచన!

భాషాంతరీకరణము అతి సరళముగాను, స్వేచ్ఛగాను, సహజముగ నున్నది. చక్కని యింపైన వాడుక భాష యుపయోగింపబడినది. ఠాకూరుగారి భావముల కేమాత్రమును నష్టము కలిగియుండదనియే చెప్పవచ్చును.

... ... ... ... ...

మంచి కాగితముపై చక్కనియచ్చు మంచిబైండు."

గిడుగు రామమూర్తిపంతులుగారు:

"... ... ... ... ... ... అనన్య సాధ్యమయిన పని సాధించిన నాప్రియమిత్రునికి అభినందనములు. ... ... ఘన మాతృభాషయొక్క మాధుర్యము, స్వచ్ఛత నీ గ్రంథ-ములందు అభివ్యక్తమవుతున్నది. ... ... ... ... రజ

పుటలూ కలిపి చేతిలోపెట్టుకొని చూచినప్పుడు ఆనంద బాష్పములు పడ్డవి."

---

"రవీంద్రుని పోష్టాఫీసు"

భారతి:

"... ... ... ... ... ... కథ అతిసులభమైనదిగాను, సాధారణమైనదిగాను కన్పడుచున్నను ఇందలి భావములు కడునుత్తమమైనవి.

మనుష్యజీవనము ఆవేదనవలన, ముక్తజీవనపథగామిగా యెట్లగుటకు యత్నించునో కవి యిందు తెలియబరచు-చున్నాడు.

బాలుని ముద్దులొల్కుపదములు యింపుగొలుపుచుం-డును. భాష సరళమై, ఆనందము నొడగూర్చుచున్నది. ...

---

మెతర్ లింక్ కవి 'స్టిల్ మాండ్ మేజస్ట్రేట్'

ఆంధ్రపత్రికా సారస్వతానుబంధము:

... ..." ఈకథయందు స్వార్థపరుల విచక్షణలేని యన్యాయ ప్రవర్తనలును; స్వార్థరహితుల, ధర్మకాంక్షాపరుల న్యాయైక-వర్తనయు, పరోపకారనిరతియు చక్కగా చూపింపబడినవి.

వాడుకభాషలో సుబోధకముగా వ్రాయబడినది. ... ... ... ... భావము లుత్తమమైనవి. ........."




# విశ్వభారతి గ్రంథమాల

౧ రవీంద్రనాథ ఠాకూర్ గారి
"గృహప్రవేశం" (నాటకం) ౦-౧౨-౦

౨ రవీంద్రనాథ ఠాకూర్ గారి
"పోస్టాఫీస్" (నాటకం) ౦-౧౦-౦

౩ మేతర్ లింక్ గారి
"స్టిల్ మాండ్ మేజస్ట్రేట్" (నాటకం) ౧-౦-౦

౪ రవీంద్రనాథ ఠాకూర్ గారి
"ఇంటా బయటా" (నవల)(క్యాలికో బైండు) ౩-౦-౦
డిటో (ర్యాపర్ బైండు) ౨-౮-౦

౫ రవీంద్రనాథ ఠాకూర్ గారి
కథాగుచ్ఛము-౧ ౧-౪-౦

౬ రవీంద్రనాథ ఠాకూర్ గారి
కథాగుచ్ఛము-౨ ౧-౪-౦

(అన్నిగ్రంథాలలోనూ పటములు ఉన్నవి.)

వి శ్వ భా ర తి
చెన్నపురి ఏజన్సీ ౩౨౩ తిరువత్తూర్ హైరోడ్
చె న్న పు రి

# ఇంటా బయటా

ముగ్గురుముఖ్యపాత్రలూ తమతమ అవస్థలనుండి వేరు వేరుగాచెప్పి కలిపిఅల్లిన మూడుపాయల జట ఈ కథ.

సత్యకాముడైన నిఖిల్ కోరేది స్వాతంత్ర్యము— తనకు స్వాతంత్ర్యము కావలెను, తన భార్యకు కావలెను, తనదేశములో ఉండే యావన్మందిప్రజలకూ కావలెను, ప్రపంచములోఉండే సమస్త దేశాలకూ కావలెను. స్వేచ్ఛలేనిజీవనము జీవనము కాదు, స్వేచ్ఛలేనివారు చేసిన పనికి అర్థము లేదు. గనుక తనభార్యను అంతఃపురంమధ్యనుండి బయటి ప్రపంచముయొక్క బహిరంగములోనికి బలవంతపెట్టి తీసుకు వస్తాడు. అక్కడ తనభార్య తనను తాను పూర్తిగా తెలుసుకొని తన జీవితాన్ని తానే ఎంచుకోవలెనని నిఖిల్ ఉద్దేశము. అటువంటిప్రయత్నము చేసేవారికి దారిలో సంఘటిల్లే చిక్కుల గురించీ, జయాపజయాల గురించీ, సుఖ దుఃఖాలగురించీ తెలుసుకోవలెనన్నా లేక వాటివల్ల మనజ్ఞానము పొందగల వికాసముగురించి తెలుసుకోవలెనన్నా "ఇంటా బయటా" కంటె మంచిగ్రంథము దొరకదు.

సందీప్ స్వదేశీప్రచారకుడు, వాడిఅయిన మనస్సుగలవాడు, తళుకు తళుకున మెరిసే మాటలప్రవాహాలను వదల గలవాడు. ఇతను 'వందేమాతరం' మంత్రం పఠిస్తూ రోడ్డు వెంబడి వెళుతూ'ంటే హిందూమహాప్రపంచములో పుస్తకాలు చదువుకొంటూ కూర్చొనిగలిగిన స్కూలుకుర్రవాడేడీ, తన పని

తాను చేసుకొంటూ కూర్పోగలిగిన యువకుడేడీ? ఇతనికి కావలసినది స్వదేశీ, స్వదేశము—దీనికి మించిన ధర్మము లేదు దీనికిమించిన నీతి లేదు, శక్తి లేదు, నిజము లేదు; దీనికి అడ్డుగా వచ్చిన నీతిని, ధ్వంసము చేయవలెను, సత్యాన్ని మంటిలో కలిపివేయవలెను, అనేవాడు సందీప్. నిఖిల్ కోరేది నిజము. నిజము త్యజించడమువల్లగాని స్వదేశీ విస్తరింపజేయలేనప్పుడు, స్వదేశీ అక్కర లేదు నిఖిల్‌కి. దేశమంతా ఏదికోరితే అదే నిజము సందీప్‌కి. దేశమే దేవత అతనికి, దేశస్థులు అందరూ అక్కరలేదంటూఉన్న సత్యము అసత్యము. 'నా దేశమే నీతి కంటె గొప్పది, సత్యముకంటె గొప్పది, అనేవాడు నిజముగా దేశానికి ఉపకారము చేస్తాడా, లేక చివరకు ఏపనులు చేస్తూ ఉన్నప్పటికీ నా దేశము నిజముకంటే గొప్పదైనట్టుగా దేశోద్ధారకుడనైన నేను దేశముకంటే కూడా చాలాగొప్పవాడను అనే వాదములోకి వచ్చి తేలుతాడా? "ఇంటా బయటా" చదివి మీరు ఆవిషయము మరింత చక్కగా యోచించగలరు

విమల నిఖిల్‌భార్య, ఎటువంటిఅనుభవమూ లేదు, అనుభవమువల్ల రావలసిన జ్ఞానము ఇంకా పుట్టలేదు, ముగ్ధ. ఇంటిగోడలమధ్యనున్న ప్రపంచముతప్ప మరి ఏసజీవమైన పదార్థాన్నీ ఎరగని ఈమె కనపరిచే పతిభక్తికి ఏమి విలువ ఉన్నది? అందుచేత సజీవిద్యైన వాటికొరకు వెర్రికోరికగల నిఖిల్ ఆమెను బలము ప్రయోగించి బహిరంగప్రపంచములోకి పంపుతాడు. విమలవంటివారి దశ ఏమి కావచ్చును? నడిసముద్రములో

విడిచిపెట్టిన చుక్కానులేని ఓడవలె నాశనమయిపోతారా? గాలి ఎటువైపు కొడితే అటువైపు కొట్టుకుపోతారా? లేక దెబ్బలు తిని తిని మెలకువ తెచ్చుకుంటారా? అటువంటివారికి జ్ఞానవంతులు ఏవిధమైన సహాయము చేయగలరు?—వారిని కలగవచ్చునని శాశ్వతముగా గదిలో పెట్టితాళము వేస్తారా? మోతాదు మోతాదుగా కొలిచి స్వేచ్ఛ ఇస్తామంటారా? స్వేచ్ఛ ఒకరికి ఇంకొకరు ఇవ్వవలసిన పదార్థమా?—ఇటువంటి నానారకాల విషయాలూ బాగా బోధపరుచుకో దలచినవారు "ఇంటా బయటా" చదివితీరవలెను.

మనోహరమైనకథ చెపుతూ మనకే తెలియకుండా మన మనస్సులలో మూలమూలలను దాగిఉన్న ఆశలనూ, కోరిక లనూ, మనకుతెలియజేస్తున్నారు ఠాకూర్ గారు. మనుష్యుని విలువ దేనిలో ఉన్నది, దేశభక్తి అనగా ఏమిటి, దాంపత్యము లో ఉండే శాశ్వతవస్తు వేమిటి, దేనివల్ల దాంపత్యము పృథ్వీమీదఉండే అన్నిపదార్థాలతోనూ గొప్పదికాగలదు.— ఇటువంటివి అనేక ఆలోచనలతో నిండిఉన్న మనుష్యుల మన స్సుల చరిత్రలతో అల్లిన ఇంపైన కథ "ఇంటా బయటా."

కవులలో అగ్రస్థానమునకు అర్హుడైన రవీంద్రనాథుని గ్రంథాలలో మొదటి వరుసను ఉంచదగిన గ్రంథము ఈ "ఇంటా బయటా."

# గృహప్రవేశం

ప్రేమతో నిండిఉన్న పూర్ణజీవనము సార్థక మానవ జీవనము. ఆ జీవనము సంపాదించుటకు మానవుడు చేయవలసిన ప్రయత్నము మనలో పురికొల్పి దానికితగిన ఉత్సాహము మనలో పుట్టించడానికి విశ్వహృదయము సదా కనిపెట్టుకొని ఉంటుంది. అట్టివిశ్వహృదయము ఠాకూర్ గారువ్రాసిన ఈనాటకములో, అక్కబిడ్డలకు తన సర్వమునూ అర్పించి తనజీవనము సార్థకపరుచుకొనకోరుతున్న పిన్ని హృదయముద్వారా వ్యక్తమవుతున్నది. బాహ్యచక్షువుకు కనబడని సంపదకోసమూ స్థూలనేత్రానికి కనబడని సహవాసము కోసమూ మనుష్యుడు తన యావదాస్తీ ధారపోసి ప్రయత్నము చేస్తున్నప్పుడు అటువంటి పిన్ని హృదయము, పూర్తిగా స్వార్థరహితమైనది కావడముచేత, వివేకము బోధపరచడానికి బయలుదేరదు; తనకు చేతనైనంతవరకు ఆ ప్రయత్నములో తోడ్పడుతుంది.

అక్కకొడుకు తనడబ్బంతా ఖర్చుపెట్టి ఊర్వశివంటి తనభార్యామణియెడల తనకుగల అనురాగమును ఎల్లకాలమూ లోకానికి చాటించగలిగే "తాజ్‌మహాల్"ను కట్టించబోయినప్పుడు, అది కేవలము వృథాప్రయాస అని తెలిసినా, మనస్ఫూర్తిగాచేసే ఏ ప్రయత్నమూ వృథాకానేరదని నమ్మి పిన్ని చేసిన హెచ్చరిక అతి మనోహరమైనది.

పూర్తికాని ఆ తాజ్‌మహాల్‌లో గృహప్రవేశం చేయించబోయిన పిన్ని హృదయాన్ని మన హృదయాలలో గృహప్రవేశం చేయించి, షాజహాన్ చక్రవర్తి కట్టించిన తాజ్‌మహాళ్లు ఎన్నైనా ఇవ్వలేని శాశ్వతపదవిని ఆ పిన్ని హృదయానికి ఈ నాటకము ద్వారా రవీంద్రుడు ఇచ్చాడు.

రవీంద్రనాథ ఠాకూర్ గారి

# కథాగుచ్ఛము

రవీంద్రుని కథాగుచ్ఛములో ఉండే కథలు కొన్ని బాగా చిన్నవి, కొన్ని చాలా పెద్దవి; పద్ధెనిమిది పేజీల 'కాబూలీవాలా' అందులోదే, ఎనభై పేజీల 'రాసమణికొడుకూ' అందులోదే. ౧౮౯౨వ సంవత్సరములో వ్రాసిన "సెలవులు" అనే చిన్న కథలోనైతేనేమి, ౧౯౧౭వ సంవత్సరములో రచియించిన "ఒకటవ నంబరు"లోనైతేనేమి రవీంద్రుడు కవీంద్రుడని సార్థకపరచిన అద్భుతశక్తి పూర్తిగా వ్యక్తమవుతున్నది. కథలుచెప్పే నైపుణ్యములో రవీంద్రునితో చాలినవారు ఎక్కడోగాని ఉండరు. కాని రవీంద్రునిలోఉన్నది అట్టి అపూర్వ రచనా నైపుణ్యమొక్కటే కాదు. మానవ హృదయములోని రహస్యాలు కనుకొన్నవాడు ఆయన, గనుక ఇతరుల అనుభవాలు అతను చెప్పే ప్రతిచిన్నసంగతి ద్వారా, ప్రతికథద్వారా మన అనుభవములో ప్రవేశించగలదు. రవీంద్రుడు మనకు కథలు చెపుతూ ఉన్నప్పుడు ఆయన చేసేది కేవలము మనచేత తన ఇంపైన కథలను వినిపించడమే కాదు; సజీవులైన స్త్రీ పురుషులమధ్యనూ, మన అన్నదమ్ములు అక్కచెల్లెళ్ల మధ్యనూ, తలిదండ్రులమధ్యనూ, మిత్రులమధ్యనూ, శత్రువులమధ్యనూ, మనను తీసుకువెళ్లి కూర్చోబెడతాడు. వారి ఆనందము మన ఆనందమవుతుంది, వారిదుఃఖము మనలో మానవదుఃఖమును నివారణచేసే ఉద్యమము పుట్టిస్తుంది. వారికి కలిగే ఆశాభంగము మనను ఆశలేనివారిగా చేయడానికిమారుగా మనలో కొత్త ఉత్సాహము పుట్టించి, మానవహృదయములోని ఆశలను సఫలముచేసే కొత్తయత్నము మనలో పురికొలుపుతుంటుంది

రవీంద్రుని కథాగుచ్ఛము మొదటిభాగములోఉన్న కథలు

౧ రాసమణికొడుకు
౨ కాబూలీవాలా
3 భాయిఫోటా
౪ హైమంతి
౫ ఎండా నీడా

రవీంద్రుని కథాగుచ్ఛము రెండవభాగములోఉన్న కథలు

౧ ప్రతిజ్ఞాపాలన
౨ సెలవులు
3 అపరిచితా
౪ మాస్టరుగారు
౫ భార్యవ్రాసిన ఉత్తరము
౬ ఒకటవ నంబరు

---

# పోస్టాఫీస్

మనుష్యుడు ప్రయోగిస్తూఉన్న శిక్షవల్ల లోపునఉన్న జీవనావేగము పూర్తిగా చల్లారని చిన్నపిల్లడు చేసేపనులవల్లా, కోరే కోరికలవల్లా, కనపరిచే అనురాగంవల్లా, పూర్ణవికాసము పొందిన జీవనము ఏరీతిగా ఉంటుందో సూచించే నాటకము.

ఇంపైన కథ చెపుతూ మన మనస్సులను వేదనతో నింపి, ఆ వేదనద్వారా ముక్తజీవనము సంపాదించడానికి చేయవలసిన ప్రయత్నము మనలో పురికొల్పే శక్తి రవీంద్రునిలో చాలా ఉన్నది. ఆ శక్తి ఈ నాటకములో అతి మనోహరముగా వెల్లడి అవుతున్నది.

# స్టిల్ మాండ్ మేజస్ట్రేట్

మాతృభూమి పేరు చెప్పి, నాగరికత విస్తరింపజేయడ
మని వంకపెట్టి, నిజముగా తమనుతాము భ్రమలో పెట్టుకొని
కొందరూ, కేవలము ఇతరులనుమాత్రము భ్రమలో పెట్టి స్వార్థ
మును కోరేవారు కొందరూ, మానవహృదయములో ఉండే
మధురమైనదానిని కాళ్ల కింద వేసి నలిపేయ ప్రయత్నను చేస్తూ
ఉన్నారు. తమలోగాని, ఇతరులలోగాని, గొప్పవారిలోగాని,
బీదవారిలోగాని, తమ దేశస్థులలోగాని, ఇతరదేశస్థులలో
గాని, విలువైనది విలువైనదే గనుక సంరక్షించదగిన దని
నమ్మి తమప్రాణాలనైనా ఇచ్చి కాపాడి ఉంచడానికి సిద్ధముగా
ఉండేవారుకూడా ఈ లోకములో లేకపోలేదు.

**ఈ రెండుతరహాల** స్వభావాలుగల మనుష్యులలో ఉండే,
వ్యత్యాసమూ, వారువారు చేయగల న్యాయాన్యాయాలూ
మనస్సును కరిగించే నాటకను రూపముగా మేతర్‌లింక్
మహాకవి ఈ పుస్తకములో సూచించాడు.

మేతర్‌లింక్ రవీంద్రనాథునివలె 'నొబెల్ ప్రైజ్' అనే
**బహుమానమును** ౧౯౧౧ వ సంవత్సరాన్న పొందాడు.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్
౨౯-౨ ఎస్ప్లనేడ్ చెన్నపురి, ఈ.

చెన్నపురి: వావిళ్లప్రెస్సున ముద్రితము—1929.

